శ్రీరస్తు

# ఆంధ్ర సూత్ర భాష్యము

## అధ్యాయము ౪

---

ఇది

శ్రీమచ్ఛంకరభగవత్పాదకృతియగు

శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యమున

కాంధ్రీకరణముగా

శ్రీ పిఠాపుర మండలాధ్యక్షులగు

శ్రీ శ్రీ శ్రీ రాజారావు వేంకటకుమార మహీపతి

సూర్యారావు బహాదరు ప్రభువువారియాజ్ఞ ననుసరించి

వారి యాశ్రితుఁడగు

పురాణపండ మల్లయ్యశాస్త్రిచే

రచింపఁబడినది

మొదటి కూర్పు 1000

చెన్నపురి:

యాంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము

1922

# ఆంధ్ర సూత్ర భాష్యము

## నాల్గవ యధ్యాయము

---

## విషయ సూచిక

---

# ఆంధ్ర సూత్ర భాష్యము

## అధ్యాయము ౪. పాదము ౧.

---

### ఆవృత్త్యధికరణము. ౧

సూ. ఆవృత్తి రసకృదుపదేశాత్. ౧

ప. ఆవృత్తిః - అసకృదుపదేశాత్.

అ. "శ్రోతవ్య" ఇత్యాదు లగు పెక్కు లుపదేశములు కాన్పించుటవలన శ్రవణాదుల కావృత్తియే కర్తవ్యము.

భా. మూఁడవ యధ్యాయమునఁ బర(=నిర్గుణ)విద్యల యందు నపర(=సగుణ) విద్యలయందు సాధనాశ్రయ మగు విచారము తఱుచుగా నతిక్రమించెను. చాలభాగ మతిక్రమించెనని యర్థము. పిమ్మట నీ నాల్గవ యధ్యాయమున ఫలాశ్రయ మగు విచారము వచ్చును. ప్రసంగాగత మగు నితరముం గొంత చింతింపఁబడును. (పూర్వము సాక్షాచ్ఛ్రుత్యుక్త మగు సన్న్యాసాదిసాధనము చెప్పఁబడెను. ఈ యధ్యాయమున నశ్లేషాధికరణమువఱకును ఫలార్థాపత్తిగమ్య మగు నావృత్త్యాదికము చింతింపఁబడును. అది

మొదలోఁని జీవన్ముక్తియు రెండవ పాదమున నుత్క్రాంతియు మూఁడవ పాదమున నర్చిరాదిగతియు విచారింపఁబడును. నాల్గవపాదమున జ్ఞానోపాసనముల ఫలనిర్ణయము చేయంబడును.) మొదటి కొన్ని యధికరణములచే సాధనాశ్రయ మగు విచారశేషమునే యనువర్తించుచున్నారము. "ఆత్మావారేద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః, తమేవధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః,[3] సోఽన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్య" ఇత్యాది శ్రవణములందు సకృత్ప్రత్యయము (సకృదనుష్ఠానము) కర్తవ్యమా ? వేఱొక పక్షమున నావృత్తి (పలుమాఱనుష్ఠానము) కర్తవ్యమా ? యని సంశయము కలదు. సంశయము కలుగఁగా నేమి ప్రాప్తమయ్యెను? అంతమాత్రముచేతనే శాస్త్రము కృతార్థ మగుటవలనఁ బ్రయాజాదులకువలె సకృత్ప్రత్యయమే కర్తవ్యమని ప్రాప్తమయ్యెను. శ్రూయమాణముకాని యావృత్తి చేయంబడినది యగుచు నుండఁగా నశాస్త్రార్థము చేయంబడినది యగును.

---

౧. అ ౧ పుట ౩౬లో దీని యర్థము వ్రాయఁబడినది.

౨. బృ ౬. ౪. ౨౧. ధీరః=బుద్ధిమంతుఁడైన, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, తమేవ = ఇట్టి (= నిత్యశుద్ధత్వాదిలక్షణములు గల) యాత్మనినే, విజ్ఞాయ=(శాస్త్రమువలన నాచార్యోపదేశమువలనను) దెలిసికొని, ప్రజ్ఞాం=ఉపదిష్టవిషయ మగు విచారమును, కుర్వీత = చేయునది. ప్రజ్ఞాసాధనములగు సన్న్యాసశమదమోపరమాదుల ననుష్ఠించునది యని యర్థము. (నిత్యనైమిత్తికత్యాగము పరమము; తదితరత్యాగము సన్న్యాసమునని భేదము.)

3. ఛాం. ౮. ౭. ౧. అ ౧ పుట ౩౪ లో దీనియర్థముం జూచునది.

అయ్యా! "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య" ఇత్యా దులు పెక్కు లుపదేశము లుదాహరింపఁబడినవి గదా యెట్లు సకృదనుష్ఠానము కర్తవ్యము? ఇట్లయిన నెంతవఱకు శబ్దము బోధించుచున్నదో యంతవఱకే యొకసారి శ్రవణము నొకసారి మననము నొకసారి నిదిధ్యాసనము నావర్తించునదిగాని యధికముగా నావర్తింపరాదు. సకృదుపదేశము లగు "వేద, ఉపాసీత" మొదలగువానియం దనావృత్తియే సిద్ధ మని యిట్లు ప్రాప్తింపఁగాఁ జెప్పుచున్నారము. ఆవృత్తిః= శ్రవణాదుల కావృత్తి (=అభ్యాసము) కర్తవ్యము. దేనివల నను? అసకృదుపదేశాత్="శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య" యను నట్టి యసకృదుపదేశము ప్రత్యయావృత్తిని సూచించు చున్నది (యను కారణము వలనను.) ఓయీ! యెంతవఱకు శబ్దము బోధించునో యంతవఱకే యావర్తించునది గాని యధికముగ నావర్తింపరా దని చెప్పంబడినది యనిన నివి దర్శనపర్యవసానము లగుటవలన నట్లనరాదు. ఎట్లవఘాతాదులు తండులాదినిష్పత్తి పర్యవసానములో యట్లే దర్శనపర్యవసానము లగు శ్రవణాదులు నావర్త్యమానములై దృష్టార్థము లగుచున్నవి గదా! మఱియు నుపాసనము నిదిధ్యాసనము నని యంతర్నీతావృత్తిగుణ యగు క్రియయే చెప్పంబడుచున్నది. లోకమున నట్లేకదా

మెవఁడు తాత్పర్యమున గురువు మొదలగువాని నుపాసించుచున్నాఁడో యతఁడు "గురు ముపాస్తే, రాజాన ముపాస్తే" యని చెప్పంబడుచున్నాఁడు. అట్లే "ప్రోషితనాథాపతి మని" యెవతె పతిని సోత్కంఠయై నిరంతరము స్మరించుచున్నదో యది యిట్లు చెప్పంబడుచున్నది. విద్యుపాస్తులకు వేదాంతములందు వ్యతిక్రమమునం బ్రయోగము కాన్పించుచున్నది. ఒకానొకచో (శ్రుతి) "విది"తో నుపక్రమించి "యుపాస్తి"తో నుపసంహరించుచున్నది. ఎట్లు? "[1]యస్తద్వేదయత్స వేద సమయై తదుక్త" యను చోటను "[2]అనుమ ఏతాం భగవో దేవతాం శాధి యాం దేవతా ముపాస్సే"యని. ఒకానొకచో నుపాస్తితో నుపక్రమించి విదితో నుపసంహరించు

---

౧. ఛాం. ౪. ౧. ౪. సః=రైక్వుఁడు, యత్ = ఏ ప్రాణతత్త్వమును, వేద = ఉపాసించుచున్నాఁడో, తత్ = ఆతత్త్వమును, యః = ఆరైక్వుని కంటె నితరుఁడు నెవఁడు, వేద = ధ్యానించునో, సః = అతఁడు, ఏతత్ = ఉత్కృష్టుఁడని, మయా = నా చేతను, ఉక్తః = చెప్పఁబడినవాఁడు. ఇట్లు హంసరూపమును ధరించిన ఋషులలో మొదటివాఁడు వెనుకటివానితోఁ జెప్పెను.

౨. ఛాం. ౪. ౨. ౨. (జానశ్రుతి గోవులు మొదలగు వానితో రైక్వుం జేరి) భగవః = పూజ్యుఁడ వగు నో రైక్వుఁడా, యాందేవతాం = ఏదేవతను, ఉపాస్సే = నీ వుపాసించుచున్నావో, ఏతాందేవతాం = ఈ దేవతను, (గోవులు మొదలగు నీ పదార్థములను గ్రహించి) మే-అనుశాధి = నాకుఁ జక్కఁగ నుపదేశింపు మని ప్రార్థించెను.

చున్నది. ఎట్లు? "మనో బ్రహ్మేత్యుపాసీత" యనుచోటను "భాతిచ తపతిచ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద" యని. కాఁబట్టి సకృదుపదేశమునందు నావృత్తి సిద్ధించును. అసకృదుపదేశ మావృత్తికి సూచకము.

సూ. లింగాచ్చ. ౨

ప. లింగాత్ - చ.

అ. ఉద్గీథవిద్యయందుఁ బ్రత్యయావృత్తి కాన్పించుట వలనను శ్రవణాదుల కావృత్తియే సిద్ధము.

భా. లింగాచ్చ=లింగముసైతము ప్రత్యయావృత్తిని వ్యపదేశించుచున్నది. పెక్కుమారు లుపదేశించుట వలననే కాక లింగమువలనను సాక్షాత్కారఫలము లగు విద్యాసాధనములందుఁ బ్రత్యయావృత్తి సిద్ధమని యర్థము. అదియె ప్రతిపాదింపఁబడుచున్నది. "ఆదిత్య ఉద్గీథ"[3] యని యుద్గీథోపాసనముం బ్రారంభించి దాని నేకపుత్త్రతాదోషమున నపవ

౧. ఛాం. 3. ౧౮. ౧. మనః = అంతఃకరణమును, బ్రహ్మేతి = పరమగు బ్రహ్మ మని, ఉపాసీత = ధ్యానించునది.

౨. ఛాం. 3. ౧౮. 3. యః=ఎవఁడు, ఏవంవేద = ఇట్లుపాసించుచున్నాఁడో, సః=అతఁడు, కీర్త్యా=ప్రత్యక్షమగు కీర్తిచేతనను, యశసా=పరోక్షమగు యశముచేతనను, బ్రహ్మవర్చసేన = వృత్తాధ్యయనాది సంపదతోడను, భాతిచ - తపతిచ = విలసిల్లుచున్నాఁడు, మహానుభావుండుఁ డగుచున్నాఁడును.

3. ఛాం. ౧. ౫. ౧. ఆదిత్యః = ఈ సూర్యుఁడు, ఉద్గీథః = ప్రణవము. ఉద్గీథావయవ మగు నోంకారమున నాదిత్యదృష్టి చేయునది యని యర్థము.

దించి "రశ్మీం స్త్వం పర్యావర్తయాత్త" ని రశ్మి బహుత్వోపా-
సనమును బహుపుత్త్రత్వముకొఱకు విధించుచున్న వాక్యము
సిద్ధమైనదానినివలెఁ బ్రత్యయావృత్తిని జూపుచున్నది.
(ఇదియే లింగము) సాక్షాత్కారఫలముగలవి యగుటచే మీఁదఁ
జెప్పంబడిన యుద్గీథోపాసనముతో సాదృశ్యమువలన నహం
గ్రహోపాసనములందును శ్రవణాదులందు నావృత్తి సిద్ధి
యగును. ఇట నహంగ్రహోపాసనములందు (సగుణధ్యా
నాదులందు) వృత్తి సాధ్యమగు నతిశయము సంభవించుట
వలన సాధ్యఫలము లగు నాప్రత్యయములం దావృత్తి సంభ
వించిన సంభవించును; కాని పరబ్రహ్మవిషయ మగు నే
ప్రత్యయము (శ్రవణాదికము) నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము
నాత్మభూతముం బరము నగు బ్రహ్మమునే సమర్పించునో
యట నావృత్తి యేమిఫలము కలది యగు నని (పూర్వపక్షి)
యాక్షేపించుచున్నాఁడు. సకృచ్ఛ్రుతి కలిగినను (=ఒకసారి
శ్రవణము కలిగినను) బ్రహ్మాత్మత్వప్రతీత్య నుపపత్తివలన
(అవిద్యాధ్వంసము సంభవింపమివలన బ్రహ్మాత్మసాక్షాత్కా

౧. ఛాం. ౧. ౫. ౭. ఇట్లాదిత్యునకుఁ గిరణములకు నభేదముం గల్పించి యుపాసించుటచే నాకు నీవొక్క కుమారుఁడవే జన్మించితివి కాఁబట్టి, త్వం = నీవు, రశ్మీన్ = కిరణములను (సూర్యుని) పర్యావర్తయాత్ = (పర్యావర్తయతాత్) వేఱువేఱుగా నుపాసింపుము. నీ కనేకులు తనయులు గలుగుదురని కౌషీతకి తనకుమారునితోఁ జెప్పెను.

రము సంభవింపదు గనుకఁ దదర్థముగా) నావృత్త్య
భ్యుపగమ మని (సిద్ధాంతి) యనిన నావృత్తి చేసినను దాని
యనుపపత్తివలన నట్లనరాదు. "తత్త్వమసి" యను వాక్య
మొకసారి వినంబడినదియగుచునుండఁగా బ్రహ్మాత్మత్వసాక్షాత్కా
రమును బుట్టింపఁజాలదేని యదియె మరలమరల నావర్తింపఁబడు
చున్నదియై యట్టిసాక్షాత్కారముఁ బుట్టించుననునాశ యెట్లుండు
ను? కేవల మగువాక్యమే యర్థమును సాక్షాత్కరింప జేయఁజాల
దు; కాఁబట్టి యుక్త్యపేక్షమైన వాక్యము బ్రహ్మాత్మత్వము ననుభ
వింపం జేయఁగలదని చెప్పంబడునేని యట్లైన నా యుక్తియు
నొకతడవ ప్రవృత్తమై స్వార్థము ననుభవింపఁ జేయఁగలదు
కాఁబట్టి యావృత్తి కానర్థక్యమే. ఎట్లు నాహృదయమున
శూలము గల దను వాక్యమువలనను శరీరకంపము మొద
లగు లింగమువలనను శూలసద్భావసామాన్యమునే శూలి
కంటె నితరుఁడు తెలిసికొనుచున్నాఁడు గాని యెట్లాశూలి
వలె విశేషముం దెలియం జాలఁడో యట్లే యుక్తిచేతను
వాక్యముచేతను సామాన్యవిషయ మగు విజ్ఞాన (పరోక్ష
జ్ఞాన)మే చేయంబడుచున్నది గాని విశేషవిజ్ఞానము చేయం
బడదు; విశేషవిజ్ఞాన (అపరోక్షజ్ఞాన) మవిద్యానివర్తకము
కాఁబట్టి తదర్థ మావృత్తి కావలె నన్నఁ దావన్మాత్రము
పెక్కుమా రాచరింపఁబడినను విశేషవిజ్ఞానోత్పత్త్య

సంభవమువలన నావృత్తి నిరర్థకమే. ఒకసారి ప్రయుక్త
మైన శాస్త్రయుక్తులచే నవగతము కాని విశేషము
నూఱుసారులు ప్రయోగింపఁబడిన వాని చేతనను
దెలియ శక్యము కాదు. కాఁబట్టి శాస్త్రయుక్తులచే విశే
షము ప్రతిపాదింపఁబడినను బహ్వాంతరమున సామాన్యమే
ప్రతిపాదింపఁబడినను రెండుప్రకారములచేతను సకృత్ప్ర
యుక్తము లయియే శాస్త్రయుక్తులు తమ కార్యముం
జేయుచున్నవి కాఁబట్టి యావృత్తి కనుపయోగమే. మఱియుఁ
దెలిసికొనువారు విచిత్రప్రజ్ఞకలవా రగుటవలన నొక్కసారి
ప్రయుక్తము లైనశాస్త్రయుక్తు లేవానికి ననుభవము నుత్ప
దింపఁజాల వని నిర్ణయింప నశక్యము. మఱియు ననేకాంశ
ములు గలదియు సామాన్యవిశేషములు గలదియు నగు
లౌకికపదార్థమునందు దీర్ఘప్రపాఠకగ్రహణాదు లందువలె
నొక యవధానముచే నొకయంశమును వేఱొక యవధాన
ముచే నింకొక యంశమును నిర్ధారించుచున్నాఁడు గనుక
నభ్యాసమున కుపయోగము సంభవించునుగాని నిర్విశేషము
సామాన్యవిశేషరహితముం జైతన్యమాత్రస్వరూపము నగు
బ్రహ్మవిషయమై ప్రమోత్పత్తి కభ్యాసాపేక్ష యుక్తము
కా దని (పూర్వపక్షి) యనిన (సిద్ధాంతిచే) నిటుఁ జెప్పంబడు
చున్నది. ఎవఁడు "తత్త్వమసి" యని యొకసారియే చెప్పం

బడిన బ్రహ్మాత్మైక్య మనుభవింప శక్తుఁ డగుచున్నాఁడో యతని కావృత్తి నిరర్థకమే కాని యెవఁడు శక్తుఁడు కాఁడో యతని కావృత్తి యుపయోగించు ననే యున్నది. అది యెట్లన్నం బ్రతిపాదింపంబడుచున్నది. ఛాందోగ్యమునను "తత్త్వ మసి" యని యుపదేశించి "భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయ తు"ని మరల మరలఁ బ్రచోద్యమానుఁడై యాయా యాశంకా కారణమును నిరాకరించి తత్త్వమసి యనియే పలుమాఱు ఉపదేశించు చున్నాఁడు. అట్లే "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య" ఇత్యాదికము చూపంబడినది. ఓయీ! "తత్త్వమసి" యను వాక్య మొకసారి స్రుతమై తన యర్థము ననుభవింపఁ జేయఁజాలదేని పిమ్మట నావర్త్యమానమయ్యు శక్తము కాదని చెప్పంబడినది యనిన "నహి దృష్టే ఽనుపపన్నం నామ" యను న్యాయమున నిది దోషము కాదు. దృష్టమగు నర్థమునం దనుపపత్తి లేదు కాఁబట్టి యిది దోషము కాదని యర్థము. ఒకసారి విన్న వాక్యమువలన మందముగాఁ దెలియంబడిన వాక్యార్థము నావర్తించుచున్నవారై యాయా(యర్థా)భాసముల నిరాకరించి చక్కని యర్థమును గ్రహించువారు కాన్పించుచున్నారు గదా! మఱియును "తత్త్వమసి" యను నీవాక్యము త్వంపదార్థమునకుఁ దత్పదార్థభావమును జెప్పు

---

౧. ఛాం. ౬ ౮. ౭. భూయ్యాఁడ వగు నోతం డ్రీ నాకు మరల నుపదేశింపుము.

చున్నది. తత్పదముచేఁ బ్రకృతమును జగమునకు జన్మాదికారణమును సత్తునిశ్చితయును, "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ,[1] విజ్ఞానమానందం బ్రహ్మ,[2] అదృష్టం ద్రష్టృ, అవిజ్ఞాతం విజ్ఞాతృ,[3] అజ మజరం,[4] అస్థూల మనణ్వ హ్రస్వమ దీర్ఘమి"[5]త్యాది శాస్త్ర ప్రసిద్ధము నగు బ్రహ్మము చెప్పంబడుచున్నది. అందజాది శబ్దములచే జన్మాదు లగు భావవికారములు నిరాకరింపఁబడుచున్నవి. అస్థూలాది శబ్దములచే ద్రవ్యధర్మము లగు స్థౌల్యాదులు నిరాకరింపఁబడు చున్నవి. విజ్ఞానాది శబ్దములచేఁ జైతన్య ప్రకాశాత్మకత్వము చెప్పంబడినది. ఈవ్యావృత్త సర్వసంసారధర్మకము ననుభవాత్మకమును బ్రహ్మసంజ్ఞికము

---

౧. తై. ౨. ౧. ౧. అ ౧ పుట ౧౦౭ లో దీని యర్థము వ్రాయఁబడినది.

౨. బృ. ౫. ౯. ౨౮. విజ్ఞానం=విజ్ఞప్తియును, ఆనందం = విషయజ్ఞానమువలె దుఃఖములోఁ గూడినది గాక ప్రసన్నము, శివము, నిర్మలము, ఏకరసము, నిత్యతృప్తము నగు బ్రహ్మ = బ్రహ్మము (ధనమునకును గర్మము జేయు యజమానునకును బరమగతి.)

3. బృ. ౫. ౮. ౧౧. (ఓ గార్గీ! యీ యక్షరపదార్థము) అదృష్టం= విషయము కాకపోవుటవలన నే వానిచేతం జూడంబడనిదియును, ద్రష్టృ= దృక్స్వరూప మగుటవలనఁ జూచునదియును, అవిజ్ఞాతం=బుద్ధికి విషయము కాకపోవుట వలనఁ దెలియఁబడనిదియును, విజ్ఞాతృ = విజ్ఞానస్వరూప మగుటవలనఁ దెలిసికొనునదియును. (ఆ యక్షరముకంటె నితర మెద్దియును జూచునది కాని తెలియునది కాని లేదని యర్థము.)

౪. నృసింహోత్తరతాపిని ౭. బ్రహ్మము జన్మజరామరణాది భావవికారములు లేనిదని యర్థము.

౫. బృ. ౫. ౮. ౮. ద్రవ్యాదిధర్మము లగు స్థౌల్యాదులు లేనిదానినే బ్రాహ్మణాదు లక్షరమని చెప్పుదురని యాజ్ఞవల్క్యుఁడు గార్గితోఁ జెప్పెను.

నగు తత్పదార్థము వేదాంతాభియుక్తులకు (ఉపనిషదర్థము నెఱిఁగిన విద్వాంసులకు)ఁ బ్రసిద్ధము. అట్లే త్వంపదార్థమును దేహము మొదలుగాఁ జైతన్యమంతముగాఁ బ్రత్యగాత్మ యని సంభావింపఁబడుచున్న శ్రోత(యోఽయం విజ్ఞానమయ ఇత్యాది శ్రుతులచే) నిర్ధారితుఁడు. అట్లగుచు నుండఁగా వాక్యార్థ జ్ఞానము పదార్థ జ్ఞానపూర్వక మగుటవలన నెవరికి తత్త్వం పదార్థము లజ్ఞానప్రయుక్తసంశయ విపర్యయములచేఁ బ్రతి బద్ధములో వారికి "తత్త్వమసీ"త్యాది వాక్యము స్వార్థమునం బ్రమను బుట్టింపంజాల దను కారణమువలన వారికిఁ బదార్థ వివేక ప్రయోజన మైన శాస్త్రయుక్త్యావృత్తి యవశ్యము కావలెను. పరికింపఁగాఁ బ్రతిపత్తవ్యుఁ డగు నాత్ముఁడు నిరంశుఁడే యైన నతనియందు దేహేంద్రియ మనోబుద్ధి విషయ వేదనాది లక్షణ మగు ననేకాంశత్వ మారోపింపఁ బడినది. అందొక యవధానముచే నొక యంశమును వేఱొక దానిచే నింకొక యంశమును నిరాకరించుకొను చున్నాఁడు కాఁబట్టి యటుఁ గ్రమముగల ప్రతిపత్తి సంఘటిల్లును. (ఆరోపితము వ్యావర్త్యము నగు నంశబాహుల్యమువలనఁ బ్రతిపత్తికిఁ గ్రమవత్త్వము సార్థకమని యర్థము.) అది (=క్రమజాతమైనజ్ఞానము) బ్రహ్మాత్మసాక్షాత్కారమునకుం బూర్వరూపమే. ఏబుద్ధిమంతులకు నజ్ఞానసంశయవిపర్యయలక్షణ మగు ప్రతిబంధము

పదార్థవిషయ మైనది లేదో వారొకసారియే చెప్పంబడిన "తత్త్వమ" సీత్యాది వాక్యార్థము ననుభవింప శక్తులగు చున్నారు కాఁబట్టి వారి కావృత్త్యానర్థక్య మిష్టమే. ఆత్మ ప్రతిపత్తి యొకసారి యుత్పన్నమైనదియే యగుచు నవిద్యను నివర్తింపఁజేయును గనుక నట నెద్దియుఁ గ్రమ మంగీకరింపఁ బడదు. సత్యమే. ఎవనికైన నిట్టిజ్ఞానము కలుగునేని యిట్లు పొసఁగును. ఆత్మునకు దుఃఖిత్వాది ప్రతిపత్తిబలవతి యగుటం జేసి దుఃఖిత్వాద్యభావము నెవ్వఁడుం దెలియంజాలఁ డనిన దేహాద్యభిమానమునకు వలె దుఃఖిత్వాద్యభిమానమునకును మిథ్యాభిమానత్వ (=భ్రాంతత్వ) ముపపన్న మగుటవలన నట్లు నరాదు. ప్రత్యక్షముగా దేహమును నఱకుచుండఁగా నన్నే నఱకుచున్నాఁడనియును, దేహమును దహించు చుండఁగా నన్నే దహించుచున్నాఁ డనియును మిథ్యాభిమానము కాన్పించుచున్నది. అట్లే బాహ్యతరులగు పుత్త్ర మిత్త్రాదులు తపించు చుండఁగా నేనే తపించుచున్నా నను నధ్యారోపము కాన్పించుచున్నది. అట్లే, దుఃఖిత్వాదులును దేహాదులువలెఁ జైతన్యముకంటె వెలుపల సాక్షాత్కరించుచున్నవి యగుట వలన దుఃఖిత్వాద్యభిమానమును మిథ్యయే. దుఃఖాదులును దేహాదులువలె వేద్యములగుటవలన నాత్మధర్మములు కావని యర్థము. అవి సుషుప్త్యాదులందు ననువృత్తములు కాకపోవుట

వలన నాత్మస్వరూపములుం గావు. (శ్రుతి) "[1]యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతీ"త్యాది వాక్యములచే జైతన్యమునకు సుషుప్తమునందు ననువృత్తిం జెప్పుచున్నది. నిర్దుఃఖమగు చిదాత్మయందు దుఃఖాదిబుద్ధి భ్రాంతియగుటవలన సర్వదుఃఖ వినిర్ముక్తైక చైతన్యాత్మకుఁడ నే నను నాత్మానుభవము విరుద్ధము కాదు. ఇట్లాత్మానుభవము కలవానికి వేఱొకకృత్యమెద్దియు లేదు. "[2]కిం ప్రజయా కరిష్యామో యేషాన్నోయమాత్మాయం లోక" యని శ్రుతి యట్లే యాత్మజ్ఞానము గలవానికిఁ గర్తవ్యాభావముం జూపుచున్నది. "[3]యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ఆత్మన్యేవచ సంతుష్టస్తస్య కార్యం నవిద్యతే" యని స్మృతియు నట్లే చెప్పుచున్నది. ఎవనికి

---

౧. బృ. ౬. ౩. ౨౩. సుషుప్త్యవస్థయందుఁ దెలిసికొనక పోవుట యనునది తెలిసికొనఁదగిన వేఱువస్తువు లేకపోవుటచేఁ గాని తెలిసికొను తెల్వి లేకపోవుటచేఁ గాదని యర్థము.

౨. బృ. ౬. ౪. ౨౨. ఏ మనకీయాత్మయే స్వరూపమును భోగ్యమునో యా మనము సంతానాదులతో నేమి సాధింతుమని తలఁచి ప్రాచీనులగు బ్రహ్మవిదులు సర్వముం బరిత్యజించి (= సన్న్యసించి) భిక్షావృత్తిం జేయుచున్నా"ని యర్థము.

౩. భగ. ౩. ౧౭. యః - మానవః = జ్ఞానియగు నే మనుజుఁడు, ఆత్మరతిరేవ = ఆత్మయందే యాసక్తి కలవాఁడు (కాని విషయాసక్తుఁడు కాఁడో) ఆత్మతృప్తశ్చ = ఆత్మయందే తనివిఁ జెందువాఁడు (కాని యన్నరసాదులం దనివిఁ జెందువాఁడు కాఁడో) ఆత్మన్యేవ = స్వరూపమునందే, సంతుష్టశ్చ = సంతసించువాఁడు (కాని బాహ్యార్థలాభమున సంతసించు వాఁడు కాఁడో) తస్య = అతనికిఁ, కార్యం = చేయఁదగిన పని యెద్దియు నవిద్యతే = లేదు.

యనుభవము శీఘ్రముగఁ గాదో యతని కీయాత్మానుభ వార్థమే శ్రవణాదులకు నావృత్త్యభ్యుపగమము. ఆవృత్త్యభ్యుపగమ మున్నను "తత్త్వమసి" యను వాక్యార్థమునుండి (నేను కర్తఁగానను ననుభవమునుండి) తొలఁగించి యెవఁడు నావృత్తియందు (నియోగమువలనం) బ్రవర్తిల్లఁ జేయరాదు. వరఘాతము కొఱకుం గన్యను బెండ్లి చేయరుగదా! నియుక్తునకు నేను దీనియం దధికృతుఁడను గర్తను నాకిది గర్తవ్యమని యవశ్యము బ్రహ్మజ్ఞానము కంటె విపరీతజ్ఞానము పుట్టుచున్నది. ఎవఁడు మందమతియై యసంభావనాదికముచే నప్రతిభానమువలన నావాక్యార్థమును విడువం దలంచునో యతని కావాక్యార్థమునందే "శ్రోతవ్య" యను నది మొదలగు వాక్యముల యావృత్తిచే నిపుణముగా స్థిరీకారమును గలిగించునది. కాఁబట్టి సగుణ బ్రహ్మవిద్యయందు స్వరూపావృత్తివలె నిర్గుణ బ్రహ్మవిద్యావిషయమై యుపాయము లగు శ్రవణాదులందు నావృత్తిచే ననుష్ఠానము సిద్ధించును.

ఇది ప్రథమాధికరణము.

---

ఆత్మాధికరణము. ౨

సూ. ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతిచ 3.

ప. ఆత్మా-ఇతి-తు-ఉపగచ్ఛంతి-గ్రాహయంతి-చ.

అ. జాబాలు రట్లు చెప్పుచున్నారు గావునను వేదాంత వాక్యము లట్లే తెలుపుచున్నవి గావునను శాస్త్రోక్తలక్షణములుగల పరమాత్ముఁడు నేనని యే ధ్యానము చేయునదిగాని నాకంటె వేఱగు నాస్వామి యని ధ్యానింపవలదు.

భా. పూర్వము శ్రవణమనన నిదిధ్యాసనముల కావృత్తి చెప్పంబడెను. (వానిలో నిదిధ్యాసన (ధ్యాన)మునందు) శాస్త్రోక్త విశేషణములు గల పరమాత్మ యెవ్వఁడో యతఁడు నేనని ధ్యానింపం దగినవాఁడా ? నాకంటె నన్యుఁడు (నాస్వామి) యని ధ్యానింపం దగినవాఁడా ? యని విచారించుచున్నాఁడు. ఆత్మశబ్దము ప్రత్యగాత్మవిషయమై వినంబడుచున్నది యగుచు నుండఁగా నెట్లు సంశయము కలుగు ననినఁ జెప్పంబడుచున్నది. ఈయాత్మశబ్దము జీవేశ్వరుల కభేదము సిద్ధించు చుండఁగా ముఖ్యమనియు నభేదము సిద్ధింపనిది యగుచు నుండఁగా గౌణమనియు నభ్యుపగంతవ్యమని తలంచుచున్నాఁడు. సంశయము కలుగఁగా నేమిప్రాప్తమయ్యెను ? అపహతపాప్మత్వాది గుణములు కలవాఁడు విపరీతగుణములు కలవాఁడని కాని విపరీతగుణములుకలవాఁడపహత పాప్మత్వాది గుణములు కలవాఁడని కాని గ్రహింప శక్యము కాకపోవుటవలనఁ బరమేశ్వరుఁడు నేనని ధ్యానింపం దగఁడని ప్రాప్తమయ్యెను. ఈశ్వరుఁ డపహతపాప్మత్వాది

గుణములు కలవాఁడును శారీరుఁడు దద్విపరీత గుణములు కలవాఁడునుగదా ! మఱియు నీశ్వరునకు సంసార్యాత్మభావము కలుగుచుండఁగా నీశ్వరాభావ ప్రసంగము వచ్చును. అట్లగుటవలన శాస్త్రమున కానర్థక్యము ప్రాప్తించును. శారీరునకు నీశ్వరాత్మత్వము గలుగుచుండఁగాను నధికారి లేకపోవుటవలన శాస్త్రమున కానర్థక్యమే; మఱియుఁ బ్రత్యక్షాది విరోధమును సంభవించును. జీవేశ్వరులు పరస్పర భిన్ను లైనను శాస్త్రమువలనఁ దాదాత్మ్యదర్శనము (=ఐక్యధ్యానము) ప్రతిమాదులందు విష్ణ్వాదిదర్శనమువలెఁ జేయం దగినది యనిన నవశ్యము నిట్లు చేయవచ్చును గాని సంసారికి ముఖ్యుఁడగు నాత్ముఁడు పరమేశ్వరుఁడు గాఁడను నింతమాత్రమే మాకుఁ గావలసినదని యిట్లు ప్రాప్తింపఁగాఁ బరమేశ్వరుఁ డాత్మయనియే (నేననియే) ధ్యానింపం దగినవాఁ డని చెప్పుచున్నారము. అదియుక్తమును. జాబాలురు పరమేశ్వర ప్రకరణమునను [౧]"త్వంవా అహ మస్మి భగవో దేవతే అహం వైత్వమసి భగవో దేవతే" యని పరమేశ్వరునిని, ఆత్మేతితు= ఆత్మయనియే, అభ్యుపగచ్ఛంతి = అంగీకరించు చున్నారు. అట్లే "అహంబ్రహ్మాస్మి" యనునది మొదలగు నితరము లైన

౧. ఓ దేవతా ! నీవు నేనును నేను నీవు నగుదుము.

యాత్మత్వ బోధకములును గాన్పించుచున్నవి. "ఏషత ఆత్మాంతర్యామ్యమృతః, ఏషత ఆత్మాసర్వాంతరః, తత్సత్యం స ఆత్మా తత్త్వమసి" యనునవి మొదలుగాఁగల వేదాంతవాక్యము లీశ్వరు నాత్మగానే, గ్రాహయంతిచ = బోధించుచున్నవియును. ఈ జీవేశ్వర తాదాత్మ్యము విష్ణుప్రతిమాన్యాయముచేఁ బ్రతీకధ్యానము కావచ్చునని యెద్ది చెప్పంబడినదో యది గౌణత్వప్రసంగము వలనను వాక్యవైరూప్యము వలనను యుక్తము కాదు. ఎక్కడఁ బ్రతీకధ్యానము పదేశింపఁబడు చున్నదో యటను "మనో[4]బ్రహ్మ, ఆదిత్యో[5]

---

౧. బృ. ౫. ౭. ౩. అమృతః = సర్వసంసారధర్మవర్జితుఁ డగు, ఏషః = ఈ, తే=నీయొక్క (యీ వారియొక్కయు నెల్లజంతులయొక్కయు) ఆత్మా = ఆత్మఁడే, అంతర్యామీ = అంతర్యామి యని (పృథివ్యాదులలోపలనుండి వానిఁ బ్రేరించువాఁడని) యాజ్ఞవల్క్యుఁడు గౌతమునితోఁ జెప్పెను. (ఈ శ్రుతికి ౧ అధ్యాయము ౭౧౦-వ పుటలో నర్థము విశేషించి వ్రాసితిని)

౨. బృ. ౫. ౪. ౧. ఏషః = ఎవఁడు ప్రాణాదులం దత్తద్వ్యాపారములం బ్రేరించునో యీయా, తే = నీయొక్క ఆత్మా = ఆత్మఁడే, సర్వాంతరః = ఎల్లవానికి నభ్యంతరుఁ డగు వాత్మఁడు.

౩. ఛాం. ౬. ౮. ౭ తత్ = అసద్రూపమగుకారణము, సత్యం= పరమార్థసత్యము (కాఁబట్టి) సః = అదియే, ఆత్మా = జగమున కాత్మ (కనుకనే) తత్ = అసత్తే, త్వం = నీవు, అసి = అగుదువు.

౪. ఛాం. ౩. ౧౮. ౧. మనః=అంతఃకరణమును, బ్రహ్మ=బ్రహ్మమని యుపాసించునది.

౫. ఛాం. ౩. ౧౯. ౧ ఆదిత్యః=సూర్యుఁడు, బ్రహ్మేతి=బ్రహ్మమని, ఆదేశః = ఉపదేశము.

బ్రహ్మాత్మ్యాదేశ" యని యొక్కసారియే శ్రుతివచన మున్నది.
ఇట నీవు నే నగుచున్నాను; నేను నీ వగుచున్నావని శ్రుతి
చెప్పుచున్నది. కాఁబట్టి ప్రతీకశ్రుతి వైరూప్యమువలన (జీవేశ్వ
రులకు) నభేద ప్రతిపత్తి ముఖ్యమే. మఱియు భేద
దృష్ట్యపవాదము వలనను నట్లే. భేదదృష్ట్యపవాదము
ప్రతిపాదింపఁ బడుచున్నది. "[౧]అథయోఽన్యాం దేవతా ముపా
స్తేఽన్యోఽసావన్యోఽహ మస్మీతి న స వేద, మృత్యోస్స
మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి, [౩]సర్వం తం పరాదా
ద్యోఽన్యత్రాత్మన స్సర్వం వేద" యనునది మొదలగు ననేక శ్రుతి
జాతము భేదదృష్టి నపవదించుచున్నది. విరుద్ధగుణములు గల
జీవేశ్వరుల కన్యోన్యాత్మత్వము సంభవింప దని యెద్ది చెప్పఁ
బడినదో యది విరుద్ధగుణత్వమునకు మిథ్యాత్వోపపత్తి వలన

---

౧. బృ. ౩. ౪. ౧౦. అథ = పిమ్మటను, యః = ఎవఁడు, అన్యాం దేవతాం = ఆత్మవ్యతిరిక్త యగు దేవతను, అసౌ - అన్యః - అహం - అన్యః - అస్మీతి = ఈ యుపాస్యదేవత వేఱు నే నీ దేవతకంటె భిన్నుఁడ నని, ఉపాస్తే = ఉపహారాదులచే నర్చించునో, సః = అతఁడు, నవేద = ఎఱుఁగఁడు.

౨. బృ. ౬. ౪. ౧౯. యః = ఎవఁడు, ఇహ = ఏకరస మగు బ్రహ్మమునందుఁ, నానేవ = భేద మున్నట్లు, పశ్యతి = తలఁచుచున్నాఁడో, సః = అతఁడు, మృత్యోః = మరణమువలననుండి, మృత్యుం = మరణమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు. సంసారమునుండి మరల సంసారమును పొందుచున్నాఁ డని యర్థము.

౩. బృ. ౬. ౫. ౭. యః = ఎవఁడు, సర్వం = ఎల్లపదార్థజాతమును, ఆత్మనః - అన్యత్ర = ఆత్మునికంటె భిన్నముగ నున్నదని, వేద = తెలిసికొనుచున్నాఁడో, తం = ఆమిథ్యాదర్శిని, సర్వం = ఎల్లపదార్థజాతమును, పరాదాత్ = శ్రేయోమార్గమునుండి తొలఁగించును.

దోషము కాదు. ఈశ్వరునకు సంసార్యాత్మత్వము గలుగు చుండఁగా నీశ్వరాభావము ప్రసక్తించు నని యెద్ది చెప్పఁబడి నదో యదియును శాస్త్రప్రామాణ్యమువలన నంగీకారము వలనను యుక్తము కాదు. ఈశ్వరునకు సంసార్యాత్మత్వము ప్రతిపాదింపఁ బడుచున్నది యని యంగీకరింపము గదా! మఱేమి యను దంగీకరింతు రనిన సంసారికి సంసారిత్వ నిరాకరణముచే నీశ్వరాత్మత్వము ప్రతిపాదింపఁ గోరంబడుచున్నది యని యంగీకరింతుము. ఇట్లగుచు నుండఁగా నద్వైతేశ్వరునకు నపహతపాప్మత్వాదిగుణత్వము నితరునకు విపరీత గుణత్వము నిశ్చయించి స్థిరపడుచున్నది. సంసారి కీశ్వరాత్మత్వము గలుగుచుండఁగా నధికార్యభావముం బ్రత్యక్షాదివిరోధముం బ్రసక్తించునని యెద్ది చెప్పఁబడినదియో యదియును బ్రబోధముకంటెం బూర్వము సంసారిత్వాభ్యుపగమము వలనను బ్రత్యక్షాదివ్యవహారము తద్విషయ (సంసారివిషయ) మగుట వలనను యుక్తము కాదు. "యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్తత్కేన కం పశ్యేది"[1]త్యాదులచే శ్రుతి ప్రబోధము గలుగుచు నుండఁగాఁ బ్రత్యక్షాభావముఁ జూపుచున్నది. స్వప్నాద్యా

౧. బృ ౬ ౫. ౧౫. యత్ర = ఏ విద్యావస్థయందున్, అస్య = చూచువానికిన్, సర్వం = అంతయును, ఆత్మైవ = ఆత్మస్వరూపమే, అభూత్ = అయ్యెనో, తత్ = ఆ యవస్థయందున్, కేన = ఏ సాధనము చేతను, (ఏకర్త) కం = దేనిని, పశ్యేత్ = చూచును? జ్ఞానము కలిగినపుడు దర్శనాదివ్యవహారము లేదని యర్థము.

ద్యభావము గలుగుచుండఁగా శ్రుతికి నభావప్రసంగము వచ్చు
ననిన నిష్టమగుట వలన నిది దోషము కాదు. "అత్ర[1] పితాఽ
పితా భవతి" యని యుపక్రమించి చెప్పంబడిన "వేదా
అవేదా"యను వచనమువలనఁ బ్రబోధకాలమున శ్రుతికి నయి
త మభావము మాచేనంగీకరింపఁబడుచున్నదియే. ఈయప్రబో
ధ మెవనికనిన నగుచున్న నీకని చెప్పుచున్నారము. అయ్యా!
శ్రుతిచే నే నీశ్వరుఁడనే యని ప్రతిబోధింపఁబడితి ననిన నిట్లు
ప్రతిబుద్ధుఁడ వైతేని యెవ్వనికి న ప్రతిబోధము లేదు. అనుభవ
సిద్ధమగు నజ్ఞానమున కపలాపము సంభవింపక పోవుటవలన
నభేదజ్ఞానమునకుం బూర్వము చిన్మాత్రుఁడవగు నీవే యజ్ఞాన
మునకాశ్రయమవు; జ్ఞానము గలుగుచుండఁగా ననిర్వాచ్య
మగుదానికి బాధమువలన నాశ్రయాపేక్ష లేదు. కాం
దఱచే నవిద్యచే నాత్మునకు సద్వితీయత్వము ప్రాప్తిం
చుట వలన నద్వైతానుపపత్తియను నే దోషము చెప్పంబడి
నదో యదియు నిట్లనుట (అజ్ఞాన మనిర్వాచ్యమనుట)చే
నిరాకరింపఁ బడినది. కాఁబట్టి=అభేదశ్రుతులకు ముఖ్యార్థ
త్వము సిద్ధమగుటవలన నీశ్వరునందు నేనని యే మనసునిల్పునది.

ఇది ద్వితీయాధికరణము.

---

౧. బృ. ౪. ౩. ౨౨ అత్ర = ఈ సుషుప్త్యవస్థయందు, (ఆత్మఁడు కర్మసంబంధమును విడిచి కేవలస్వరూపమున నుండును గాఁబట్టి) పితా-అపితా-భవతి=తండ్రి తండ్రి గాఁడు. (అట్లే) వేదాః-అవేదాః = వేదములు వేదములు గావని యర్థము.

## ప్రతీకాధికరణము. ౩

సూ. నప్రతీకే న హి సః. ౪

ప. న-ప్రతీకే-న-హి-సః.

అ. ఉపాసకుఁడు ప్రతీకముకంటె నభిన్నుఁడు కాఁడు కాఁబట్టి ప్రతీకములందు నేనను ధ్యానముం జేయరాదు.

భా. "మనో[౧] బ్రహ్మే త్యుపాసీతే త్యధ్యాత్మ మథాధిదైవత మాకాశో బ్రహ్మేతి" యనునదియు నట్లే "ఆదిత్యో[౨] బ్రహ్మేత్యాదేశః" యనునదియు, "[౩]సయో నామ బ్రహ్మేత్యుపాస్తే" యనునదియు మొదలుగాఁ గల ప్రతీకోపాసనములందు నాత్మగ్రహము కర్తవ్యమా? కాదా? యను సంశయము గలదు. (వేఱొక వస్తుజ్ఞానమును మఱియొక వస్తువునందు నిల్పుట= ప్రతీకోపాసనము. ఉపాస్తిస్థానము ప్రతీకము.) సంశయము కలుగఁగా నేమి ప్రాప్త మయ్యెను? ప్రతీకములం దాత్మగ్రహము కావించుట యుక్త మని ప్రాప్తమయ్యెను. దేనివలనను? బ్రహ్మము శ్రుతులయం దాత్మ యని ప్రసిద్ధ

౧. ఛాం. ౩. ౧౮. ౧. అంతఃకరణము బ్రహ్మ మని యధ్యాత్మము, ఆకాశము బ్రహ్మ మని యధిదైవతము నుపాసించునది.

౨. ఛాం. ౩. ౧౯. ౧. సూర్యుఁడు బ్రహ్మ మని యుపదేశము

౩. ఛాం. ౭. ౧ ౫. సయః = ఎవఁడు, నామ - నామమును, బ్రహ్మేతి = బ్రహ్మమని, ఉపాస్తే - ఉపాసించునో, (యతనికి నామ గోచర మగు దేశమున స్వేచ్ఛాసంచారము సంభవించును.)

మగుటవలనను, ప్రతీకములును బ్రహ్మవికారము లగుటవలన (వానికి) బ్రహ్మత్వము గలుగుచుండఁగా నాత్మత్వ మువపన్న మగుటవలవ నని యిట్లు (పూర్వపక్షము) ప్రాప్తింపఁగాను, ప్రతీకేషు = మనము మొదలగు ప్రతీకములందుఁ, న=ఆత్మబుద్ధిం జేయరా దని చెప్పుచున్నారము. ప్రతీకముల నేనని యుపాసింపరాదని యర్థము. వేనినాత్మగా (తానుగా) నుపాసించునో యా ప్రతీకములు, సః=ఆయుపాసకుఁడు, నహి=కాఁడుగదా! ప్రతీకములు బ్రహ్మవికారము లగుటవలన బ్రహ్మత్వము నట్లగుటవలన నాత్మత్వము నని యెద్ది చెప్పంబడినదో యది ప్రతీకాభావ ప్రసంగము వలన యుక్తము కాదు. నామాది (ప్రతీక) జాతమునకు వికారస్వరూపోప మర్దముచే (=స్వరూప బాధముచే) బ్రహ్మత్వమే యాశ్రయింపంబడినది యగుచున్నది గదా! నామాదులకు స్వరూపోపమర్దము గలుగుచుండఁగా నెట్లు ప్రతీకత్వముగాని యాత్మగ్రహము గాని సంభవించును? (వికారమునకు బ్రహ్మముతో స్వరూపమున నైక్యము సంభవింపమింజేసి బాధచే నైక్యముం జెప్పవలెను. ప్రతీకబాధము గలుగుచుండఁగా నుపాస్తి విధి సంభవింపదని యర్థము.) మఱియుఁ గర్తృత్వాదికము నిరాకరింపఁబడకపోవుటవలన, బ్రహ్మ మాత్మమగుటవలనను బ్రహ్మదృష్ట్యుపదేశములం దాత్మదృష్టి కల్పింపఁదగినదికాదు.

కర్తృత్వాదు లగు నెల్ల సంసారధర్మముల నిరాకరణముచే బ్రహ్మమున నాత్మత్వోపదేశమును వాని యనిరాకరణముచ నుపాసనా విధానమును గాఁబట్టి యుపాసకుఁడు ప్రతీకము లందు నముఁ జగుటవలన నహంగ్రహము (=ప్రతీకమున నేనను నుపాసన ము) ప్రపన్నము గాదు. జీవప్రతీకములకు స్వరూప భేదమువలన విధ్యభావము వలనను నహంగ్రహము వల దని యర్థము. ఋచక స్వస్తికముల కన్యోన్యాత్మకత్వము లేదు గదా! వానికి సువర్ణస్వరూపము చేతనువలె బ్రహ్మస్వరూ పమాచే జీవప్రతీకముల కైక్యము కలుగుచుండఁగాఁ బ్రతీకా భావప్రసంగమును జెప్పితిమి. కాఁబట్టి ప్రతీకములయం దాత్మదృష్టి చేయంబడదు.

ఇది తృతీయాధికరణము.

## బ్రహ్మదృష్ట్యధికరణము. ౪

సూ. బ్రహ్మదృష్టి రుత్కర్షాత్. ౫

ప. బ్రహ్మదృష్టిః - ఉత్కర్షాత్.

అ. ఆదిత్యాదుల కుత్కర్షము సిద్ధించుటవలన నాది త్యాదులందు బ్రహ్మదృష్టి=బ్రహ్మత్వాధ్యాసమున ధ్యానము చేయందగినది.

భా. మీఁదటి ప్రతీకోపాసనములందే యాదిత్యాది దృష్టులు బ్రహ్మాన నం దధ్యవసింపం దగినవా? బ్రహ్మ

దృష్టియాదిత్యాదులం దధ్యవసింపందగినదా ? యని వేఱొక
సంశయము గలదు. దేనివలన సంశయము కలిగెను? సామా
నాధికరణ్యమునం దిది కారణ మని నిశ్చయము లేకపోవుట
వలనను. వీనిలోను "ఆదిత్యో బ్రహ్మ, ప్రాణో బ్రహ్మ, విద్యు
ద్బ్రహ్మ" యను నిట్టి సమానవిభక్తి నిర్దేశమువలన బ్రహ్మ
శ్శబ్దమున కాదిత్యాది శబ్దములతో సామానాధికరణ్యము
గాన్పించుచున్నది. ఇట బ్రహ్మాదిత్యాది శబ్దములు వేఱర్థ
ముల బోధించునవి యగుటవలన ముఖ్యమైన సామానాధిక
రణ్యము సంభవింపదు.(భిన్నములగు) గవాశ్వములకు సామా
నాధికరణ్యము సంభవింపదుగదా ! ఓయీ ! బ్రహ్మాదిత్యా
దులకుఁ బ్రకృతి వికారభావమువలన మృచ్ఛరావాదులకు
వలె సామానాధికరణ్యము కావచ్చుననినఁ గారాదని చెప్పు
చున్నారము. ఇట్లగుచునుండఁగాఁ బ్రకృతిసామానాధికర
ణ్యమువలన వికారమునకుఁ బ్రవిలయము సంభవించును;
దానివలనఁ బ్రతీకాభావము ప్రసక్తించు నని చెప్పితిమి.
మఱియు నపుడిది బ్రహ్మవాక్య మగును. అట్లగుచునుండఁగా
నుపాసనా ప్రకరణము బాధింపఁ బడును. (వాక్యమునకు)
బ్రహ్మపరత్వము గలుగుచుండఁగా (నంతయు బ్రహ్మమని
వక్తవ్యము కాఁబట్టి) పరిమితము లగు వికారముల గ్రహిం
చుట వ్యర్థము నగును. కాఁబట్టి "బ్రాహ్మణోఽగ్నిర్వైశ్వా

సర" ఇత్యాదులందువలె వేఱొక వస్తువునందు వేఱొకవస్తు
దృష్ట్యధ్యాసము గలుగుచుండఁగా దేనియందు దేనిదృష్టి
యధ్యసింపఁబడునని సంశయము కలుగును. సంశయము
కలుగఁగా నియమమును బోధించుశాస్త్రము నభావమువలన
ననియామమే యని ప్రాప్తమయ్యెను. వేఱొకపక్షమున నాది
త్యాదిదృష్టులే బ్రహ్మమునం దధ్యసింపఁ దగినవి యని ప్రాప్త
మయ్యెను. ఇట్లగుచునుండఁగా బ్రహ్మ మాదిత్యాది దృష్టు
లచే నుపాసింపఁబడినది యగుచున్నది. బ్రహ్మోపాసనము
ఫలవంతమని శాస్త్రమర్యాద గలదు. కాఁబట్టి యాదిత్యాదు
లందు బ్రహ్మదృష్టి చేయరాదని ప్రాప్తించినది కాఁగాను,
బ్రహ్మదృష్టిః=ఆదిత్యాదులందు బ్రహ్మదృష్టియే చేయందగి
నది యని చెప్పుచున్నారము. ఏకారణము వలనను?
ఉత్కర్షాత్=ఇట్లగుచునుండఁగా నాదిత్యాదులం దుత్కృష్ట
దృష్టి యారోపిత మగుటవలన నాదిత్యాదు లుత్కర్షమున
నుపాసింపఁబడినవారగుదురను కారణమువలనను. ఇట్లయ్యె
నేని లోకప్రసిద్ధ మగున్యాయ మనుసరింపఁబడినదియు నగు
ను. క్షత్తయందు రాజదృష్టివలె నికృష్టమునం దుత్కృష్టదృష్టి
యధ్యసితవ్య మనునది లౌకికమగు న్యాయము. విపర్యయము
గలుగుచుండఁగాఁ బ్రత్యవాయప్రసంగమువలన నది యను
సరింపం దగినది. క్షత్తృదృష్టిచే బరిగృహీతుఁ డగురాజని

కర్షముం బొందింపఁబడినవాఁ డగుచు మేలు సేకూర్పఁడు
గదా! ఓయీ! శాస్త్రప్రామాణ్యమువలనఁ బ్రత్యవాయ
ప్రసంగమాశంకనీయము గాదు. మఱియు లౌకిక మగు
న్యాయముచే శాస్త్రీయ మగుదృష్టి నిర్ణయింపం దగ దనిన
నిట శాస్త్రార్థము నిర్ధారిత మయ్యేనేని యిది యిట్లే కావ
చ్చును; కాని యది సందిగ్ధ మగుచుండఁగా దాని నిర్ణ
యార్థము లౌకికన్యాయము నాశ్రయింపఁ బడుచున్నది యై
విరోధింపదు; దానిచే శాస్త్రార్థము నికృష్టవస్తువునం దు
త్కృష్టదృష్ట్యధ్యాస మని నిశ్చయింపఁబడుచున్నది యగుచు
నుండఁగా నుత్కృష్టవస్తువునందు నికృష్టదృష్టి నధ్యసించు
వాఁడు ప్రత్యవాయముం బొందు నను నిది యుక్త మని చెప్పు
చున్నారము. మఱియు నాదిత్యాది శబ్దములు మొదట
నున్నవి కాఁబట్టి యవిరోధమువలన (వానికి) ముఖ్యార్థత్వము
గ్రాహ్యము. ముఖ్యార్థవృత్తులగు నాశబ్దములచే బుద్ధి యవ
రుద్ధ మగుచుండఁగాఁ దరువాత నవతరించుచున్న బ్రహ్మశబ్ద
మునకు ముఖ్యవృత్తిచే సామానాధికరణ్యము సంభవింపమి
వలన బ్రహ్మదృష్టి విధానార్థత్వమే సిద్ధించుచున్నది. ఇతి
శబ్దము పరమునందుఁ గలది యగుటవలనను బ్రహ్మశబ్దమున
కీ యర్థమే న్యాయ్యము. బ్రహ్మశబ్దమున కితిశబ్దపరత్వమే
ప్రతిపాదింపఁ బడుచున్నది. "బ్రహ్మేత్యాదేశః బ్రహ్మే

త్యుపాసీత, బ్రహ్మేత్యుపాస్తే" యని యెల్లచోట్ల బ్రహ్మశబ్దము ఇతికరముగా నాదిత్యాది శబ్దములను శుద్ధములుగాను (శ్రుతి) యుచ్చరించుచున్నది. అట్లగుటవలన "శుక్తిం కాంరజత మితిప్రత్యేతి" యనుచోట (శుక్తిని రజత మని తెలిసికొనుచున్నాఁ డనుచోట) నెట్లు శుక్తికాశబ్దము శుక్తికను చెప్పునదియేయును, రజత మని కేవలము తెలిసికొనుచున్నవాఁడే కాని యట రజతము లేదు కాన రజతశబ్దము రజతప్రతీతిలక్షణార్థమునో యట్లే యిటను నాదిత్యాదులను బ్రహ్మ మని తెలిసికొనునది (ఉపాసించునది) యని తోఁచుచున్నది. "స[1] య ఏత దేవం విద్వా నాదిత్యం బ్రహ్మేత్యుపాస్తే, యో[2]వాచం బ్రహ్మేత్యుపాస్తే, య[3]స్సంకల్పం బ్రహ్మేత్యుపాస్తే" యని వాక్యశేషమును ద్వితీయానిర్దేశముచే నాదిత్యాదుల నుపాస్తిక్రియచే వ్యాప్యమానములుగాను (ఉపాస్తి క్రియాకర్మములు

---

౧. ఛాం. ౩. ౧౯. ౪. సయః = ఎవఁడు, ఏతత్ = మీఁదఁ జెప్పఁబడిన మహిమమును, ఏవం = ఈప్రకారముగాను, విద్వాన్ = తెలిసికొన్నవాఁ డగుచున్, ఆదిత్యం = సూర్యునిని, ఉపాస్తే = ధ్యానించుచున్నాఁడో, (సః = వాఁడు, సూర్యభావముం బొందుచున్నాఁడు.)

౨. ఛాం. ౭. ౨. ౨. యః = ఎవఁడు, వాచం = వాగింద్రియమును, బ్రహ్మేతి = బ్రహ్మమని, ఉపాస్తే = ఉపాసించుచున్నాఁడో, (వానికి వాగ్గోచర మగు దేశమునఁ గామచారము సంభవించును.)

౩. ఛాం. ౭. ౪. ౩. యః = ఎవఁడు, సంకల్పం - బ్రహ్మ - ఇతి - ఉపాస్తే = సంకల్పమును బ్రహ్మబుద్ధిచే నుపాసించునో (యతఁడు బ్రహ్మచేఁ గ్లుప్తములు స్థిరములు నగు లోకములం బొందుచున్నాఁడు.)

గాను) జూపుచున్నది. ఫలవత్త్వముకొఱకు బ్రహ్మోపాస నమే యిట నాదరణీయ మని యెద్ది చెప్పంబడినదో యది యును మీఁదఁ జెప్పంబడిన న్యాయముచే (ద్వితీయేతి శ్రుతు లచేత లౌకికన్యాయముచేతను) నాదిత్యాదుల కుపాస్యత్వ మవగత మగుటంజేసి యుక్తముకాదు. అతిథ్యా ద్యుపాస నము నందువలె నాదిత్యా ద్యుపాసనమునందును సర్వా ధ్యక్షుఁ డగుటవలన బ్రహ్మమే ఫలము నీఁగలఁడు. "ఫలమత ఉపపత్తేః" యను సూత్రమున నిది చెప్పంబడినదియును. విష్ణ్వాదులకుం బ్రతిమాదులందువలెఁ బ్రతీకమునందు బ్రహ్మ దృష్ట్యధ్యారోపణ మనునది యెద్దియో యట్టి యుపాస్యత్వ మును బ్రహ్మమున కిటఁ గలదు. (దేనిదృష్టిచే వికారమున కుత్కర్షమో యట్టి బ్రహ్మమున కుపాసనా విశేషణత్వము గలిగిన నుపాస్యత్వము నిటఁ గల దని యర్థము.)

ఇది చతుర్థాధికరణము

---

ఆదిత్యాది మత్యధికరణము ౫.

సూ. ఆదిత్యాదిమతయ శ్చాంగ ఉపపత్తేః ౬.

ప. ఆదిత్యాదిమతయః - చ - అంగే - ఉపపత్తేః.

అ. ఆదిత్యాది బుద్ధు లుద్గీథాదు లగు కర్మాంగము లందుఁ బ్రసరింపంజేయఁ దగినవి. (అధ్యసింపం దగినవి)

దేనివలనను? ఉపాసనములచే నుద్గీథాదులు (అంగములు) సంస్కరింపఁ బడుచున్నవి కాఁగాఁ గర్మసమృద్ధిరూప మగు ఫల ముత్పత్తిం బొందుచున్నది యగుట వలనను.

భా "[1]య ఏవాసౌ తపతి త ముద్గీథ ముపాసీత, [2]లోకేషు పంచవిధం సామోపాసీత, [3]వాచి సప్తవిధం సామోపాసీత, [4]ఇయ మేవ ర్గగ్నిస్సామ" యనునవి మొదలగునవియు నంగావరుద్ధములు నగు నుపాసనములం దాదిత్యాదులం దుద్గీథాదిబుద్ధులు విధింపఁబడుచున్నవా? యుద్గీథాదులం దాదిత్యాదిదృష్టులు

---

౧. ఛాం. ౧. ౩. ౧. య ఏవ - అసౌ - తపతి = ఏయీ సూర్యుఁడు (గగనమున) వెలుగుచున్నాఁడో, తం - ఉద్గీథం - ఉపాసీత = అతని నుద్గీథావయవమగు నోంకారముగా నుపాసించునది. ఉద్గీథావయవమగు నోంకారము నాదిత్యబుద్ధిచే నుపాసించునది యని యర్థము.

౨. ఛాం. ౨. ౨. ౧. పంచవిధం - సామ = హింకారము, ప్రస్తావము, ప్రతిహారము, ఉద్గీథము, నిధనము నను నైదు విధములుగల సామమును, లోకేషు = (ఇటనుండి ప్రథమగా మార్చునది.) పృథివ్యాదులుగాను, ఉపాసీత = ఉపాసించునది, హింకారము మొదలగు సామమును పృథివ్యాది దృష్టిచే నుపాసించునది యని యర్థము.

3 ఛా ౨. ౮. ౧. సప్తవిధం - సామ = ఆది, ఉపద్రవము నను రెంటితోఁ గూడిన మీఁదటి హింకారాదు లగు నేదు విధములు గల సామమును, వాచి = వాక్ = వాక్కుగాను, ఉపాసీత = ఉపాసించునది. సప్తవిధమగు సామమును వాగ్దృష్టిచే నుపాసించునది యని యర్థము.

౪ ఛాం. ౧. ౬. ౧. ఇయం = ఈభూలోకమే, ఋక్ = ఋక్కు, అగ్నిః = అగ్ని, సామ = సామము ఋక్కునందుఁ బృథివీ లోకదృష్టియు, సామమునం దగ్నిదృష్టియుఁ జేయునది యని యర్థము. (పృథివ్యగ్నులకు ఋక్సామత్వ మెట్లంటేని) తదేతత్ - సామ = అగ్ని యను సామము, ఏతస్యాం - ఋచి = పృథివీ రూపమగు ఋక్కునందుఁ, అధ్యూఢం = మీఁదుగా నున్నది.

విధింపఁబడుచున్నవా? యను సంశయము కలుగు. అట్లగుచు నుండఁగా నియమకారణము లేకపోవుటవలన ననియమ ముని ప్రాప్తమయ్యెను. ఇట బ్రహ్మమునకువలె నొకదాని కుత్కర్ష విశేషము నిశ్చయింపఁబడదు గదా! బ్రహ్మ మెల్లజగము నకుం గారణ మగుటవలన నపహత పాప్మత్వాది గుణములు గలది యగుటవలన నాదిత్యాదులకంటె నుత్కృష్ట మని నిశ్చ యింప శక్యమగుచున్నది. ఆదిత్యాదులకు నుద్గీథాదులకును బ్రహ్మవికారత్వము సమమగుటవలన వీనిలో నొకదాని కుత్కర్ష విశేషము నిశ్చయింపఁదగిన కారణ మెద్దియు లేదు. వేదాంత పక్షము: నియమము చేతనే యుద్గీథాదిబుద్ధు లాది త్యాదులం దధ్యవసింపంబడునది. ఎక్కారణమువలనను? ఉద్గీథాదులు కర్మాత్మకము లగుటవలనను. కర్మమునకు ఫల ప్రాప్తి ప్రసిద్ధివలన నుద్గీథాదిబుద్ధులచే నుపాస్యమాను లగు నాదిత్యాదులు కర్మాత్మకు లగుచు ఫలహేతువులు కాఁగలరు. అట్లుగానే "ఇయమేవ ర్గగ్నిస్సామ" యనుచోటను "తదేతదే తస్యాం ఋచ్యధ్యూఢం సామ" యని ఋక్శబ్దముచేఁ బృథివిని సామశబ్దముచే నగ్నిని నిర్దేశించుచున్నది. అది పృథివ్యగ్ను లందు ఋక్సామదృష్టి చికీర్షయందు యుక్తమగుచున్నది గాని ఋక్సామములందుఁ బృథివ్యగ్నిదృష్టి చికీర్షయందు యుక్తము గాదు. క్షత్త (=ద్వారపాలకుని)యందు రాజదృష్టి చేయుట

వలన రాజశబ్దము క్షత్త్రియందు గౌణముగాఁ బ్రయోగింపఁ బడుచున్నది కాని రాజునందు క్షత్త్రశబ్ద మట్లు ప్రయోగింపఁబడదు. మఱియును "లోకేషు పంచవిధం సామోపాసీత" యని యధికరణ నిర్దేశమువలన లోకములందు సామ మధ్యవసితవ్య మని తెలియంబడుచున్నది. "ఏతద్గాయత్రం ప్రాణేషు ప్రోతమ్మ"నియు దీనినే చూపుచున్నది. "ఆదిత్యో బ్రహ్మేత్యాదేశ" ఇత్యాదులందు మొదట నిర్దేశింపఁబడిన యాదిత్యాదులందుఁ దరువాత నిర్దేశింపఁబడిన బ్రహ్మా మధ్యస్తము. "పృథివీహింకార" ఇత్యాది శ్రుతులందుఁ బృథివ్యాదులు మొదట నిర్దేశింపఁబడినవియును హింకారాదులు చరమ నిర్దిష్టములుం గదా! కాఁబట్టి యంగములు కాని యాదిత్యాదులం దంగబుద్ధి నధ్యసించునది యని ప్రాప్తింపఁగాను, ఆదిత్యాది మతయశ్చ = సూర్యాదిబుద్ధులే; అంగే= అంగేషు=ఉద్గీథాది కర్మములందు నధ్యసింపంబడునది యని చెప్పుచున్నారము. ఏకారణము వలనను? ఉపపత్తేః = అట్లధ్యసింపఁబడినచే యపూర్వ స్సన్నికర్షమువలన నాదిత్యాది బుద్ధులచే (ఉద్గీథాదులు) సంస్కరింపఁబడుచున్నవి యగుచు నుండఁగాఁ గర్మసమృద్ధి యుపపన్న మగుచున్నది యను కార

---

౧. ఛాం. ౨. ౧౧. ౧. ప్రాణదృష్టిచే గాయత్రసామము నుపాసించునది యని యర్థము.

ణాములవలనను. కర్మసమృద్ధి ఫలోపపత్తివలన నంగములం దాదిత్యాది బుద్ధ్యధ్యాసము కార్యమని యర్థము. "యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరంభవతి" యని విద్యకు (ఉపాసనకు) గర్మఫలహేతుత్వముం జూపుచున్నది. కర్మసమృద్ధి ఫలముగాఁ గల యుపాసనములందు ఫలోపపత్తికొఱ కంగముల కుపాస్యత్వము కావచ్చును గాని "యఏతదేవం విద్వాన్ లోకేషు పంచవిధం సామోపాస్తే" యనునది మొదలగు స్వతంత్రఫలము లైన యుపాసనములం దంగముల కుపాస్యత్వ మెట్లనిన స్వతంత్ర పశుఫలమే యగు గోదోహనమునందు వలె లోకఫలము లగు నుపాసనములందును కర్మాధికృతునకే యధికారమువలనఁ బ్రకృత కర్మాంగాపూర్వద్వారమున నే ఫలకల్పన యుక్తము (కాఁబట్టి యంగములకే యుపాస్యత్వము సిద్ధించును.) ఆదిత్యాదులు ఫలాత్మకము లగుటవలనఁ గర్మాత్మకము లగు నుద్గీ

---

౧. ఛాం. ౧. ౧. ౧౦. (విద్వాంసుఁడు నవిద్వాంసుఁడు గర్మములఁ జేయు నధికారులె కాని) యదేవ = ఏకర్మమును, విద్యయా = ఉద్గీథాద్యంగ విజ్ఞానముతోడను, శ్రద్ధయాచ = ఆస్తిక్యబుద్ధితోడను, ఉపనిషదా = ఉపాసనముతోడను, (కూడినవాఁడై) కరోతి = చేయుచున్నాఁడో, తదేవ = ఆకర్మమే, వీర్యవత్తరం = విద్వాంసుఁగు కానివాఁడు చేసినకర్మముకంటె నెక్కువ ఫలము నిచ్చునది, భవతి = అగుచున్నది.

౨. ఛాం. ౨. ౨. 3. ఎవఁడిట్లు పంచవిధము లగు సామమును లోకదృష్టిచే నుపాసించునో యతనికి గత్యాగతులతోఁ గూడిన పుణ్యలోకములు భోగ్యములుగా నుండునని యర్థము.

థాదులకంటె నుత్కర్ష ముపపన్నము నగును. శ్రుతులందుఁ గర్మఫల మాదిత్యాది ప్రాప్తిలక్షణ మని శాసింపఁబడుచున్నది కదా! మఱియును "ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత" యనియును "ఖల్వేతస్యై వాక్షరస్యోప వ్యాఖ్యానం భవతి" యనియు నుద్గీథమునే యుపాస్యముగా నుపక్రమించి యాదిత్యాది బుద్ధులను విధించుచున్నది. (కనుకను నంగములే యుపాస్యములు.) ఆదిత్యాదు లుద్గీథాది బుద్ధులచే నుపాసింపఁ బడుచున్నవారై కర్మాత్మకత్వముం బొంది ఫలము నీగల రని యెద్ది చెప్పంబడినదో యది యుపాసనము స్వయముగానే కర్మమగుటచే ఫలవత్త్వోపపత్తివలన నుద్గీథాదుల కాదిత్యాది భావమున నుపాసింపఁ బడుచున్నవానికిని గర్మాత్మకత్వో నపాయమువలనను యుక్తము కాదు. "తదేత ద్వేతస్యాం ఋచ్యధ్యూఢంసామ" యని పృథివ్యగ్నులందు నీ ఋక్సామ పదప్రయోగము లాక్షణికము. లక్షణయు యథాసంభవముగా సన్నికృష్ట మగు స్వార్థసంబంధమునఁ గాని విప్రకృష్ట మగు స్వార్థసంబంధమునఁగాని ప్రవర్తిల్లును.

---

౧. ఛాం. ౧. ౧. ౧. ఉద్గీథావయవమగు నోంకారము నుపాసించు నది యని యర్థము.

౨. ఛాం. ౧. ౧. ౧౦. మీఁద నశేక ప్రకారములుగఁ జెప్పంబడిన యుపాసన మంతయును, ఏతస్యైవ - అక్షరస్య - ఉపవ్యాఖ్యానం - భవతి ఖలు= ప్రకృతమగు నోంకారమునకు సంబంధించినదియే యగుచున్నది యని యర్థము

అటఁ బరికింపఁగా ఋక్సామములందుఁ బృథివ్యగ్నిదృష్టి చికీర్షయే కాని ప్రసిద్ధము లగు (ముఖ్యము లగు) ఋక్సామములు ("తస్మాదృచ్యధ్యూఢం సామ"యని) వేఱుగాఁ గీర్తింపఁబడుటవలన ("తదేతదే తస్యాం రుచ్యధ్యూఢం సామ" యనుచో సైతము వానినే గ్రహించినఁబునరుక్తియగును గాఁబట్టి ప్రతీకాభేదదృష్టిచేఁ బృథివ్యగ్నులకు (ప్రతీక)నన్నిధానము వలనను వానియందే యీ ఋక్సామశబ్ద (=ప్రతీకపద) ప్రయోగము ఋక్సామ సంబంధమువలన (నభేద దార్ఢ్యము కొఱకు)ఁ జేయంబడె నని నిశ్చయింపఁబడుచున్నది. (అపుడు క్షత్త్ర శబ్దమునకు రాజునందుం బ్రయోగము సంభవించు ననిన) క్షత్త్రశబ్దము నెద్దియే నొక కారణమున రాజు నుప సర్పించుచున్నది యై వారింపఁబడదు గదా! (సిద్ధ మగు ప్రయోగమున కెద్దియేని నిమిత్తముం జెప్పవలెను గాని నిమిత్తమున్నదను హేతువువలనఁ బ్రయోగ మాపాదింపఁ బడదని భావము. మఱియు క్షత్త్రకార్యము రాజుచేయు నపు డాశబ్దము రాజునందుఁ గలదని యక్షరార్థము) 'ఇయ మేవ ర్గగ్ని స్సామ' యని, (శ్రుతి) యక్షర విన్యాసాను సారముగా ఋక్కునకే పృథివీత్వమును నిశ్చయించు చున్నది. పృథివికి ఋక్త్వము నిశ్చయింపఁ బడుచున్నది యగుచు నుండఁగాను "ఇయంఋగేవ" యని యక్షరవిన్యా

సము కావలెను. "యఏవంవిద్వాన్ సామగాయతి" యని యునంగాశ్రయముగానే విజ్ఞానము నుపసంహరించుచున్నది గాని పృథివ్యాద్యాశ్రయముగా నుపసంహరింపదు. అట్లే, "లోకేషు పంచవిధం సామోపాసీత" యని పఠింపఁగా లోకములు సప్తమిచే నిర్దేశింపఁబడినవి కాని ద్వితీయానిర్దేశముచే సామమున కుపాస్యత్వము తెలియంబడు చున్నది యగుటవలన సామమునందే లోకము లధ్యసింపఁ బడవలసినవి. సామమునందు లోకము లధ్యస్యమానము లగుచు నుండఁగా సామము లోకస్వరూపమున నుపాసింపఁ బడినది యగుచున్నది. లోకములందు సామమధ్యస్యమాన మయ్యెనేని సామస్వరూపమున లోకము లుపాసింపఁ బడినవి యగును (లోకేషు పంచవిధం సామోపాసీత" యనుచో లోకములందు సామ మధ్యస్యమాన మయ్యెనేని "సామాత్మనా లోకా నుపాసీత" = లోకముల సామస్వరూపమున నుపాసించునది యని లోకసామశబ్దముల సప్తమీ ద్వితీయా విభక్తుల రెండిటిని ద్వితీయా తృతీయా విభక్తులుగా మార్పవలసి యుండును. సామమందు లోకము లధ్యస్యమానము

---

౧. ఛాం. ౧. ౭. ౭. యః = ఎవఁడు, ఏవం-విద్వాన్ = ఇట్లుద్గీథము నుపాసించు చున్నవాఁడగుచున్, సామ-గాయతి = సామమును బఠించునో (యతఁడు చాక్షుషాదిత్యపురుషుల గానము చేయుచున్నాఁడు; మఱియు దాన నుత్తమలోకములఁ బొందుచున్నాఁడు.)

లయ్యేనేని "లోకాత్మనా సామోపాసీత" = (సామమును లోక స్వరూపమున నుపాసించునది.) యని లోకశబ్దమునందలి సప్తమీవిభక్తిని మాత్రము తృతీయావిభక్తిగా మార్పవలసి యుండును. కనుక రెండువిభక్తులను మార్చుటకంటె నొక విభక్తిని మార్చుటయందు లాఘవము కలదు గానఁ బృథివ్యాది లోకదృష్టిచే హింకారాదిసామ ముపాస్య మని యర్థము.) ఇట్లుపదేశించుట చేతను=(పృథివ్యాది దృష్టిచే హింకారాది సామ ముపాస్యమని చెప్పుటచేతను) "ఏ తద్గాయత్రం ప్రాణేషు ప్రోతమి" త్యాదికమును (గాయత్రము ప్రాణ స్వరూపమున నుపాస్యమని) వ్యాఖ్యాతము. "[1] అథఖల్వాముమాదిత్యం సప్తవిధం సామోపాసీత" యనునది మొదలగు నెట సమానమగు ద్వితీయా నిర్దేశముకలదో యట సైతము "[2] సమస్తస్యఖలు సామ్న ఉపాసనం సాధు, ఇతితు[3] పంచవి

---

౧. ఛాం. ౨. ౯. ౧. (ప్రథమాధ్యాయమున నవయవమాత్ర మగు సామమున నాదిత్యదృష్టి యుపదేశింపఁబడె.) అథఖలు = ఇపుడు, అముం- ఆదిత్యం = ఈయాదిత్యునిని (సమస్తమగు సామమునం దవయవ విభాగానుసారముగా నధ్యవసించి) సప్తవిధం - సామ - ఉపాసీత = ఏడు విధము లగు సామము నుపాసించునది. (యని చెప్పఁబడుచున్నది)

౨. ఛాం. ౨. ౧. ౧. సమస్తస్య=సర్వావయవవిశిష్ట మగు (పాంచభక్తికము, సాప్తభక్తికము నగునట్టి యని యర్థము.) సామ్నః - సామము యొక్క, ఉపాసనం = ఉపాసనము. సాధుఖలు = సాధువు, సమస్తమగు సామమునందు సాధుదృష్టి చేయవలసినదని యర్థము.

3. ఛాం. ౨. ౭. ౨. ఇట్లయిదు విధములుగల సామము నుపాసనము చెప్పఁబడినది యని యర్థము.

ధస్య, అథసప్తవిధస్య యని సామమునకే యుపాస్యత్వ ముప
క్రమింపఁ బడుటవలన సామమందే యాదిత్యాధ్యాసము
కర్తవ్యము. సామమునకే యుపాస్యత్వావగమము వలననే
"పృథివీహింకార" ఇత్యాది నిర్దేశ విపర్యయమునందును
హింకారాదులందే పృథివ్యాది దృష్టి కర్తవ్యము. కనుక
ననంగాశ్రయము లగు నాదిత్యాదిబుద్ధు లంగము లగు నుద్గీ
థాదులం దధ్యస్యము లని సిద్ధము.

ఇది పంచమాధికరణము

---

### ఆసీనాధికరణము. ౬

సూ. ఆసీన స్సంభవాత్. ౭

ప. ఆసీనః - సంభవాత్.

అ. ఉపాసనము కూర్చున్నవానికే సంభవించుటవలన
నాసీనుఁడయియే యుపాసించునది.

భా. కర్మాంగ సంబంధముగల యుపాసనములయందు
(నవి) కర్మాధీనము లగుటవలన నాసనాది చింత లేదు. జ్ఞానము
వస్తుతంత్ర మగుటవలన సమ్యగ్దర్శనమందు నాసనాది విచా
రము లేదు. మిగిలిన యుపాసనములందు ననియమమున నిలు

౧. ఛాం. ౨. ౮. ౧. అథ = పిమ్మటను, సప్తవిధస్య = ఏడు
ప్రకారములు గల సామమునుపాసనము చెప్పఁబడుచున్నది.

చుచుఁ గాని యాసీనుఁడై కాని శయానుఁడై కాని ప్రవర్తిల్లు నదియా? నియమమున నాసీనుఁడయియే ప్రవర్తిల్లునదియా ? యని విచారించుచున్నాఁడు. అట నుపాసనము మానస మగుటవలన శరీరస్థితికి నియమము లేదని ప్రాప్తింపఁగాను, ఆసీనః=కూర్చున్నవాఁడయియే యుపాసించునది యని చెప్పు చున్నాఁడు. దేనివలనను? సంభవాత్ = అట్టివానికే యుపా సనము సంభవించుటవలనను. ఉపాసన మనునది సమాన ప్రత్యయ ప్రవాహీకరణము. అది గత్యాదులు చిత్తవిక్షేప కరము లగుటవలన నడచుచున్నవానికిఁ గాని పరుగిడుచున్న వానికిఁగాని సంభవింపదు. నిలుచుచున్నవానికిని శరీరధార ణమున వ్యాపృతమైన మనము సూక్ష్మవస్తు నిరీక్షణ సమ ర్థము కాదు. శయానునకును (మనము) నిద్రచే నప్రయత్న మున నభిభవింపఁ బడుచున్నది. ఆసీనున కిట్టిదోషపుంజము సుపరిహారము కాఁబట్టి యుపాసనము సంభవించును.

సూ. ధ్యానాచ్చ. ౮

ప. ధ్యానాత్ - చ.

అ. ఉపాసనము ధ్యానమగుటవలనను నది యాసీనుఁ డయియే చేయునది.

భా. అపిచ = మఱియును, ధ్యానాత్ = సమాన ప్రత్యయ ప్రవాహీకరణ మనునది ధ్యాయత్యర్థ = (ధ్యాన)

మగుటవలనను "ధ్యాయతిబకో, ధ్యాయతిప్రోషితబంధు"వని (బకము ధ్యానించుచున్నది. దేశాంతరము పోయిన బంధువులు కలవాఁడు ధ్యానించుచున్నాఁడు నని) ప్రశిథిలాంగచేష్టులు = (కదలక మెదలక కూర్చున్నవారు) నొక విషయముచే నాకర్షింపఁబడినవారు=(ఒకట మనసునిల్పినవారు) నగువారియందు గౌణముగాఁ బ్రయోగింపఁబడు చున్నది యై కాన్పించుచున్నది. ఆసీనున కాయాసాభావము నగును. కనుకను నుపాసన మాసీనుని పనియే.

సూ. అచలత్వం చాపేక్ష్య. ౯

ప. అచలత్వం - చ - అపేక్ష్య.

అ. అచలత్వము (కదలకుండుట) నపేక్షించి శ్రుతియందు ధ్యాయతిశబ్దము కలదు.

భా. అపిచ=మఱియును, "ధ్యాయతీవపృథివీ"[1] యను శ్రుతియందు, అచలత్వం, అపేక్ష్య = కదలమి నపేక్షించియే ధ్యాయతి శబ్దము పృథివ్యాదులందుఁ బ్రయోగింపఁ బడుచున్నది. అది యుపాసన మాసీనుని పనియనుటయందు లింగము.

---

౧. ఛాం. ౭. ౬. ౧. పృథివీ = భూమి, ధ్యాయతీవ = ధ్యానము చేయుచున్నదివలె నున్నది. నిశ్చలమై యున్నది యని యర్థము. ధ్యానము = శాస్త్రోక్తదేవతాద్యాలంబనములందు నచలము, భిన్నజాతీయములచే ననంతరితము నగు ప్రత్యయసంతానము; దీనినే యేకాగ్రత యందురు.

సూ. స్మరంతి చ. ౧౦

ప. స్మరంతి - చ.

అ. శిష్టు లుపాసనముల కంగముగా నాసనముల స్మరించుటవలన నాసీనుఁ డయియే యుపాసించునది.

భా. శిష్టు లుపాసనముల కంగముగా నాస[న]మును "శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మన" [య]నునది మొదలగుదానిచే, స్మరంతి చ = స్మరించుచున్నారు. సమాకను కనే (=ఉపాసనము కూర్చున్నవాని పని యగు[ను]) విశేష... యోగశాస్త్రమునఁ బద్మకాద్యాసన విశేష... ...చున్న ...ధార సమ ...త్న ...య దేశము గలదును.

ఇది వస్థాధికరణము

---

## యత్రైకాగ్రతాధికరణము. ౭

సూ. యత్రైకాగ్రతా తత్రావిశేషాత్. ౧౧

ప. యత్ర-ఏకాగ్రతా-తత్ర-అవిశేషాత్.

అ. వైశ్వదేవాది కర్మములందు వలె నుపాసనము లందు దిగ్దేశకాలనియమ శ్రవణము లేకపోవుటవలన నే దేశ

---

౧. భగ. ౬. ౧౧. శుచౌ = స్వభావముననుసంస్కారముకలనను పరిశుద్ధమగు, దేశే=స్థానమునను, ఆత్మనః=తనయొక్క, (చేలాజినకుశోత్తరమగు) స్థిరం-ఆసనం=చలింపని పీఠమును, ప్రతిష్ఠాప్య=నిల్పి (...స్నాన శతేం ద్రియుఁడైయుండి చిత్తశుద్ధ్యర్థమై స[మా]ధిని చేయునది.)

కాలములం దుపాసకునకుఁ జిత్తైకాగ్ర్యము సులభమైనా
యట నుపాసనముం జేయునది.

భా. అంగాశ్రయములు కాని యుపాసనములందు
దిగ్దేశకాల నియమము కలదా? లేదా? యను సంశయము
కలదు. తఱుచుగా వైదికములగు కర్మములందు నియమము
కాన్పించుటవలన (ధ్యానమును వైదికము కాఁబట్టి) దీనియందు
నెద్దియేని నియమ ముండుననుబుద్ధి యెవనికిఁగలదో వాని నుద్దే
శించి(సూత్రకర్త) చెప్పుచున్నాఁడు. అవిశేషాత్ = పూర్వాహ్ణ
మునఁ బ్రాగ్దేశ నిమ్నమగు దేశమున వైశ్వదేవముం జేయునది
యన్నట్లీదేశమున నీకాలమున నుపాసనముం జేయునది యను
విశేషము వినంబడక పోవుటవలనను ధ్యానమునకుం బ్రధాన
మగు చిత్తైకాగ్ర్య మన్నిదిక్కుల నన్నిచోట్ల నన్నికాలముల
సమాన మగుటవలన నైకాగ్ర్యలక్షణమగు నర్థము చే నాక్షిప్త
మైనదిగాదినియమమే కాని వానివిషయమై వేఱు నియమము
లేదు. యత్ర = ఉపాసకునకు నేదిక్కున నేదేశమున నేకాల
మునను, ఏకాగ్రతా = ఐకాగ్ర్యము సౌకర్యమున సంభవిం
చునో, తత్ర = ఆ దిగ్దేశ కాలములయందే యుపాసించునది.
అయ్యా! “ సమేశుచౌ శర్కరావహ్ని వాలుకావివర్జితే శబ్ద

---

౧. శ్వే ౨. ౧౦. సమే = ఎక్కువ తక్కువలు లేనిదియు, శుచౌ = పరిశుద్ధమైనదియు, శర్కరా - వర్జితే = శర్కరా = గుల్లరాలతోడను, వహ్ని = అగ్నితోడను, వాలుకా = ఇసుకతోడను, వివర్జితే = కూడ్య

జలాశ్రయాధిభి ర్మనోనుకూలే నతు చక్షుః పీడనే గుహా నివాతాశ్రయణే ప్రయోజయేత్త”ని కొందఱు దేశవిశేష నియమమును జెప్పుచున్నా రనిన సత్యమే. ఇట్టి నియమము నంగీకరింపవచ్చును. ఇట్టి నియమ మున్నను జిత్తైకాగ్ర్యమునకు విరుద్ధములగు కాలాదిగతములైన విశేషములం దాదర మనావశ్యక మని యాచార్యుఁడు సుహృదుఁడై చెప్పెను. “మనోనుకూలే” యను నీ శ్రుతియు నెటనైకాగ్ర్యము సులభమో యటనే యుపాసించునది యను నీయర్థమునే బోధించుచున్నది.

ఇది సప్తమాధికరణము

---

## ఆప్రాయణాధికరణము. ౮

సూ. ఆప్రాయణా త్తత్రాపి హి దృష్టం. ౧౨

ప. ఆప్రాయణాత్ - తత్ర - అపి - హి - దృష్టం.

---

మును, శబ్దజలాశ్రయాదిభిః= ధ్వనితోడను నీటిమడువులు మొదలగువానితోడను (శూన్యమైనదియును - జలాశ్రయవర్జనము శీతనివృత్త్యర్థము.) మనోనుకూలే= మనమునకుం బ్రియమును, గుహానివాతాశ్రయణే = గాలి మిక్కిలిరాని గుహా మొదలగు చోట్లను, ప్రయోజయేత్ = ధ్యానమును జేయునది. (కాని) చక్షుఃపీడనే = దోమలు మొదలగునవి గల చోటను, నతు = ధ్యానముం జేయ నారంభింపరాదు.

అ. సగుణబ్రహ్మవిషయము లగు నహంగ్రహో పాసనములం దావృత్తి ప్రాయణకాలమందును గావించు చుండుటవలనఁ బ్రాయణమువఱకుం జేయునది.

భా. ఉపాసనము లన్నిఁటియందు నావృత్తియాదర్తవ్య మని మొదటి యధికరణమున నిశ్చయింపఁబడినది. అందే యుపాసనాదులు సమ్యగ్దర్శనార్థములో యవి యవఘాతా దులుబలెఁ గార్యపర్యవసానము లని వాని కావృత్తి పరి మాణము తెలుపంబడినదియే. అనియోజ్య మగు బ్రహ్మ మునం దాత్మత్వ ప్రతిపత్తి గలవాఁడు శాస్త్రమునకు విష యము కాకపోవుటవలన సమ్యగ్దర్శన మనుకార్యము నిష్పన్న మైనది యగుచు నుండఁగా నతనికి యత్నాంతర మెద్దియు శాసింప శక్యము కాదు గదా! ఎవ్వి యభ్యుదయ ఫలము లగు నుపాసనములో వానియం దెద్దియో కొంతకాలము ప్రత్యయావృత్తి నభ్యసించి విరమించునదా? జీవించియు న్నంతకాల ముపాసనము నావర్తించునదా? యని విచారము చేయంబడుచున్నది. (అట్టి విచారము చేయంబడుచున్నది యగుచు నుండఁగాను) ఎద్ది ప్రాప్త మయ్యెను? ఎద్దియేని పరి మాణము గల కాల ముపాసనము నభ్యసించి విడువవలయు నని ప్రాప్త మయ్యెను. (దేనివలనను?) ఆవృత్తి విశిష్ట మగు నుపాసనాశబ్దార్థము చేయంబడినది యగుటవలనను. ఇట్లు

ప్రాప్తింపఁగా నంత్యప్రత్యయ వశమువలన నదృష్టఫలప్రాప్తి వలనను, అప్రాయణాత్ = ప్రాయణము (మరణము) వఱకు నుపాసనము నావర్తించునది యని చెప్పుచున్నారము. కర్మములు నయితము "[1]సవిజ్ఞానోభవతి, [2]సవిజ్ఞానమేవాన్వవక్రామతి, [3]యచ్చిత్తస్తే నైష ప్రాణమాయాతి, ప్రాణ స్తేజసాయుక్త స్సహాత్మనా యథా సంకల్పితం లోకం నయతి" యనునవి మొదలగు శ్రుతులవలనను దృణజలాయుకా నిదర్శనమువలనను జన్మాంతరమున ననుభవింపఁదగిన ఫలము నారంభించుచున్నవియై యాఫలమునకుం దగిన భావనావిజ్ఞానమును బ్రాయణకాలమున నాకర్షించుచున్నవి. ఈ యుపాసనములు స్వరూపావృత్తిని గాక ప్రాయణకాలమున భావిభావనా విజ్ఞా

---

౧. బృ. ౬. ౪. ౨. (ఉత్క్రమణకాలమునం దాత్మఁడు స్వప్నమున వలె) సవిజ్ఞానః = కర్మవశమువలన విశేషవిజ్ఞానము. (=భావిఫలస్ఫూర్తి) కలవాఁడు, భవతి = అగుచున్నాఁడు.

౨. బృ. ౬. ౪. ౨. సవిజ్ఞానమేవ=అట్టి విజ్ఞానముతోఁ గూడునట్లు గానే, అన్వవక్రామతి = గంతవ్యస్థానమును బ్రవేశించుచున్నాఁడు.

౩. ప్ర. ౩. ౧౦. (మరణకాలమునందు) ఏషః = ఈజీవుఁడు యచ్చిత్తః = దేనియందు సంకల్పము కలవాఁ డగునో, తేన = అట్టి సంకల్పముతోడ నింద్రియములతోడను, ప్రాణం=ప్రాణవృత్తిని, ఆయాతి=పొందుచున్నాఁడు. మరణకాలమున జీవుఁడు క్షయించిన యింద్రియవృత్తులు కలవాఁడై ముఖ్యమగు ప్రాణవృత్తిచేమాత్రము నిలుచుచున్నాఁ డని యర్థము. ప్రాణః = ఆప్రాణము, సహాత్మనా = భోక్తతోడను, తేజసా = ఉదానవృత్తితోడను గూడినవాఁడై, యథాసంకల్పితం-లోకం = పుణ్యాపాపవశమువలన సంకల్పింపఁబడిన లోకమును, నయతి = (భోక్తను) బొందించుచున్నాఁడు.

నమును (భావిఫలస్ఫూర్తిని) దేని నపేక్షించును? దేని నపే
క్షింపవు. కాబట్టి యెవ్వి ప్రతిపత్తవ్య ఫలస్వరూపము లగు
నుపాసనములో వానియం దావృత్తి మరణించునందాకఁ
గర్తవ్యము. తత్ర-అపి-హి-దృష్టం = మరణకాలమునందును
నుపాసనము శ్రుతిస్మృతులయందుఁ గాన్పించుచున్నది గదా!
అట్లే "సయావత్క్రతురయ మస్మాల్లోకాత్ప్రైతి" యను శ్రుతి
యును "యంయంవాపి స్మరన్భావం త్యజత్యంతే కళేబరం,
తంతమేవైతి కౌంతేయ సదాతద్భావభావిత" యను స్మృతి
యును ప్రాయణకాలమునను బ్రత్యయావృత్తిం జూపుచున్నవి.
"ప్రయాణకాలే మనసాచలేన" యను స్మృతియును "సోంత
వేళాయామే తత్ప్రయం ప్రతిపద్యతే" యను శ్రుతియును
జరమవేళయందును గర్తవ్యశేషమును వినుచున్నవి.

ఇది యాప్రాయణాధికరణము

---

౧ సః - అయం = ఆయీ యుపాసకుఁడు, అస్మాల్లోకాత్ = ఈదేహమునుండి, యావత్ప్రైతి = ఎంతవరకు విడిచిపోవుచున్నాఁడో, తావత్ - క్రతుః = అంతవరకును ధ్యానముకలవాఁడు (కావలెను.) ఉపాసకుడు జీవించియున్నంతకాల ముపాసనము చేయవలె నని యర్థము.

౨. భగ. ౮. ౬. (మనుజుఁడు) అంతే = మరణకాలమునందు, యం యంవాఽపి-భావం=ఏయే దేవతావిశేషమును-స్మరన్=చింతించుచు, కళేబరం=శరీరమును, త్యజతి=విడుచుచున్నాఁడో, తం తం భావం-ఏవ=ఆయా దేవతావిశేషమునే, సదా = ఎల్లప్పుడును, తద్భావభావితః = ఆ దేవతయం దత్యంతమైన భావనకలవాఁ డగుచున్, ఏతి = పొందుచున్నాఁడు.

3. భగ. ౮. ౧౦. ప్రయాణకాలే = మరణకాలమునందున్, అచలేనమనసా = స్థిరమగు బుద్ధితోడను, (భక్తితోడను యోగబలముతోడను గూడి భ్రూమధ్యమునం బ్రాణము నిలిపి పరమపురుషుం బొందుచున్నాఁడు.)

## తదధిగమాధికరణము. ౯

సూ. తదధిగమ ఉత్తర పూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్. ౧౩

ప. తదధిగమే - ఉత్తరపూర్వాఘయోః - అశ్లేష వినాశౌ - తద్వ్యపదేశాత్.

అ. బ్రహ్మసాక్షాత్కారము గలుగుచుండఁగా నుత్తర కాలమునం జేయుపాపమున కసంబంధమును బూర్వకృత మైన పాపమునకు నాశమును శ్రుతిస్మృతులు చెప్పుటవలన నగు చున్నవి.

భా. తృతీయపాద శేషము ముగిసెను. ఇప్పుడు బ్రహ్మజ్ఞానఫలమును గూర్చి విచారము చేయంబడుచున్నది. బ్రహ్మజ్ఞానము కలుగుచుండఁగా బ్రహ్మజ్ఞానఫలము కంటె విపరీతఫలము గల దురితము క్షయించునా ? క్షయింపదా ? యను సంశయము కలదు. సంశయము కలుగఁగా నెద్ది ప్రాప్త మయ్యెను? కర్మము ఫలార్థ మగుటవలన ఫలము నీక నశించు నని సంభావింపంబడదు. (నహింస్యాదిత్యాది) శ్రుతిచే (దుఃఖ) ఫలమిచ్చు శక్తి దీనికిఁ గలదని తెలియంబడినది. కర్మము ఫలోప

---

౪. ఛాం. ౩. ౧౭. ౬. సః = మీఁదటి యజ్ఞము నెఱింగినవాఁడు ఉపాసకుఁ డని యర్థము. అంతవేళాయాం = మరణకాలమునందు, త్రయం = ఈమూఁడు మంత్రములను ("అక్షితమసి, అచ్యుతమసి, సంశితమసి" యను వానిని) ప్రతిపద్యతే = స్మరించునది యని ౘ

భోగము నీకయే నశించునేని శ్రుతి పీడింపంబడినది యగును. "న హి కర్మక్షీయతే" యని స్మరించుచున్నారును. అయ్యా! ఇట్లగుచునుండఁగాఁ బ్రాయశ్చిత్తోపదేశము నిరర్థక మని ప్రాప్తించు ననిన గృహదాహేష్ట్యాదులకువలెఁ బ్రాయశ్చిత్తములకు నైమిత్తికత్వ మువపన్న మగుటవలన నిది దోషము కాదు. మఱియుఁ బ్రాయశ్చిత్తము దోషసంయోగమున విధింపఁ బడుటవలన దోషక్షపణార్థత్వము దానికైనం గావచ్చును. ఇట్లు (=దోషక్షపణార్థముగా) బ్రహ్మవిద్యకు విధానము లేదు. ఓయీ! బ్రహ్మవిదునకుఁ గర్మక్షయ మంగీకరింపఁ బడనిది యగుచు నుండఁగా దానిఫల మవశ్యము భోక్తవ్యమగుటవలన మోక్షాభావము ప్రసక్తించుననిన నట్లు ప్రసక్తింప దని చెప్పంబడుచున్నది. మోక్షము కర్మఫలమువలె దేశకాల నిమిత్తముల నపేక్షించినది యై కర్మభోగానంతరము గాఁ గలదు. కాఁబట్టి బ్రహ్మజ్ఞానము గలుగుచుండఁగా దురిత నివృత్తి లేదని ప్రాప్తింపఁగాఁ జెప్పుచున్నారము. తదధిగమే = బ్రహ్మసాక్షాత్కారము గలుగు చుండఁగాను, ఉత్తర పూర్వా[illegible]యోః-అశ్లేషవినాశౌ-భవతః=చేయంగల పాపమున కశ్లేష

ర. [illegible] (పాపక్రియనుండి యపూర్వానుత్పత్తి యశ్లేషము.)

దేవ

యం [illegible] చేయంబడిన పాపమునకు వినాశము నగుచున్నవి.

లేవ[illegible]? తద్వ్యపదేశాత్=శ్రుతి స్మృతు లట్లు వ్యపదేశిం

గాడి

చుట వలనను. అదియె ప్రతిపాదింపఁబడుచున్నది. (సగుణ) బ్రహ్మవిద్యా ప్రకరణమునను "[౧]యథాపుష్కర పలాశ ఆపోనశ్లిష్యంత ఏవ మేవం విది పాపం కర్మన శ్లిష్యతే" యని శ్రుతి విద్వాంసులకు సంభావ్యమాన సంబంధము గల యాగామి దురితమునకు సంబంధాభావముం జెప్పుచున్నది. అట్లే "[౨]తద్య థేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"యని శ్రుతి పూర్వోప చితమగు పాపమునకు నాశమును వ్యపదేశించుచున్నది. (నిర్గుణ విద్యయందును) "[౩]భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే" యని వేఱొక కర్మక్షయ వ్యపదేశము కలదు. అనుపభుక్తఫల మగు కర్మమునకు నాశ కల్పన గలుగు

---

౧. ఛాం. ౪. ౧౪. ౩. ఆపః = నీళ్లు, యథా = ఎట్లు, పుష్కర పలాశే = తామరపాకునందు, నశ్లిష్యంతే = అంటుకొనవో, ఏవం = ఇట్లే, ఏవంవిది = నే నెట్లు బ్రహ్మముం జెప్పుదునో య ట్లెఱింగినవానియందు, పాపంకర్మ = పాపకర్మము, నశ్లిష్యతే = తగుల్కొన దని యాచార్యుడు చెప్పఁగా నుపకోసలుఁడట్టి బ్రహ్మము నుపదేశింపు మని యడిగెను.

౨. ఛాం. ౫. ౨౪. ౩. తద్యథా - ఇషీకతూలం = ఎట్లు ప్రశస్త మగు దుబ్బుగడ్డికొన, అగ్నౌ = నిప్పునందుఁ, ప్రోతే=నిక్షిప్త మగుచుఁ, ప్రదూయేత = శీఘ్రముగఁ గాలిపోవునో, ఏవం = ఇట్లే, అస్య = ప్రాణాగ్నిహోత్రోపాసకునియొక్క, సర్వే పాప్మానః = పాపము లన్నియును, అనేక జన్మములందును, జ్ఞానోత్పత్తివఱకు నీజన్మమునందును సంపాదింపబడిన ధర్మాధర్మములన్నియు ననియర్థము. ప్రదూయంతేహ=నశించిపోవుచున్నవి సుమీ.

౩. ముం. ౨. ౨. ౮. అ ౧ పుట ౩౦౫ లో వ్యాఖ్యాతము.

చుండఁగా శాస్త్రము పీడింపఁబడినది యగు నని యెద్ది చెప్పంబడినదో యది దోషము కాదు. మేము కర్మమునకు ఫలము నిచ్చు శక్తిని నిరాకరింపము. అట్టి శక్తి దానికున్నదియే. కాని యది విద్య మొదలగు కారణాంతరముచేఁ బ్రతిబంధింపఁ బడుచున్నది యని చెప్పు చున్నారము. శాస్త్రము కర్మమునకు ఫలము నిచ్చుశక్తి సద్భావమాత్రమున వ్యాపరించుచున్నది గాని ప్రతిబంధా ప్రతిబంధములందు వ్యాపరింపదు. ప్రతిబంధా ప్రతిబంధములు కల వని గాని లేవని గాని చెప్పంజాల దని యర్థము. "నహికర్మ క్షీయతే" యను స్మృతి భోగమును వినాగఁ గర్మము క్షయింప దను నర్థము కలది యగుట వలన నౌత్సర్గికము (=సామాన్యము). కాని ప్రాయశ్చిత్తాదులచే దానికి క్షయ మంగీకరింపబడుచునే యున్నది."సర్వం పాప్మానం తరతి, తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే య ఉచైనమేవం వేద, జ్ఞానిన స్సర్వ పాపాని శీర్యంతే నాత్ర సంశయ"యను

---

౧. తై. స. ౫. ౩. ౧౨౧. యః-అశ్వమేధేన-యజతే = ఎవఁ డశ్వమేధమున యజించుచున్నాఁడో, య ఉచ - ఏనం వేద - ఎవఁ డా యశ్వమేధ ప్రయోగమును జక్కఁగ నెఱుంగుచున్నాఁడో, (వాఁడు) సర్వం - పాప్మానం - తరతి = ఎల్లపాపముల నతిక్రమించుచున్నాఁడు, (మఱియును) బ్రహ్మహత్యాం - తరతి = బ్రహ్మహత్యాదోషమును దాఁటి పోవుచున్నాఁడు.

౨. జ్ఞాని పాపము లన్నియును నశించును. దీన సంశయము లేదు.

నవి మొదలగు శ్రుతిస్మృతులవలనఁ గర్మమునకు క్షయము కలుగుననునిది దాని నపవదించును. ప్రాయశ్చిత్తములు నైమిత్తికములు కావచ్చు నని యెద్ది చెప్పంబడినదో యది దోష సంయోగముచే విధింపఁబడుచున్నవానికి దోష నిర్ఘాత మను ఫలము సంభవించుచుండఁగా వేఱొక ఫలమును గల్పించుట కుపపత్తి లేకపోవుటవలన యుక్తము కాదు. ప్రాయశ్చిత్తములకువలె దోష క్షయోద్దేశమున విద్యకు విధానము లే దని యెద్ది చెప్పంబడినదో యిటఁ జెప్పుచున్నారము. సగుణ విద్యలయందు దట్టి విధానము గలదు. వానియందు వాక్యశేషమున నైశ్వర్యప్రాప్తియుఁ బాపనివృత్తియు విద్యావంతు (ఉపాసకు)నకుఁ జెప్పంబడుచున్నది. వాని కవివక్షాకారణము లేకపోవుటవలనఁ బాప ప్రహాణపూర్వక మగు నైశ్వర్యప్రాప్తి యావిద్యలకు ఫలమని నిశ్చయింపఁబడుచున్నది. పరికింపఁగా నిర్గుణవిద్యయందట్టి విధానము లేదు. లేకున్న నకర్త్రాత్మజ్ఞానమువలనఁ గర్మదాహము సిద్ధించును. అశ్లేష యని యాగాములగు కర్మములందు బ్రహ్మవిదుఁడు కర్తృత్వమునే పొందఁ డని చెప్పుచున్నది. పరికింపఁగా నతిక్రమించిన కర్మములందు మిథ్యాజ్ఞానమువలనఁ గర్తృత్వమును బొందిన వాఁడువలె నుండును. ఐనను విద్యాసామర్థ్యమువలన మిథ్యా

చున్నవని చెప్పుచున్నది బ్రహ్మవిదుఁడు పూర్వ ప్రసిద్ధ మగు (జ్ఞానము లేనియపుడున్న) కర్తృత్వ భోక్తృత్వ స్వరూపముకంటె విపరీతమును మూఁడు కాలములయందు నకర్తృత్వాభోక్తృత్వస్వరూపము నగు బ్రహ్మము నే నగుదును గాని యిప్పటికంటెఁ బూర్వకాలమునఁ గాని యిపుడు గాని భవిష్యత్కాలమునఁగాని నేను కర్తను భోక్తను గానని తెలిసికొనుచున్నాఁడు గదా! జ్ఞానమువలనఁ గర్మక్షయమైననే మోక్షము సిద్ధించును గాని యట్లు కాదేని యనాదికాలము నుండి ప్రవృత్తము లగు కర్మములకు క్షయాభావము గలుగుచుండఁగా మోక్షాభావమే యగును. మోక్షము కర్మఫలము వలె దేశకాలనిమిత్తాపేక్షము కా దగు నమునిది యనిత్యత్వ ప్రసంగమువలనను జ్ఞానఫలమునకుఁ బరోక్షత్వానుపపత్తి వలనను యుక్తము కాదు. కాఁబట్టి=జ్ఞానమువలనఁ గర్మక్షయము శ్రుతిస్మృతి న్యాయసిద్ధ మగుటవలన బ్రహ్మాధిగమము కలుగు చుండఁగా మరితక్షయము సిద్ధము.

ఇది నవమాధికరణము

ఇతరాధికరణము. ౧౧

సూ. ఇతరస్యాప్యేవ మసంశ్లేషః పాతేతు. ౧४

ప ఇతరస్య - అపి - ఏవం - అసంశ్లేషః - పాతే-తు.

అ. జ్ఞానవంతుని పాపమునకు వలెఁ బుణ్యమునకు నశ్లేష వినాశములు సంభవించును. ఇట్లగుచుండఁగాను విద్వాంసునకు దేహపాతానంతర మవశ్యము ముక్తియగును.

భా. పూర్వాధికరణము నందు బంధ హేతువగు స్వాభావికము నగు పాపమునకు జ్ఞాననిమిత్తము లైన యశ్లేష వినాశములు శాస్త్రవ్యపదేశము వలన నిశ్చయింపఁ బడెను. ధర్మము శాస్త్రీయ మగుటవలన (దానికి) శాస్త్రీయ మగు జ్ఞానముతో విరోధము లేదని శంకించుకొని దాని నిరాకరింపఁ బూర్వాధికరణ న్యాయాతిదేశము చేయంబడుచున్నది. ఇతరస్యాపి=జ్ఞానవంతుని పుణ్యకర్మమునకును, ఏవం=పాప కర్మమునకువలెను, అసంశ్లేషః = అశ్లేషవినాశములు సంభవించు చున్నవి. దేనివలనను? దానికిని స్వఫలహేతు వగుటచే జ్ఞానఫల ప్రతిబంధిత్వ ప్రసంగము వలనను, "ఉభే ఉహైవైష ఏతే తరతి"[1] యనునది మొదలగు శ్రుతులందు దుష్కృతమునకువలె సుకృతమునకును బ్రణాశవ్యపదేశము వలనను, "క్షీయంతే చాస్యకర్మాణి" యను సామాన్య శ్రుతి వలన, నకర్త్రాత్మబోధ నిమిత్త మగు కర్మక్షయము సుకృత

౧. బృ. ౬. ౪. ౨౨. ఏషః = బ్రహ్మవిదుఁడు, ఉభే - ఏతే - ఉహ = పుణ్యపాపలక్షణము లగు రెండు కర్మములను, తరతి = అతిక్రమించుచున్నాఁడు. బ్రహ్మవిదుఁడగు సన్న్యాసిపుణ్య పాప కర్మములు క్షయించునని యర్థము.

దుష్కృతములకుఁ దుల్యముగుటవలనను. జ్ఞానముంబట్టి చూ
డఁగా నికృష్టఫలము కలది యగుటవలన నిక్కడఁ గేవల పాప
శబ్దము పఠింపఁబడుచున్నదో యటుఁ బుణ్యము సైతము దాని
చేతనే గ్రహింపఁబడినది యని తెలియవలెను. "నైతం సేతు
మహోరాత్రే తరతః"[1] యను చోటను దుష్కృతముతో సుకృ
తము నుపక్రమించి "సర్వే పాప్మానోఽతో నివర్తంతే"[2] యని
యవిశేషముననే ప్రస్తుతములగుటం బాప్మశబ్దప్రయోగము
వలన శ్రుతియందు సుకృతమునందునుఁ బాప్మశబ్దప్రయో
గము కలదు. పాతే-తు-తుశబ్ద మవధారణార్థకము. ఇట్లు
బంధహేతువులగు ధర్మాధర్మములకు విద్యాసామర్థ్యమువలన
నశ్లేషవినాశసిద్ధి వలన విద్వాంసునకు శరీరపాతము గలుగు
చుండఁగా ముక్తి యవశ్యంభావిని యని నిర్ధారణముం జేయు
చున్నాఁము.

ఇది దశమాధికరణము

---

## అనారబ్ధకార్యాధికరణము. ౧౧

సూ. అనారబ్ధకార్యే ఏవతుపూర్వే తదవధేః. ౧౫

---

౧. ఛాం. ౮. ౪. ౧. ఈయాత్మసేతువు నహోరాత్రములు తరింపం
జాలవు.

౨. సర్వే పాప్మానః = అతిక్రాంతము లగు సుకృతదుష్కృతము
లన్నియును, అతః = బ్రహ్మనుండి, నివర్తంతే = మరలుచున్నవి. ఆత్మ
నిం జేరకయె మరలుచున్న వని యర్థము.

వ. అనారబ్ధకార్యే-ఏవ-తు-పూర్వే-తదవధేః.

అ. మోక్షప్రాప్తికి శరీరపాత మవధియని శ్రుతిచేఁ జెప్పంబడుటవలనఁ బూర్వార్జితములు జ్ఞానము పుట్టకము నుపీ జన్మమున నార్జింపఁబడినవియు నగు పుణ్యపాపముల ప్రవృత్తఫలములే (ఫలమీనారంభింపనివే) నశించును గాని ప్రవృత్తఫలములు నశింపవు; ప్రారబ్ధవ్యతిరిక్తము లగు కర్మలు జ్ఞానమువలన నశించునుగాని ప్రారబ్ధము నశింపదని భావము.

భా. మీఁదటి యధికరణములు రెండిటియందును సుకృతదుష్కృతములకు జ్ఞాననిమిత్తమైన నాశము నిశ్చయింపఁబడినది. అది యవిశేషమున నారబ్ధ కార్యములకు ననారబ్ధకార్యములకు (=ఫలము నీ నారంభించిన సుకృతదుష్కృతములకు నారంభింపని సుకృత దుష్కృతములకు) నగుచున్నదా ? కాక విశేషమున ననారబ్ధ కార్యములకే యగుచున్నదా ? యని విచారింపఁబడు చున్నది. అట్టి విచారము గలుగుచుండఁగాను "ఉభే ఉహ్యేవైష ఏతేతరతి" యనది మొదలగు శ్రుతులందు విశేషశ్రవణము లేమివలన నవిశేషము ననే వానికి క్షయమని ప్రాప్తింపఁగాను "అనారబ్ధకార్యే ఏవ త"ని నిరాకరించు చున్నాఁడు. అనారబ్ధకార్యే - ఏవ - తు=అప్రవృత్తఫలములే యగు, పూర్వే=జన్మాంతర సంచితములు నీజన్మమునను జ్ఞానోత్పత్తికిం బూర్వము సంచితములు

అగు సుకృతదుష్కృతములు జ్ఞానప్రాప్తివలన నశించుచున్నవి. కాని యే సుకృతదుష్కృతములచే బ్రహ్మజ్ఞానాయతన మగు నీ జన్మ మారంభింపఁబడినదో యట్టి యారబ్ధకార్యములు సామిభుక్తఫలములు నగు (=అనుభవింపఁబడిన సగము ఫలము కలవి యగు) సుకృత దుష్కృతములు నశింపవు. ఏకారణము వలన నిది నిశ్చయింపఁబడుచున్నది? తదవధేః="తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే"[1] యని శ్రుతిచే క్షేమ (=మోక్ష) ప్రాప్తికి శరీరపాత మవధి యని చెప్పఁబడుట వలనను. జ్ఞానమే మోక్షప్రాప్తి కవధియయ్యెనేని జ్ఞానము వలన సర్వకర్మక్షయము గలుగుచుండఁగా దేహస్థితికిఁ గారణము లేమివలన జ్ఞానప్రాప్త్యనంతరమే మోక్షముం బొందవలసినది. అట్లగుచుండఁగా (శ్రుతి) శరీరపాత మగునందాఁకఁ బ్రతీక్షను జెప్పరాదు. శరీరపాత మవధి యని చెప్పక పోవలె నని యర్థము. ఓయీ! యెట్లు కర్త్రాశ్రయజ్ఞానము వస్తుబలముచేతనే కర్మముల క్షయింపఁజేయుచుఁ గొన్నింటిని నశింపఁజేసి కొన్నింటి నుపేక్షించును? అగ్నిబీజసంపర్కము సమానమగుచుండఁగాఁ గొన్ని బీజములశక్తి నశించుచున్నది; కొన్ని బీజములశక్తి నశింపదనని యంగీకరింప శక్యము కాదుగదా! యనినఁ

---

౧. ఛాం. ౬. ౧౪. ౨. బ్రహ్మవిదునకుఁ బ్రారబ్ధప్రాప్త మగు దేహ మెంతకాలము నిలుచునో యంతకాలమే సత్సంపత్తికి విలంబము గాని తరువాత వెంటనే ముక్తుఁ డగుచున్నాఁ డని యర్థము.

జెప్పంబడుచున్నది. ఆరబ్ధకార్యమగు కర్మాశయము(ప్రారబ్ధము) నాశ్రయింపక జ్ఞానోత్పత్తి యుపపన్నము గాదు. అట్టి కర్మము మాశ్రయింపఁబడినది యగుచునుండఁగాఁ గుమ్మరిసారెకు వలెఁ బ్రవృత్తమైన దానికంతరాళమునఁ బ్రతిబంధము సంభ వింపమివలన వేగము క్షయించునందాఁకఁ బ్రతిపాలనము యుక్త మగుచున్నది. అకర్త్రాత్మత్వజ్ఞానమును మిథ్యాజ్ఞాన బాధచేఁ గర్మములను నశింపంజేయుచున్నది (కాని) మిథ్యా జ్ఞానము బాధిత మైనను ద్విచంద్రాదిజ్ఞానమువలె సంస్కార వశమునఁ గొంతకాల మనువర్తించుచునే యుండును. (విక్షేపక మగు నవిద్యాలేశమే=సంస్కారము.) మఱియు నిట (జీవన్ము క్తియందు) బ్రహ్మవిదునకుఁ గొంతకాలము దేహము నిలు చునా? నిల్వదా? యని వివదింపందగదు. ఒకని హృదయ ప్రత్యయమగు(=హృదయాధీనమగు) బ్రహ్మవేదనమును శరీర ధారణమును మఱియొకనిచేఁ బ్రతిక్షేపింప నెట్లు శక్యమగు? శ్రుతి స్మృతులందు స్థిత ప్రజ్ఞ లక్షణ నిర్దేశముచే నిదియే (జీవన్ముక్తియే) నిర్దేశింపఁబడుచున్నది. కాఁబట్టి యనారబ్ధ కార్యము లగు (=ప్రారబ్ధవ్యతిరిక్తము లగు) సుకృతదుష్కృత ములకేవిద్యాసామర్థ్యమువలన క్షయమగునని నిర్ణయము.

ఇది యేకాదశాధికరణము

### అగ్నిహోత్రాద్యధికరణము. ౧౨

సూ. అగ్నిహోత్రాదితు తత్కార్యాయైవ తద్దర్శనాత్. ౧౬

ప. అగ్నిహోత్రాది-తు-తత్కార్యాయ-ఏవ-తద్దర్శనాత్.

అ. శ్రుతియందు కర్మములకు జ్ఞానసాధనత్వము గాన్పించుటవలన నిత్యమును ముఖ్యాగ్నిహోత్రాద్యము వైదికము నగు నగ్నిహోత్రాదికర్మము జ్ఞానకార్యమగు ముక్తి కుప యోగించును. జ్ఞానమువలన దానికింకు నిత్యమగు పుణ్య మునకే నాశముగాని దానికి క్షయము లేదు.

భా. పుణ్యమునకు నైతె శ్లేష వినాశములం దఘ న్యాయ మతిదేశింపబడినది. ఆయతిదేశము సర్వపుణ్యవిషయ మని యాశంకించికొని యీసూత్రముచే నిరాకరించు చున్నాఁడు. "తు"శబ్ద మాశంక నపనయించుచున్నది. అగ్ని హోత్రాది = ఏద్ది యగ్నిహోత్రాదిరూపమును వైదికము నగు నిత్యకర్మము కలదో యది, తత్కార్యాయైవ=జ్ఞానమున కద్ది కార్యమో దాని కొఱకే సమర్థ మగుచున్నది. దానిని సాధింపనే సమర్థమగుచున్నది యని యర్థము. ఏ ప్రమా ణమువలనను? తద్దర్శనాత్ = "తమేతం వేదాను వచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా నాశకేన" యనునది మొదలగు శ్రుతులందుఁ గర్మములకు జ్ఞానసాధ

---

౧. బృ. ౬. ౪. ౨౨. అ. 3. ౪౫౮ పుటలో వ్యాఖ్యాతము.

సత్వము కాన్పించుటవలనను. అయ్యా! జ్ఞానముం గర్మము విల
క్షణకార్యము లగుటవలన వానికిఁ గార్యైకత్వ ముపపన్నము
కాదనిన దధివిషములు జ్వరమరణ కారణము లయినను గుడ
మంత్రసంయుక్తములైన వానికే తృప్తిపుష్టి కార్యదర్శనము
వలన వానికివలెఁ గర్మమునకు జ్ఞానసంయుక్తమైన దానికి మోక్ష
కార్యత్వోపపత్తివలన నిది దోషము కాదు. ఓయీ! మోక్ష
మనారభ్యము (=నిత్యము) దీనికెట్లు కర్మకార్యత్వము చెప్పం
బడుచున్నదియనినఁ గర్మ మారాదుపకారక మగుటవలన నిది
దోషముకాదు. కర్మముజ్ఞానమునకే ప్రాపకమగుచుఁ బ్రణాళిచే
మోక్షమునకుఁ గారణమని గౌణముగాఁ జెప్పంబడుచున్నది.
జ్ఞానోత్పత్తి యైనతరువాతఁ గర్మము లేమింజేసి యీకార్యై
కత్వాభిధాన మతిక్రాంత కర్మవిషయము. అనిమోజ్య మగు
బ్రహ్మమే యాత్మయని (=తానని) తెలిసికొన్న విద్వాంసుఁడు
శాస్త్రమునకు విషయముకాకపోవుటవలన బ్రహ్మవిదునకాగా
మ్యగ్నిహోత్రాదికర్మము సంభవింపదు గదా! (ఇట్లు సూత్ర
ము నిర్గుణ విద్యావిషయ మని యంగీకరించి భోజన లాంగల
ములు జీవనమునకువలె జ్ఞానకర్మములు సాక్షాత్పారంపర్యము
లచే మోక్షమునకుఁ గారణము లని చెప్పి యిపుడు సూత్రము
సగుణవిద్యావిషయ మగుచు నుండఁగా సాంజస్యము కలదని
చెప్పుచున్నాఁడు.) సగుణ విద్యలందుఁ గర్తృత్వా నతివృత్తి

(శ్రౌతత్వము విహితత్వము)వలన నాగామ్యగ్నిహోత్రాదికర్మము నయితము సాధించును అభిసంధి యగు (ఫలాపేక్షను పెట్టుకొని చేయంబడినది యగు) దానికిని గార్యాంతరాభావము వలన విద్యాసంబంధోపపత్తి కలుగు.

అవ. ఈయశ్లేష వినాశములం జెప్పు వచనమునకు విషయ మెద్ది? "తస్యపుత్త్రా దాయ ముపయంతి, సుహృద స్సాధు కృత్యాం, ద్విషంతః పాపకృత్యా" మని కొందఱు చెప్పు వినియోగ వచనమునకు విషయ మెద్ది యను నాశంక గలుగుటవలన నుత్తరముం జెప్పుచున్నాఁడు.

సూ. అతోఽన్యాపి హ్యేకేషా ముభయోః. ౧౭

ప. అతః - అన్యా- అపి- హి - ఏకేషాం-ఉభయోః.

అ. అగ్నిహోత్రాది కర్మములకంటె నితరమగు నేకామ్య కర్మము కలదో యదియే యీ యశ్లేష వినాశవచనమున కును వినియోగవచనమునకును విషయము.

భా. అతః = అగ్నిహోత్రాదిక మగు నిత్యకర్మము కంటెను, అన్యా-అపి= ఎద్ది ఫలముంగోరి చేయంబడుచున్నదో యట్టి యితర మగు పుణ్యకర్మమును, అస్తిహి=కలదు గదా! దానికే, ఏకేషాం=కొన్ని శాఖలవారిది యగు "సుహృద స్సాధుకృత్యా" మిత్యాది వినియోగవచనము చెప్పంబడినది.

౧. అ. ౩. ౨౭౮ పుటలో వ్యాఖ్యానము.

(అట్టి పుణ్యాపాపకర్మములు బ్రహ్మవిదుని మిత్రులందును శత్రులందును దమ్ముంబోలిన కర్మములం బుట్టించి జ్ఞానము వలనఁ దాము నశించు నని చెప్పంబడిన దని భావము.) "ఇతర స్యాప్యేవ మసంశ్లేష" యని యఘమునకువలె నశ్లేష వినాశ నిరూపణమును దానికే. ఇట్టి కామ్యకర్మము విద్య కుపకారికా దను నంశమునను, ఉభయోః=జైమిన్యాచార్యు నకును బాదరాయణాచార్యునకును సంప్రతిపత్తి కలదు.

ఇది ద్వాదశాధికరణము

---

విద్యావీర్యవత్తరాధికరణము. ౧౩

సూ. యదేవ విద్యయే తి హి. ౧౮

ప. యదేవ విద్యయా - ఇతి - హి.

అ. "యదేవవిద్యయా" యను శ్రుతి విద్యతోఁ గూడిన కర్మమునకు స్వప్రయోజనసాధనత్వమున నతిశయముం జెప్పుచున్నదియై కేవల కర్మమునకు స్వప్రయోజన సాధ నత్వముం జూపుచున్నది యను కారణమువలన నుభయవిధ మగు కర్మమును స్వసామర్థ్యము ననుసరించి బ్రహ్మసాక్షా త్కారమునకు సాధన మగుచున్నది.

భా. పూర్వాధికరణమున ముముక్షునిచే మోక్ష ప్రయోజనోద్దేశమునఁ జేయఁబడినదియు నిత్యము నగు నగ్ని

హోత్రాది కర్మ ముపాత్త దురితక్షయమునకు హేతు
త్వద్వారమున సత్త్వశుద్ధికారణత్వముం బొందుచున్నదై
మోక్షప్రయోజన మగు బ్రహ్మాధిగమమునకు నిమిత్త మగు
టచే బ్రహ్మవిద్యకు శేషకార్య మగుచున్నది యని తెలియం
బడినది. అట్టి యగ్నిహోత్రాదికము కర్మాంగవ్యపాశ్రయమగు
విద్యకు (ఉపాసనకు)ఁ గూడినదియుఁ గేవలమును గలదు.
"య ఏవం విద్వాన్ యజతే,[1] య ఏవం విద్వాన్ జుహోతి,[2]
య ఏవం విద్వాన్ శంసతి,[3] య ఏవం విద్వానుద్గాయతి,[4] తస్మా
దేవం విద మేవ బ్రహ్మాణం కుర్వీత,[5] తేనోభౌ కురుతః యశ్చైత
దేవం వేద యశ్చ న వేద"[6] యనునవి మొదలగు శ్రుతులవలన

౧. యః = ఎవఁడు, ఏవం విద్వాన్ = ఇట్లుపాసించుచున్నవాఁడ గుచున్, యజతే = యజించుచున్నాఁడో.

౨. ఎవఁడిట్లుపాసించుచున్నవాఁ డగుచు నగ్నిహోత్రముం జేయుచున్నాఁడో.

3. ఎవఁ డిట్లెఱింగినవాఁ డగుచు స్తుతించుచున్నాఁడో.

౪. ఎవఁ డిట్లుపాసించుచున్నవాఁ డగుచు గానముం జేయుచున్నాఁడో.

౫. ఛాం. ౪. ౧౭. ౧౦. తస్మాత్ = ఉపాసకుఁడే యజమానుని కోర్కులం సంపాదింప సమర్థుఁ డగుటవలనను, ఏవంవిదం-ఏవ = ఇట్లుపాసింప నెఱింగినవానినే, బ్రహ్మాణం - కుర్వీత = బ్రహ్మనుగా వరించునది.

౬. ఛాం. ౧. ౧. ౧౦. ఎవ్వఁ డీ యోంకారరహస్యము నెఱుంగునో యతఁడు నెఱుంగనివాఁడును కర్మములం జేయుచుందురు. కాని యెఱింగి చేసినవాని కర్మము ఫలవత్తర మగును.

విద్యాసంయుక్త మగు నగ్నిహోత్రాదికర్మముం గలదు; కేవలముం గలదు. ఆకర్మముల విషయము విద్యాసంయుక్త మగు కర్మమే ముముక్షునకు విద్యాహేతు వగుటచే దానితో నేకకార్యత్వముం బొందుచున్నదా? విద్యాసంయుక్తముం గేవలము నవిశేషమున విద్యతో నేకకార్యత్వముం బొందుచున్నదా? యను నిది విచారింపఁబడుచున్నది. దేనివలన సంశయము? "తమేతమాత్మానం వేదానువచనేన యజ్ఞేన బ్రాహ్మణా వివిదిషంతి" యని సామాన్యముగా యజ్ఞాదు లాత్మజ్ఞానమున కంగములని వినంబడుటవలనను; విద్యాసంయుక్త మగు నగ్నిహోత్రాదికర్మమునకు విశిష్టత్వము తెలియంబడుటవలనను. ఏమి ప్రాప్తమయ్యెను? "యదహరేవ జుహోతి తదహః పునర్మృత్యుమపజయత్యేవం విద్వా[1]ని"త్యాది శ్రుతులవలనను. "బుద్ధ్యా[2] యుక్తో యయాపార్థ కర్మబంధం ప్రహాస్యసి, దూరేణ హ్య

౧. బృ. ౩. ౫. ౨. ఏవంవిద్వాన్ = జగము సర్వముం బయోరూప మగు నాహుతి పరిణామ మగుటవలన లోకమంతయు బయసునం బ్రతిష్ఠిత మని యెఱింగినవాఁడు, యదహరేవ - జుహోతి = పయసుచే నేదినమున నగ్నిహోత్రకర్మముం జేయునో, తదహః-పునః=ఆ దినమే, అపమృత్యుం జయతి = అపమృత్యువును జయించుచున్నాఁడు.

౨. భగ. ౨. ౩౯. ఓ యర్జునుఁడా! సాంఖ్యబుద్ధియందు నీకపరోక్ష మగు నాత్మతత్త్వము సంధివింపఁబడెని, యయాబుద్ధ్యాయుక్తః=ఏబుద్ధితోఁ గూడినవాఁడవై (పరమేశ్వరార్పిత మగు కర్మయోగముచే శుద్ధాంతఃకరణుఁడవగుచు) కర్మబంధం=కర్మాత్మక మగు బంధమును, ప్రహాస్యసి=విడువఁ గలవో (యట్టి యోగమునందలి యీ బుద్ధిం జెప్పెదను వినుము.)

వరం హ్మ బుద్ధియోగా ద్ధనంజయ" యనునది మొదలగు స్మృతులవలనను విద్యావిహీనమగు కర్మముకంటె విద్యోపేత మగు కర్మమునకు విశిష్టత్వము (శ్రేష్ఠత్వము) తెలియంబడుట వలన విద్యాసంయుక్త మగు నగ్నిహోత్రాదికర్మమే యాత్మ విద్యాశేషత్వముం గొనుచున్నది గాని విద్యావిహీన మగు కర్మ మాత్మవిద్యాశేషత్వముం గొనదని ప్రాప్తమయ్యె. ఇట్లు ప్రాప్తింపఁగా నీసూత్రముం జెప్పుచున్నాఁడు. విద్యావిహీనుఁ డగు బ్రాహ్మణునికంటె విద్వాంసుఁ డగు బ్రాహ్మణుఁడు వలె విద్యావిహీన మగు నగ్నిహోత్రాదికర్మముకంటె విద్యా సంయుక్త మగు నగ్నిహోత్రాదికర్మము విశిష్ట మను నిది సత్యమే. ఐనను విద్యారహిత మగు కర్మ మత్యంత మనపే క్ష్యము గాదు. దేనివలనను? "త మేత మాత్మానం యజ్ఞేన వివిదిషంతి" యని యవిశేషముగా నగ్నిహోత్రాది కర్మము విద్యాహేతువుగా శ్రుత మగుటవలనను. అయ్యా! విద్యా సంయుక్త మగు నగ్నిహోత్రాదికర్మమునకు విద్యావిహీన మగు నగ్నిహోత్రాదికర్మముకంటె [1]విశిష్టత్వావగమము వలన విద్యావిహీన మగు నగ్నిహోత్రాదికర్మ మాత్మవిద్యా హేతువుగా ననపేక్ష్యమే యని చెప్పంబడినది యనిన నిది

౧. భగ. ౨. ౪౯. జ్ఞానయోగముకంటెఁ గర్మయోగము మిక్కిలి నికృష్టమైన దని యర్థము.

యిట్లు తగదు. విద్యాసహాయ మగు నగ్నిహోత్రాదికమునకు విద్యానిమిత్త మగు సామర్థ్యాతిశయముతో సంబంధమువలన నాత్మజ్ఞానముం గూర్చి యొకానొక యతిశయము కాఁగలదు గాని యట్లు విద్యావిహీన మగు దానికిఁ గారా దని కల్పింప వచ్చును. అంతియె కాని "యజ్ఞేన వివిదిషంతి" యని యవిశేషమున నాత్మజ్ఞానాంగముగా వినంబడిన యగ్నిహోత్రాది కర్మమునకు ననంగత్వ మంగీకరింప శక్యము కాదు. అది ప్రతిపాదింపఁబడుచున్నది. యదేవ విద్యయా-ఇతి="యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా" యని స్రుతి, హి= ఎక్కారణమువలన విద్యాసంయుక్త మగు నగ్నిహోత్రాది కర్మమునకు వీర్యవత్తరత్వముం జెప్పుటచే స్వకార్యముం గూర్చి యొకానొక యతిశయముం జెప్పుచున్నది యై విద్యావిహీనమగు నాకర్మమునకే యా ప్రయోజనముఁగూర్చి వీర్యవత్త్వమును= స్వప్రయోజనమును సాధించు సామర్థ్యమును జూపుచున్నదియో యా కారణమువలన విద్యాసంయుక్త మగు నిత్యాగ్నిహోత్రాదికమును విద్యావిహీన మగునదియు రెండును ముముక్షువుచే మోక్షప్రయోజనోద్దేశమున నీ జన్మమునందుఁ గాని పూర్వజన్మమునందుఁ గాని జ్ఞానోత్పత్తికంటెం బూర్వ మెద్ది యనుష్ఠింపఁబడినదో యది తన సామర్థ్యమునకుం దగినట్లు బ్రహ్మాధిగమ ప్రతిబంధకారణ

మగు ననుపాత్తదురితమునకు క్షయహేతుత్వాభావము, బ్రహ్మ
జ్ఞాన కారణత్వము గాఁగలమన్నది యై కేవలా మనన
శ్రద్ధా ధ్యాన సాత్త్వికత్వాదులను సంపాదించు కారణములను సాపే
క్షించినది యై బ్రహ్మవిద్యకు సహకారిత్వము కలదియై యుం
చున్న దని సిద్ధము.

ఇతి అగ్నిహోత్రాద్యధికరణము

---

## ఇతరక్షపణాధికరణము. ౧౪

సూ. భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే. ౧౯

ప. భోగేన-తు-ఇతరే-క్షపయిత్వా-సంపద్యతే.

అ. ఆరబ్ధకార్యము లగు పుణ్యపాపములను భోగమున
నశింపఁజేసి (బ్రహ్మవిదుఁడు) బ్రహ్మమును పొందుచున్నాఁడు.

భా. అనారబ్ధకార్యము లగు పుణ్యపాపములకు జ్ఞాన
సామర్థ్యమువలన క్షయము చెప్పఁబడినది. (బ్రహ్మవిదుఁడు)
ఇతరే-తు = ఆరబ్ధకార్య (=ఫల)ము లగు పుణ్యపాపము
లను, భోగేన=సుఖదుఃఖాద్యనుభవముచేతను, క్షపయిత్వా=
నశింపఁజేసి "తస్య తావదేవ చిరం, యావన్న విమోక్ష్యేఽథ
సంపత్స్య ఇతి, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" యనునవి మొద
లగు శ్రుతులవలనను, సంపద్యతే = బ్రహ్మమును పొందు
చున్నాఁడు. అయ్యా! సమ్యగ్దర్శన (బ్రహ్మసాక్షాత్కార)

మున్నదియైనను దేహపాతముకంటెం బూర్వకాలమునందు
భేదదర్శనము ద్విచంద్రాదిదర్శనన్యాయమున నె ట్లనువర్తిం
చునో యట్లే తరువాతను ననువర్తించు ననిన నిమిత్తా
భావమువలన నట్లనువర్తింపదు. దేహపాతప్రాక్కాలికుం డగు
బ్రహ్మవిదునకుం దనువృత్తి నిమిత్త ముపభోగశేషక్షపణము
కలదు గాని దేహపాతోత్తరకాలికుం డగు బ్రహ్మవిదునకుం
దట్టి యనువృత్తినిమిత్తము లేదుగదా! అయ్యా! (యనా
రబ్ధఫల మగు) వేఱొకకర్మాశయము నూతన మగు భోగము
నారంభింపంగలదనిన నది దగ్ధబీజ మగుటవలన నట్లారం
భింపంజాలదు. మిథ్యాజ్ఞానావష్టంభ మగు కర్మాంతరము
గదా దేహపాతము గలుగుచుండంగా నుపభోగాంతరముం
గలిగించును. ఆమిథ్యాజ్ఞానము సమ్యగ్జ్ఞానమువలన దగ్ధ మగు
కారణము వలన నారబ్ధకార్యక్షయము గలుగుచుండంగా
విద్వాంసునకుం గైవల్య మవశ్యం భావియనునది సాధువు.

ఇది చతుర్దశాధికరణము

---

ఇది శ్రీగోవిందభగవత్పాదశిష్య శ్రీమచ్ఛంకరభగవత్పాదకృత
శారీరకమీమాంసాభాష్య చతుర్థాధ్యాయ
ప్రథమపాదాంధ్రీకరణము

---

# ఆంధ్రసూత్రభాష్యము

అధ్యాయము ౪. పాదము ౨.

---

## వాగధికరణము. ౧

సూ. వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ. ౧

ప. వాక్ - మనసి - దర్శనాత్ - శబ్దాత్ - చ.

అ. మనోవృత్తి యుండఁగనే వాగ్వృత్తికి లయము కాన్పించుటవలనను వృత్తివృత్తిమత్తుల కభేదోపచారము వలన శబ్దము (శ్రుతియు) పపన్న మగుటవలనను వాగింద్రియ వృత్తి మనసున లయించుచున్నది యని యర్థము.

భా. (పూర్వపాదము నంతిమాధికరణమున బ్రహ్మవిదునకు నిర్గుణబ్రహ్మసంపత్తి చెప్పఁబడినది.) తరువాత నిపుడు సగుణవిద్యాఫలప్రాప్తికొఱకు దేవయానమార్గముం జెప్పఁగలవాఁడై ప్రథమమున యథాశాస్త్రముగా నుత్క్రాంతి క్రమముం జెప్పుచున్నాఁడు. విద్వాంసునకు (ఉపాసకునకు) నవిద్వాంసునకు నుత్క్రాంతి సమాన మని చెప్పఁగలఁడు గదా! "అస్య

---

౧. ఛాం. ౬. ౮. ౬. (దేహము శిథిల మగుచుండఁగా నింద్రియసంఘాతము జీవాధిష్ఠితమై యే క్రమమున నీదేహమును వదలి దేహాంతరముం

పురుషస్య సోమ్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయా” మని ప్రాయణ విషయమగు శ్రుతి కలదు. ఈ శ్రుతియందు వృత్తిమతియగు వాకునకే (వాగింద్రియమునకే) మనసునందు సంపత్తి (లయము) చెప్పంబడుచున్నదా? వేఱొకపక్షమున వాగ్వృత్తికి సంపత్తి చెప్పంబడుచున్నదా? యని (వాక్పదమునకుఁ గరణభావ వ్యుత్పత్తులచే నింద్రియ తద్వృత్తులకు లయభావము వలన) సంశయము కలదు. అట్టి సంశయము కలుగఁగా వాగింద్రియమే మనసున లయించుచున్న దని (పూర్వపక్షము) ప్రాప్తమయ్యెను. అట్లయిననే శ్రుతి యనుగ్రహింపఁబడినది యగును. వేఱొకలాగున నయ్యేనేని లక్షణ ప్రసక్తించును. శ్రుతిలక్షణా విశయము గలపుడు శ్రుతియె న్యాయ్యము గాని లక్షణగాదు కదా! కాఁబట్టి వాగింద్రియమునకే మనసునఁ బ్రవిలయమని

---

ప్రవేశించునో యా ప్రకారముం జెప్పుచున్నాఁడు.) సోమ్య = సోమపానార్హుఁడవగు నో శ్వేతకేతూ; వాక్ = వాగింద్రియవృత్తి, మనసి = మనసునందుఁ, సంపద్యతే = లయమగుచున్నది. (అప్పుడతని బంధుగు లతఁడు మాటలాడలేఁడని చెప్పుదురు. మనః = మనోవృత్తి, (ఎప్పు డుపసంహరింపఁబడుచున్నదో యపుడు) ప్రాణే = ప్రాణమునందు (నిద్రాకాలమునవలె నేకీభవించుచున్నది.) అపుడు జ్ఞాతులు తెల్విపోయినని చెప్పుదురు. ప్రాణః = ప్రాణవృత్తి (ఎప్పు డుపసంహరింపఁబడుచున్నదో యపుడు జీవునం దేకీభవించుచున్నది. అతఁడు) తేజసి = తేజముతోఁగూడిన భూతములందు నిల్చుచున్నాఁడు. తేజః = అధ్యక్షునితోఁ గూడినదియు నితరభూతములతోఁ గూడినదియు నగు నా తేజము, పరస్యాం = దేవతాయాం = పరదేవతయం దేకీభవించుచున్నది.

ఇట్లు ప్రాప్తింపగాను, వాక్ = వాగింద్రియవృత్తి, మనసి = మనసునందు, సంపద్యతే - ఇది = లయించుచున్నదియని చెప్పుచున్నారము. ఆచార్యులు "వాఙ్మనసి" యనియే పలుకుచున్నారు గాన నిట్లు వాగ్వృత్తి యని వ్యాఖ్యానింప వచ్చునన నది సత్యమే కాని యుత్తరమునను "అవిభాగో వచనాత్"అను సూత్రమున (నిర్గుణబ్రహ్మవిషయకమునకు) నింద్రియప్రవిలయము జెప్పుచు నను కారణమువలన నిట వృత్త్యుపశమ మాత్రమే వివక్షితమని తెలియంబడుచున్నది. తత్త్వ (=ఇంద్రియ) ప్రవిలయ వివక్ష యిటను నయ్యేనేని యెల్లచోట్ల నింద్రియలయము సమాన మగుటవలన నుత్తరముననే దానిని విశేషించి చెప్పరాదు. కనుక నిట వృత్త్యుపసంహారవివక్ష గలుగుచుండగా మనోవృత్తి యుండగనే వాగ్వృత్తి కుపసంహారము పూర్వ మగునని యర్థము. దేనివలనను? దర్శనాత్ = మనోవ్యాపార ముండగనే వాగ్వృత్తికి బూర్వ ముపసంహారము కాన్పించుటవలనను. మనోవృత్తి యుండగనే మొదట వాగ్వృత్తి కుపసంహారము కాన్పించుచున్నది కాని వృత్తిమంతమగు వాగింద్రియమునకే మనసున నుపసంహార మెవ్వరికిని చూడ శక్యము కాదు గదా! అయ్యా! శ్రుతి సామర్థ్యమువలన వాగింద్రియమునకే మనసున నుపసంహారము యుక్తమని చెప్పంబడినది యనిన వాగింద్రియమునకు

మనసు ప్రకృతి (ఉపాదానకారణము) కాకపోవుటవలన నది యుక్తము కాదని చెప్పుచున్నాఁడు. మృత్తునందు శరావము నకు వలె దేనికి దేనినుండి యుత్పత్తియో దానికి దానియందుఁ బ్రవిలయము న్యాయ్యము. వాకు మనసునుండి పుట్టుచున్న దనుటకుఁ బ్రమాణ మెద్దియు లేదు. వృత్త్యుద్భవాభిభవముల ప్రకృతిసమాశ్రయములుం గానంబడుచున్నవి. తైజస మగు నగ్నికిఁ బార్థివము లగు నింధనములవలన వృత్త్యుద్భవమును జలములందు వృత్త్యుపశమముం గాన్పించుచున్నవి గదా! ఈ పక్షమున "వాఙ్మనసి సంపద్యతే" యను శ్రుతి యెట్లు (శబ్ద మెట్లు) పపన్నమగు నని శంకించుటవలనను, శబ్దాచ్చ= శబ్ద మీ పక్షమునందును వృత్తిపరముగా నుపపన్న మగుట వలన నని చెప్పుచున్నాఁడు. వృత్తికినివృత్తిమత్తునకు నభే దోపచారమువలన శబ్ద మీపక్షమునను నుపపన్న మగు నని యర్థము.

సూ. అత ఏవచ సర్వాణ్యను. ౧

ప. అతః - ఏవ - చ - సర్వాణి - అను.

అ. శ్రుతియందలి యింద్రియశబ్దమునకు వృత్తిపరత్వ ముపపన్న మగుటవలననే చక్షురాదు లగు నెల్లయింద్రియ ములును వృత్తిద్వారముననే మనసు ననువర్తించుచున్నవి. మనసున లయించుచున్న వని యర్థము.

భా. "తస్మా దుపశాంతతేజాః పునర్భవ మింద్రియై ర్మనసి సంపద్యమానైః" యను శ్రుతియం దవిశేషమున (సామాన్యముగా) నెల్ల యింద్రియములకును మనసునందు లయము వినంబడుచున్నది. అట్లయినను, అత ఏవచ = వాకు నకు వలెం జక్షురాదులకును మనసు నవృత్తియందు యుండగా వృత్తిలోపము గాన్పించుటవలనను (బహిఃవృత్తి కాని వాని యందుం) దత్త్వప్రలయము సంభవింపక పోవుటవలనను నింద్రియశబ్దమునకు వృత్తి పరంబోపపత్తివలనను, సర్వాణి = ఎల్ల యింద్రియములును వృత్తిద్వారమునసే, అను (వర్తంతే) = మనసునను వర్తించుచున్నవి. ఇంద్రియముల కన్నిటికిని మనసు నను పసంహారము సమానమైనను వాకు నకుం బృథగ్గ్రహణము "వాఙ్మనసి సంపద్యతే" యను నుదా హరణాను రోధమువలనం గావింపంబడియెను.

ఇది ప్రథమాధికరణము

౧. ప్ర. ౩. ౯. (శ్రుత్యర్థము) = మృతుండు, ఉపశాంతతేజాః = చల్లారిన శరీరోష్ణ్యము కలవాడై, తస్మాత్ = ఉత్క్రమణమువలనం దగు వాతను, మనసి - సంపద్యమానైః = మనసునం బ్రవేశించిన, ఇంద్రియైః = ఇంద్రియములతోడను, పునర్భవం = శరీరాంతరమును, (ప్రతిపద్యతే = పొందుచున్నాడు.)

## మనోధికరణము. ౨

సూ. తన్మనః ప్రాణ ఉత్తరాత్. 3

ప. తత్ - మనః - ప్రాణే - ఉత్తరాత్.

అ. తనచే గ్రహింపఁబడిన యింద్రియవృత్తులు గల మనసును వృత్తిద్వారముననే ప్రాణమునందు లయించుచున్న దని యుత్తరవాక్యమువలనం దెలియవలెను.

భా. “వాఙ్మనసి సంపద్యతే” యనుచోట వృత్తి సంపత్తి వివక్ష యనునిది తెలియంబడినది. పిమ్మటను “మనః ప్రాణే” యను నుత్తరవాక్య మెద్ది కలదో యట సైతము వృత్తిలయమే వివక్షింపఁబడుచున్నదా? వృత్తిమత్సంపత్తి వివక్షింపఁబడుచున్నదా? యనుసంశయము కలుగఁగా శ్రుత్యనుగ్రహమువలనను వానికిఁ బ్రకృతివికారభావప్రాపపత్తి వలనను వృత్తిమత్సంపత్తియే వివక్షిత మని ప్రాప్త మయ్యెను. అది యెట్లన్నం బ్రతిపాదింపఁబడు చున్నది. “అన్నమయం హి సోమ్య మన ఆపోమయః ప్రాణ”[6] యని యన్నప్రకృతికముగా మనమును నుదకప్రకృతికముగాఁ బ్రాణమునుబలించు చున్నారు. “తా అన్న మసృజంత” (ఉదకము లన్నమును

---

[6] ఛాం. ౬. ౫. ౪. సోమ్య = ఓశ్వేతకేతూ! (ఎక్కాణనమువలన భుజింపఁబడిన యన్నముయొక్క సూక్ష్మాంశము మనమును, త్రావిన నీళ్లయొక్క సూక్ష్మాంశము ప్రాణమునో యా కారణమువలనను) మనః = మనసు, అన్నమయం — హి = అన్నవికారమును, ప్రాణః = ప్రాణము, ఆపోమయః = ఉదకవికారము ననుట యుక్తము.

స్ఫురించినది) యను నీతిచేతను కాబట్టి=ప్రకృతి వికారముల
కభేదము వలన నన్నము మనస్సును ప్రాణము నుదకములు
నగుటవలన మనస్సు ప్రాణమున లయించుచున్నది యనుట సిద్ధి
కలదో యది యన్నము ముదకమున లయించుచున్నది యనునది
యే యని ప్రాప్తము కాగా చెప్పుచున్నారము. తత్ - మనః=
తనచే గ్రహింపఁబడిన యింద్రియవృత్తులు గల మనస్సును
వృత్తిద్వారముననే ప్రాణమున లయించుచున్నదని, ఉత్త
రాత్ = తరువాతి వాక్యమువలన నవగంతవ్యము. అట్టికదా
నిద్రింప నిచ్ఛగలవానికిని మరణించువానికిని బహిస్పంద
నాత్మక మగు ప్రాణవృత్తి యుండగనే మనోవృత్తుల కుప
శమము కాన్పించుచున్నది. మనస్సును ప్రాణప్రకృతికము
కాకపోవుటవలన మనసునకుఁ బ్రాణమునందు స్వరూప
లయము సంభవింపదు. ఓయీ! మనసునకుఁ బ్రాణ
ప్రకృతికత్వము చూపఁబడినది యనిన నిది సారము
(=న్యాయ్యము) కాదు. ఇట్టి ప్రాణప్రాప్త మగు తత్ప్రకృతి
కత్వముచే మనసు ప్రాణమున లయింప నర్హము కాదు.
ప్రాణ ముదకవికార మైన యన్నమున మనసు లయింపవలెను.
అన్న ముదకముల లయింపవలెను. ఉదకములందే ప్రాణము
లయింపవలెను. ఈ పక్షము (ప్రాణ ముదక మను పక్షము)
నందును బ్రాణభావమునఁ బరిణమించిన యుదకములవలన

మనసు పుట్టుచున్న దనుటకుఁ బ్రమాణ మెద్దియు లేదు. కా బట్టి = ప్రాణము మనసునకు సాక్షాత్ప్రకృతి కాకపోవుట వలన మనసునకుఁ బ్రాణమున స్వరూపాప్యయము సంభ వింపదు. వృత్తిలయమునను వృత్తి వృత్తిమత్తుల కభేదోప చారమువలన శబ్ద ముపపన్నమగు చున్న దని మున్ను చెప్పం బడినది.

ఇది ద్వితీయాధికరణము

---

అధ్యక్షాధికరణము. 3

సూ. సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః. ౪

క. సః - అధ్యక్షే - తదుపగమాదిభ్యః.

అ. ప్రకృతమగు ప్రాణము, మరణకాలమున నింద్రి యాదు లన్నియు జీవునిం బొందు నని వినంబడుటవలన నవిద్యో పాధికుఁ డగు నతనియందే లయించుచున్నది.

భా. దేనికి దేనినుండి యుత్పత్తి లేదో దానికి దాని యందు వృత్తిలయమె కాని స్వరూపలయము సంభవింప దనునిది నిశ్చయింపఁబడినది. పిమ్మట నిపుడు "ప్రాణ స్తేజసి" యనుచో శ్రుత్యనుసారముగాఁ బ్రాణమునకుఁ దేజమునందే వృత్త్యుపసంహార మగునా? దేహేంద్రియ పంజరాధ్యక్షుఁడగు జీవునందు వృత్త్యుపసంహార మగునా? యనునిది చింతింపఁ

బడుచున్నది. అట శ్రుతి మిక్కిలి శంకింపఁదగినది కాకపోవుట వలన నశ్రుతకల్పన మన్యాయ్య మగుటవలనను దేహమునందే ప్రాణమునకు సంపత్తి యగు నని యిట్లు ప్రాప్తము కాఁగాను "సోఽధ్యక్షే" యని చెప్పుచున్నాఁడు. సః = ప్రకృత మగు ప్రాణము, అధ్యక్షే = అవిద్యాకర్మ పూర్వప్రజ్ఞోపాధికుఁ డగు విజ్ఞానాత్మునందు నిలుచుచున్నది యని యర్థము. దేనివల నను? తదుపగమాదిభ్యః = ప్రాణము లన్నియు నంతకాల మున జీవునిం బొందుట మొదలగువానిని శ్రుతి చెప్పుటవల నను. "ఏవమేవేమ మాత్మాన మన్తకాలే సర్వే ప్రాణా అభి సమాయన్తి యత్రైత దూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి" యని శ్రుత్యం తర మవిశేషమున నెల్ల ప్రాణముల నభ్యుపగామములుగాఁ జూపుచున్నది గదా! విశేషమునను "తముత్క్రామంతం

---

౧. బృ. ఉ. ౩. ౩౮. ఏవమేవ = ప్రయాణేచ్ఛ గలుగు రాజును సేవకులంబోలె, యత్ర = ఎప్పుఁ (డాత్మఁడు) ఏతత్ = ఊర్ధ్వోచ్ఛ్వాసీ- భవతి = ఈ యెగరోఁజు కలవాఁ డగుచున్నాఁడో, అంతకాలే = అట్టి యంతకాలమునను, ఇమం-ఆత్మానం = ఈ పరలోకమునకుం బోవం దలఁచిన భోక్త్రాత్మను, సర్వేప్రాణాః = వాగాదు లగు నింద్రియము లన్నియును, అభిసమాయంతి = ఎదుర్కొని పోవుచున్నవి.

౨. బృ. ఉ. ౪. ౨. ప్రాణః = పంచవృత్తులు గల ప్రాణము, ఉత్క్రా- మంతం = పరలోకమునకుం బోవుచున్న, తం = ఆ విజ్ఞానాత్మని, అనూ- త్క్రామతి = వెంబడించి పోవుచున్నది. అనూత్క్రామంతం = ఆత్మను వెంబ డించిపోవుచున్న, తం = ఆ ప్రాణమును, సర్వేప్రాణాః = ఇంద్రియము లన్నియును, అనూత్క్రామంతి = అనుసరించిపోవుచున్నవి.

ప్రాణో నూత్క్రామతి” యని పంచవృత్తులు గల ప్రాణము నకు నధ్యక్షానుగామిత్వముం జూపుచున్నది. “ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి” యని యితర ప్రాణములకుఁ దదను వృత్తిత్వముం జూపుచున్నది. మఱియు “సవిజ్ఞానోభవతి యని యధ్యక్షున కంతర్విజ్ఞానము కలిమిం జూపుటచే నతనియందు పీతకరణసముదాయ మగు ప్రాణమున కవస్థానముం దెలుపుచున్నది. ఓయీ! “ప్రాణ స్తేజసి” యని వినంబడుచున్నది గదా యెట్లు ప్రాణ మధ్యక్షునం దని యధికావాపము చేయంబడుచున్నది? ఉత్క్రమణాది వ్యవహార మధ్యక్షప్రధాన మగుటవలనను శ్రుత్యంతరగత మైన విశేష మును నపేక్షణీయ మగుటవలనను నిది దోషము కాదు.

అవ. అపుడు “ప్రాణ స్తేజసి” యను శ్రుతి యెట్లుప పన్న మగు ననినం జెప్పుచున్నాఁడు.

సూ. భూతేషు తచ్ఛ్రుతేః. ౫

ప. భూతేషు - తచ్ఛ్రుతేః.

అ. “ప్రాణ స్తేజసి” యను శ్రుతివలనఁ బ్రాణము జీవ ద్వారమునఁ దేజస్సహచరితము లగుభూతములందు లయించుచున్నది యని యెఱుంగునది.

౧. బృ. ౬. ౪. ౨. (అ యంతకాలమున నీ యాత్మ్కుఁడు) సవిజ్ఞానః = స్వప్నమునవలెఁ గర్మకళముకలన విశేషవిజ్ఞానము కలవాఁడు, నస్వతంత్రుఁడును, భవతి = అగుచున్నాఁడు.

భా. "తచ్ఛ్రుతేః = ప్రాణ స్తేజసి" యను శ్రుతివలన నాప్రాణసంయుక్తుఁ డగు నధ్యక్షుఁడు, భూతేషు = తేజస్సహచరితములును దేహబీజభూతములు సూక్ష్మములు నగు భూతములందు నిల్చుచున్నాఁ డని యెఱుంగునది. అయ్యా! యీ శ్రుతి ప్రాణమునకుఁ దేజమునందు స్థితిని జూపుచున్నది గాని ప్రాణసంపృక్తుఁ డగు నధ్యక్షునకుఁ జూపదంటేని "సోధ్యక్షే" యను సూత్రమున నుదాహరింపఁబడిన శ్రుతిబలమువలన నధ్యక్షుఁడు నంతరాళమున నుపసంఖ్యాతవ్యుఁ డగుటవలన నిది దోషముకాదు. ఎవఁడైన స్రుఘ్నమునుండి మధురకుంబోయి యటనుండి పాటలీపుత్త్రమునకుం బోవునో యతఁడును స్రుఘ్నమునుండి పాటలీపుత్త్రమునకుం బోయెనని చెప్పం దగును గదా! కాఁబట్టి "ప్రాణ స్తేజసి" యని ప్రాణసంయుక్తుఁ డగు నధ్యక్షునకే తేజస్సహచరితము లగు భూతములం దవస్థానము చెప్పంబడినది.

అవ. "ప్రాణ స్తేజసి" యని తేజ మొక్కటియే వినంబడుచున్నదిగదా యెట్లు భూతములం దని చెప్పంబడు చున్న దను శంక కలుగఁగాఁ జెప్పుచున్నాఁడు.

సూ. నైకస్మి న్దర్శయతో హి. ౬

ప. న - ఏకస్మిన్ - దర్శయతః - హి.

అ. పంచాగ్నివిద్యయందలి ప్రశ్నోత్తరములు జీవుఁడు

దేవలోకశరీరమును గ్రహించునపు డొక తేజమునే యాశ్ర యింపఁ డని తెలుపుచున్నవి. కాఁబట్టి తేజశ్శబ్దముచే నెల్ల భూతములు గ్రహింపఁబడుచున్న వని యర్థము.

భా. న-ఏకస్మిన్=కార్యమగు శరీరమున కనేకభూతాత్మకత్వము కాన్పించుటవలన జీవుఁడు దేవలోక శరీరమును బొందఁగోరినపు డొక తేజమునందే నిలిచియుండఁడు = తేజము నొకదానినే యాశ్రయించియుండఁడని యర్థము. దర్శయతః-హి = ఆపః పురుషవచస" యను ప్రశ్న ప్రతివచనము లీయర్థమును జూపుచున్నవిగదా! "త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్" ను సూత్రముకడ నది వ్యాఖ్యానింపఁబడినది. ఈ యర్థమును శ్రుతిస్మృతులుం జూపుచున్నవి (యని) సూత్రభాగమునకు వే అర్థము. "[1]పృథివీమయ ఆపోమయో వాయుమయ ఆకాశమయస్తేజోమయ" ఇత్యాదికము శ్రుతి. "అణ్వ్యోమాత్రా వినాశిన్యో

---

౧. బృ. ౬. ౪. ౫. (పరుఁ డగు నాత్ముఁడే) పృథివీమయః=పార్థివ శరీరారంభమునఁ బృథివీవికార మనియును, ఆపోమయః = వరుణాదిలోకమున జలశరీరారంభమునందు జలమయుఁ డనియును, వాయుమయః = వాయవ్యశరీరారంభమున వాయుమయుఁ డనియును, ఆకాశమయః = ఆకాశశరీరారంభమున నాకాశమయుఁ డనియును, తేజోమయః = దేవశరీరారంభమునఁ దేజోమయుఁడనియు బంధకము లగు నాయాయుపాధులచే సంసరించుచున్నాఁడు.

౨. మను. అ. ౧. శ్లో. ౨౭. దశార్థానాం = పంచమహాభూతముల యొక్కయు; అణ్వ్యః = సూక్ష్మములును, మాత్రాః = పరిచ్ఛిన్నములును, అవినాశిన్యః = ముక్తి గలుగునందాఁక నశింపనివియు నగు, యాః=ఏభాగములు గలవో, తాభిస్సార్థం = వానితోఁ గూడను, ఇదం-సర్వం = యున్న

దశార్థానాంతు యాస్మృతాః తాభిస్సార్థ మిదం సర్వం సంభవత్యను పూర్వశ” యనునది మొదలగునది స్మృతి. అయ్యా! వాగాదు లగు నింద్రియము లుపసంహరింపఁబడినవి యగుచు నుండఁగా శరీరాంతరముం బొందఁగోరునపుడు వేఱొక శ్రుతి “క్వాయం తదాపురుషో భవతి” యని యుపక్రమించి “తౌహ యదూచతుః కర్మహైవ తదూచతుః, అథయత్ప్రశశంసతుః కర్మహైవ తత్ప్రశశం సత”ని (జీవునకుఁ) గర్మాశ్రయత్వ మును నిరూపించుచున్నది యనిన నిటఁ జెప్పఁబడుచున్నది. అట గ్రహాతిగ్రహసంజ్ఞ గల యింద్రియవిషయాత్మక మైన బంధనమునకుఁ బ్రవృత్తికర్మ ప్రయుక్తమగుటవలనఁ గర్మాశ్రయత్వము చెప్పంబడె. ఇట భూతోపాదానము వలన దేహాంతరోత్పత్తి గాన భూతాశ్రయత్వము చెప్పంబడినది. ప్రశంసాశబ్దమువలనను నటఁ గర్మమునకుఁ బ్రాధాన్యమాత్రము చూపంబడినది గాని యాశ్రయాంతరము నివారింపఁ బడ లేదు గనుక విరోధము లేదు. (ఇట్లు మొదట బాహ్యాం

---

-[illegible]బడినదియు, ముందుఁ జెప్పఁబోవునదియు నగు నంతయును, అనుపూర్వశః = సూక్ష్మమునుండి స్థూలమును, దానినుండి స్థూలతరము ననునీ[illegible]కారముగాను, సంభవతి = (ఈశ్వరునివలన) సంభవించుచున్నది.

౧. బృ. ౫. ౨. ౧౩. అయం-పురుషః = ఆత్మఁడు, తదా = శరీరాంతరముం బొందఁగోరునపుడు, క్వ-భవతి = ఎట నుండును? దేని నాశ్రయించియుండు నని యార్తభాగుఁడు యాజ్ఞవల్క్యు నడిగెను.

౨. ఆ యాజ్ఞవల్క్యార్తభాగు లిద్దఱును గర్మమే యపు డాత్మనాశ్రయ మని చెప్పిరి. మఱియు దాని నే స్తుతించిరి.

ద్రియములకు మనసునందు వృత్తిలయమును మనోవృత్తికిఁ బ్రాణమునందు లయమును బ్రాణవృత్తికి భూతోపహితజీవునందు లయమునను నుత్క్రాంతివ్యవస్థ చెప్పంబడినది.)

ఇది తృతీయాధికరణము

---

అసృత్యుపక్రమాధికరణము. ౪

సూ. సమానాచాసృత్యుపక్రమా దమృతత్వంచానుపోష్య॥

ప. సమానా-చ-ఆసృత్యుపక్రమాత్-అమృతత్వం-చ-అనుపోష్య.

అ. వాఙ్మనసీత్యాద్యుత్క్రాంతి మార్గోపక్రమము వానికును విద్వాంసునకు నవిద్వాంసునకు నవిశేషశ్రవణమువలన సమానము. అవిద్వాంసుఁడు భూతసూక్ష్మముల నాశ్రయించి కర్మానుసారముగా జన్మించి సంసరించుచున్నాఁడు. విద్వాంసుఁడు మోక్షనాడీద్వారము నాశ్రయించి యవిద్యాదిక్లేశముల మొదలంటఁ గాల్పకయే సగుణవిద్యాసామర్థ్యమువలన నాపేక్షికమైన యమృతత్వముం బొందుచున్నాఁడు.

భా. మీఁదఁ జెప్పంబడిన యుత్క్రాంతి విద్వాంసులకు నవిద్వాంసునకు సమానమా? విశేషవతియా? యని, సందేహించుచున్నవారి కీయుత్క్రాంతి విశేషము కలది యన్న-

ప్రాప్త మగును. ఇది భూతాశ్రయవిశిష్టమును భూతములు మరల జన్మించుట కాశ్రయింపఁబడు చున్నవియును గదా! విద్వాంసుఁ డమృతత్వముం బొందుచున్నాఁ డని శాస్త్ర మర్యాద; కాఁబట్టి విద్వాంసునకుఁ బునర్జన్మము సంభవింపదును. కనుక నీ యుత్క్రాంతి యవిద్వాంసునకే. ఓయీ! విద్యాప్రకరణమునఁ బఠింపఁబడుటవలన నిది విద్వాంసునకే కావచ్చుననిన స్వాపాదులు వ్రాలె యథాప్రాప్తానుకీర్తనమువలనన ట్లనరాదు. ఎట్లు (ఛాందోగ్యమునను) "యత్రైతత్పురుషస్స్వపితినామ, అశిశిషతి నామ, పిపాసతినామ" యని సర్వప్రాణిసాధారణములే యగు స్వాపాదులు విద్యాప్రకరణమునను బ్రతిపాదింపఁ గోరఁబడిన వస్తుప్రతిపాదనమున కనుగుణముగాఁ బఠియింపఁ బడుచున్నవి గాని విద్వాంసునకు విశేషముగా (ప్రత్యేక ముగా) విధియింపఁబడవో యట్లే మహాజనగతమైన ...

---

౧. ఛాం. ౬. ౮. ౧. ఎపుడు పురుషుఁడు స్వపితి యని చెప్ప ... పురుష ... పుడు సచ్ఛబ్దవాచ్యమగు దేవతతో నేకీభవించుఁ ... దిల్లో ... నిస్ ...

... ౬. ౮. ౩. ఎపుడు పురుషుఁ డశిషతి యను పే... చెప్పఁగ ... యపుడు పురుషుఁడు భుజించిన యన్నమును ... కొలఁ ... పరిణమింపఁజేయును. అపు డతని తిన్న యన్నమ ... చుచున్నా ...

౬. ౮. ౫. ఎపుడు పురుషుఁడు పిపాసతి ... ప్ర ... ను తేజ మతఁడు త్రావిన నీటిని లోహిత...

నుత్క్రమణము "తస్య హై తస్య హృదయ స్యాగ్రం ప్రద్యో
తతే తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి చక్షుష్టోవా
మూర్ధ్నోవా అన్యేభ్యోవా శరీరదేశేభ్య"యని (శ్రుతియందు)
వినంబడుచున్నది. ఆనిష్క్రాంతివిద్వాంసు (=ఉపాసకు)నకు నవి
ద్వాంసునకు నియమము లేకుండ నగుచున్నదా? వేఱొక పక్ష
మున విద్వాంసునకు విశేషము కలదని నియమము కలదా ?
యని విచికిత్స గల్గుచుండఁగాను శ్రుతిసామాన్యమువలన నియ
మము లేదని ప్రాప్తింపఁగా విద్వాంసునిదియు నవిద్వాంసు
నిదియు నగు నుత్క్రాంతికి హృదయాగ్రప్రద్యోతనమును
దత్ప్రకాశితదారత్వమును సమానమే యైనను విద్వాంసుఁడు,
తత్ప్రకాశితద్వారః=ప్రద్యోత మను భావిఫలస్ఫురణముచేఁ
బ్రకాశింపఁజేయఁబడిన మార్గము గలవాఁడై మూర్ధస్థానము
వలననే నిష్క్రమించుచున్నాఁడు; తక్కినవారు వేఱుస్థాన

నుండి నిష్క్రమించుననేని విద్వాంసుఁ డుత్కృష్టమగు లోక మును బొందకయ పోవలెను. అట విద్య నిరర్థకయే యగును. తచ్ఛేషగత్యనుస్మృతియోగాత్-చ = విద్యాశేషభూతమును మూర్ధన్యనాడీసంబద్ధము నగు గమన మనుశీలింప (చింతింప)ఁ దగినది యని విద్యావిశేషములందు విధింపఁబడుచున్నది. దాని నభ్యసించుచున్నవాఁ డగుచు నామార్గముచేతనే నిష్క్రమించుచున్నాఁ డనునిది యుక్తము. కాఁబట్టి విద్వాంసుఁడు, హార్దానుగృహీతః=హృదయమున వసియించువాఁడు నదివఱకుఁ జక్కఁగా నుపాసింపఁబడినవాఁడు నగు బ్రహ్మ ముచే ననుగ్రహింపఁబడినవాఁడై తద్భావమును బొందినవాఁ డగుచు మూర్ధన్యయు నూటికంటె నధికయుఁ దరువాతిదియు నగు నాడిచే నిష్క్రమించుచున్నాఁడు. తక్కిన దేహదేశముల నుండి యితరులు (ఉపాసకులు కాని వారు) నిష్క్రమించు చున్నారు. అట్లే కదా హార్దవిద్యం బ్రస్తావించి “శతం

---

౧. ఛాం. ౮. ౬ ౬. హృదయస్య = మాంసపిండరూప మగు హృదయమునకు (సంబంధించిన) నాడ్యః = నాడులు, శతం-చ-ఏకా-చ = ప్రధానములుగా నూటొకటి (కలవు.) తాసాం = వానిలోను, ఏకా = ఒకటి = సుషుమ్న యను నది, మూర్ధానం = బ్రహ్మరంధ్రమును, అభినిస్సృ తా = వ్యాపించినది. తయా = ఆనాడి (మార్గము) చేతను, ఊర్ధ్వం - ఆయన్ = మీఁదికిం బోవుచున్నవాఁడు, అమృతత్వం = అమృతభావమును, ఏతి = పొందు చున్నాఁడు. విష్వక్ = నానాప్రకారములం బోయిన, అన్యాః = ఇతరములగు నాడులు, ఉత్క్రమణే = ఉత్క్రమణార్థములే, భవంతి = అగుచున్నవి. కాని యమృతత్వముకొఱకుఁ గావు.

నైకాచ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధాన మభినిస్సృ తైకా తయోర్ధ్వమాయ న్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్ర మణేభవంతి"యని (ఛందోగులు) పఠించుచున్నారు.

**ఇది నవమాధికరణము**

---

### రశ్మ్యనుసార్యధికరణము. ౧౦

సూ. రశ్మ్యనుసారీ. ౧౮

అ. శ్రుతియందవిశేషశ్రవణమువలన నుపాసకుఁడు రాత్రిగాని పగలుగాని మరణించి సూర్యకిరణముల ననుసరించినవాఁడై యూర్ధ్వలోకమునకుం బోవుచున్నాఁడు.

భా. (ఛాందోగ్యమునను) "అథయదిద మస్మిన్ బ్రహ్మపురేదహరం పుండరీకం వేశ్మ" యని యుపక్రమించి విహితమగు హార్దవిద్య కలదు. ఆవిద్యాప్రకరణమునను "అథ యఏతా హృదయస్య నాడ్య" యని యుపక్రమించి సప్రపంచముగా నాడీరశ్మిసంబంధముం జెప్పిన తరువాతను "అథ

౧. ఛాం. ౮. ౧. ౧. అ ౧. ౩౪౦ పుటలో దీనియర్థము వ్రాయఁబడినది.

౨. ఛాం. ౮. ౬. ౫. (అవిద్వాంసుఁడు) అథ = ప్రారబ్ధకర్మావసానమునందు, యత్ర = ఏకాలమునను, ఏతత్ = ఉత్క్రమణము కలుగునట్లుగాను, అస్మాత్ - శరీరాత్ = ఈశరీరమునుండి, ఉత్క్రామతి = బయలువెడలిపోవుచున్నాఁడో, అథ = అపుడు, ఏతైరేవ - రశ్మిభిః = ఈనాడులయందు వ్యాపించిన సూర్యకిరణముల (మార్గము) చేతనే, ఊర్ధ్వం ఆక్రమతే = కర్మముచే వశీకృతమగు మీఁదిలోకముం బ్రవేశించుచున్నాఁడు.

యత్రైతదస్మాచ్ఛరీరా దుత్క్రామత్యథైతైరేవ రశ్మిభి రూర్ధ్వ మాక్రమతే” యని చెప్పంబడినది. మఱియును “తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి” యని మరలఁ జెప్పంబడినది. కాఁబట్టి శతాధిక యగు నాడిచే నిష్క్రమించుచున్న వాఁడు రశ్మ్యనుసారీ=సూర్యరస్మ్యుల ననుసరించు చున్న వాఁ డగుచు నిష్క్రమించుచున్నాఁ డని తోఁచుచున్నది. ఆ రశ్మ్యనుసారిత్వము విశేషము లేకుండనే పగలు గాని రాత్రి గాని మరణించుచున్న వానికి సంభవించునా? వేఱొక పక్షమునఁ బగలు మరణించినవానికే సంభవించునా ? యని సంశయము గలుగుచుండఁగా నవిశేషశ్రవణమువలన నవిశేషముగానే రశ్మ్యనుసారి యగుచున్నాఁ డని ప్రతిజ్ఞ చేయంబడుచున్నది.

సూ. నిశి నేతి చే న్న సంబంధస్య యావద్దేహభావిత్వాద్దర్శ
　　　యతి చ. ౧౯

　　　ప. నిశి-న-ఇతి - చేత్ -న - సంబంధస్య - యావద్దేహ భావిత్వాత్ - దర్శయతి - చ.

　　　అ. నాడీరశ్మిసంబంధము దేహ మున్నంతకాల ముండునది కాఁబట్టి పగలు నాడీరశ్మిసంబంధము కలదు గనుకఁ బగలు మృతుఁడైనవాఁడు రశ్మ్యనుసారి కావచ్చును గాని రాత్రి మృతుఁ డగువాఁడు కాఁగూడ దనరాదు. నాడీరశ్మి సంబంధము

దేహ మున్నంతకాల ముండునని శ్రుతి చూపుచున్నదియును.

భా. నాడీరశ్మిసంబంధము పగలు కలదు కాఁబట్టి పగలు మృతుఁ డైనవానికి రశ్మ్యనుసారిత్వము కలుగును. కాని, నిశి = రాత్రియందు మృతుఁ డైనవానికి నాడీరశ్మి సంబంధము లేకపోవుటవలన రశ్మ్యనుసారిత్వము, న - ఇతి చేత్ = సంభవింపదంటేని, యావద్దేహ భావిత్వాత్ = నాడీరశ్మిసంబంధము దేహ మున్నంతకాలము నుండునది యగుటవలన, న = అట్లనరాదు. సిరా = (నాడీ) కిరణసంప ర్కము దేహ మున్నంతకాల ముండునదిగదా! దర్శయతి చ = "అముష్మా దాదిత్యా త్ప్రతాయంతే తా ఆసునాడీషు సృప్తా ఆభ్యోనాడీభ్యః ప్రతాయంతే తేముష్మి న్నాదిత్యే సృప్తా" యని శ్రుతి యీ యర్థముం జూపుచున్నదియు. నిదాఘసమయమున రాత్రులందు సైతము తాపాది కార్య దర్శనమువలనఁ గిరణానువృత్తి కాన్పించుచున్నది. (అపుడు

౧. ఛాం. ౮. ౬. ౨. (లోకములో దీర్ఘ మగు మార్గము సమీప గ్రామమును దూరగ్రామమును బొందునట్లు సూర్యకిరణములు సూర్యునిని మనుజునిం బొందుచున్నవి. ఎట్లన్నం జెప్పఁబడును.) రశ్ములు, అముష్మాత్ - ఆదిత్యాత్ = దూరముగానున్న సూర్య మండలమునుండి, ప్రతాయంతే = ప్రసరించుచున్నవి. తాః = అవి, ఆసు-నాడీషు=దేహములో నున్న నాడు లందుఁగా, సృప్తాః=ప్రసరించునవి యగును. ఆ రశ్ములు, ఆభ్యః-నాడీభ్యః= ఈ దేహములో నున్న నాడులనుండి, ప్రతాయంతే=ప్రాఁకుచున్నవి. తే= అవి, (రశ్మిశబ్ద ముభయలింగ మగుటవలనఁ బుల్లింగ నిర్దేశము.) అముష్మిన్-ఆదిత్యే=దూరమున నున్న సూర్యునందు, సృప్తాః = వ్యాపించినవి యగును.

హేమంతాది రాత్రులందు నౌష్ణ్యోపలబ్ధి కావలె ననిన దుర్దిన
ము లందువలె నిదాఘముకంటె నితరకాలపు రాత్రులందు
(కిరణ) స్తోకానువృత్తి సంభావ్యము. "అహ[౧]రేవైతద్రాత్రౌ విద
ధాతి" యని శ్రుతి రాత్రి సూర్యకిరణములకు స్తోకానువృత్తిం
జూపుచున్నది. రాత్రియందు మృతుఁడగువాఁడు రశ్ముల
ననుసరింపకయే మీఁదిలోకమునకుం బోవు ననిన రశ్మ్యను
సారానర్థక్యము (= రశ్మి శ్రుతికి దివామృత విషయముగా
సంకోచము) సంభవించును. శ్రుతి ప్రత్యేకించి యెవఁడు
పగలు మృతిఁ జెందునో వాఁడు సూర్యరశ్ముల ననుసరించి
మీఁదిలోకములకుం బోవుచున్నాఁడనియు నెవఁడు రాత్రి
మరణించునో వాఁడు రశ్ముల ననుసరింపకయె మీఁదిలోకము
నకుం బోవుచున్నాఁడనియుఁ జెప్పదుకదా! మృత్యుకాల
మునకు నియమము లేకపోవుటవలన, విద్వాంసుఁడైనను రాత్రి
మరణాపరాధమాత్రమున మీఁదిలోకమునకుం బోవఁడేని
విద్య పాక్షికఫల యగుటవలన దానియందుఁ బ్రవృత్త్యభా
వము ప్రసక్తించును. రాత్రి మృతుఁడగువాఁ డహారాగ
మముం గనిపెట్టుకొని యుండుననిన నొకపు డగ్నిసంపర్కము
వలన నహారాగమమునందు శరీరము రశ్మిసంబంధార్హము కాక

౧. (సూర్యుఁడు) రాత్రౌ = రాత్రియందును, అహరేవ-ఏతత్ = ఈ పగటినే, విదధాతి = చేయుచున్నాఁడు. సూర్యుఁడు రాత్రియందును స్తోకముగా ననువర్తించుచున్నాఁడని యర్థము.

పోవచ్చును. "సయావత్ క్షిప్యే న్మనస్తావ దాదిత్యం గచ్ఛతి" యని శ్రుతి యనుదీక్షను (పగటిని గనిపెట్టికొని యుండక పోవుటను) జూపుచున్నది. కాఁబట్టి యవిశేషముననే రాత్రి గాని పగలుగాని మరణించినవానికి రశ్మ్యనుసారిత్వము సంభవించును.

ఇది దశమాధికరణము

దక్షిణాయనాధికరణము. ౧౧

సూ. అతశ్చాయనేపి దక్షిణే. ౨౦

ప. అతః-చ-అయనే-అపి-దక్షిణే.

అ. కనిపెట్టుకొని యుండుట కుపపత్తి మొదలగువాని యభావము వలననే విద్వాంసుఁడు దక్షిణాయనమున మృతుఁడైనను విద్యాఫలముం బొందుచున్నాఁడు.

భా. అత ఏవ చ=ఉదీక్ష కనుపపత్తివలనను విద్యాఫలము పాక్షికము కాకపోవుటవలనను మృత్యువనియతకాలమగుటవలనను దక్షిణే-అయనేపి=దక్షిణాయనమునం దైనను

---

౧. ఛాం. ౮. ౬. ౫. సః = ఆ యుత్క్రమించు విద్వాంసుఁడు, మనః=మనస్సు, యావత్ =ఎంత కాలమునను, క్షిప్యేత్ =పోవునో, తావత్ = అంత కాలముననే, ఆదిత్యం = సూర్యునిని, గచ్ఛతి = చేరుచున్నాఁడు. ఉత్క్రమించు విద్వాంసుఁడు మనోవేగమున సూర్యమండలముం బ్రవేశించుచున్నాఁ డని యర్థము.

మృతుఁ డైన విద్వాంసుఁడు (=ఉపాసకుఁడు) విద్యాఫలము నవశ్యముఁ బొందుచున్నాఁడు. ఉత్తరాయణమరణమునకుఁ బ్రాశస్త్య ప్రసిద్ధివలనను భీష్మున కుత్తరాయణము దాఁకఁ బ్రతీక్ష కాన్పించుటవలనను "ఆపూర్యమాణపక్షాద్యాన్షడుదఙ్ఙేతిమాసా న్న"ను శ్రుతివలనను నుత్తరాయణ మవశ్య మపేక్షింపఁదగినది యను నీయాశంక నీసూత్రముచే వారించుచున్నాఁడు. ప్రాశస్త్య ప్రసిద్ధి యవిద్వద్విషయము. భీష్మున కుత్తరాయణ ప్రతిపాలన మాచార (అజ్ఞుల కుత్తరాయణమున నదృష్టము వలన మరణము ప్రాప్తమయ్యేనేని ప్రశస్త మని విద్వాంసులు చెప్పు వచనరూప మగునాచార) పరిపాలనార్థమును దండ్రి యనుగ్రహమువలనఁ బ్రాప్తమైన స్వచ్ఛంద మరణతాఖ్యాపనార్థమును గావచ్చును. శ్రుతి యాతివాహిక దేవతాపరముగాని కాలపరము గాదని "అతివాహి స్తల్లింగాత్త"ను సూత్రమునఁ జెప్పును.

౧. ఛాం. ౪. ౧౫. ౫. (అక్షిపురుషు నుపాసించువా రర్చిరాది మార్గముఁగం బోయి శుక్లపక్షదేవతను బొంది) ఆపూర్యమాణపక్షాత్ = శుక్లపక్షదేవతనుండి, యాన్-షట్-మాసాన్ = ఏ యాఱుమాసములను (సూర్యుఁడు) ఉదక్ = ఉత్తరదిశను, ఏతి = పొందుచున్నాఁడో, తాన్-మాసాన్ = ఆ మాసములను = ఉత్తరాయణదేవతను (బొంది వత్సరము మొదలగు మార్గమునఁ గ్రమముగా విద్యుల్లోకముం జేరుదురు. అక్కడ కొక యమానవపురుషుఁడు వచ్చి వీరిని బ్రహ్మలోకమునకుం గొనిపోవును.)

అవ. అయ్యా! స్మృతియందు "యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవయోగినః ప్రయాతాయాంతితం కాలం వక్ష్యామి భరతర్షభ" యని కాలప్రాధాన్యము ననుక్రమించి యహరాదికాలవిశేష మనావృత్తికొఱకు నియమింపఁబడి నదిగదా యెట్లు దక్షిణాయనమునఁ గాని రాత్రి గాని మరణించువాఁ డనావృత్తిం బొందు నను శంక గలుగుచుండఁగా (శ్రుత్యుక్తదహరాద్యుపాసకులకుఁ గాలాపేక్ష లేదని మాచేఁ జెప్పంబడినది గాని స్మార్తయోగులకుఁ గాలాపేక్ష కలదు కాఁబట్టి విరోధము లేదని) యుత్తరము చెప్పంబడుచున్నది.

సూ. యోగినః ప్రతిచ స్మర్యతే స్మార్తే చైతే. ౨౧

ప. యోగినః-ప్రతి-చ-స్మర్యతే-స్మార్తే-చ-ఏతే.

అ. ఈకాలనియమము యోగుల నుద్దేశించి యనావృత్తికొఱకు స్మృతియందుఁ జెప్పంబడినది. యోగసాంఖ్యములు స్మార్తములుగాని శ్రౌతములు కావు కాఁబట్టి యీకాల నియమము శ్రౌతము లగు నుపాసనములందు లేదు.

౧. భగ. ౮. ౨౩. భరతర్షభ = ఓ యర్జునుఁడా! యత్ర కాలే= ఏ కాలమందు, ప్రయాతాః = మరణించిన, యోగినః=కర్మ్ములును, సాంఖ్యులును, అనావృత్తిం = పునర్జన్మమున భావమును (=మోక్షమును), యాంతి= పొందుచున్నారో, (ఏకాలమున మరణించినవారు)ఆవృత్తించైవ - యాంతి= మరల నీలోకమునకు భోగార్థమై యాగమనముం బొందుచున్నారో, తం కాలం=ఆ కాలమును, వక్ష్యామి=చెప్పుదును.

భా. ఈయహరాదికాలవిసియోగము, యోగినః ప్రతిచ=యోగుల నుద్దేశించియే యనావృత్తికొఱకు, స్మర్యతే=స్మృతియందుఁ జెప్పంబడుచున్నది. ఏతే=ఈ యోగసాంఖ్యములు (భగవదారాధనబుద్ధిచే ననుష్ఠింపంబడిన కర్మము యోగము. ధారణాపూర్వకమైన యకర్తృత్వాభిమానము సాంఖ్యము) స్మార్తేచ=స్మృతిసిద్ధములు గాని శ్రుతిసిద్ధములు గావు. కాఁబట్టి విషయభేదమువలన (దహరాద్యుపాసనములు స్మృతిసిద్ధములు కాకపోవుటవలన) ను ప్రమాణభేదమువలనను స్మార్తమగు కాలనియమమునకు శ్రౌతములగు విజ్ఞానము (=ఉపాసనము) లందుఁ బ్రవేశము లేదు. అయ్యా! "అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ"నియును, "ధూమోరాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయన మ"నియును శ్రౌతములగు దేవయాన పితృయాణ

౧. భగ. ౮. ౨౪. అగ్నిః - జ్యోతిః = అర్చిరభిమానిదేవతయును, అహః = అహరభిమానిదేవతయును, శుక్లః = శుక్లపక్షాభిమానిదేవతయును, ఉత్తరాయణం-షణ్మాసాః=ఉత్తరాయణరూప మగు షణ్మాసాభిమానిదేవతయు (నీమార్గమున నెవ్వారో యా యర్చిరాదిమార్గమునం బోయిన బ్రహ్మోపాసనాపరులు క్రమముగా బ్రహ్మముం బొందుదురు.)

౨. భగ. ౮. ౨౫. ధూమాభిమానిదేవతయు, రాత్ర్యభిమానిదేవతయుఁ గృష్ణపక్షాభిమానిదేవతయు దక్షిణాయనదేవతయు నెట నెవ్వారో యా ధూమాదిమార్గమునం బోయిన యజ్ఞాదికర్తలు చంద్రలోకమున భోగముల ననుభవించి మరలి వత్తురు.

మార్గములే స్మృతియందుఁ బ్రత్యభిజ్ఞాతములు కాఁబట్టి శ్రుతిస్మృతులు భిన్నార్థము లనుట యయుక్త మనిన స్మృతి యందుఁ గాలముఁ జెప్పుదు నను ప్రతిజ్ఞవలన (శ్రుతిస్మృతులకు) విరోధము నాశంకించుకొని యిట్టి పరిహారము చెప్పంబడినది. ఎపుడు స్మృతియందును (గాలశబ్దముచే) నాతివాహిక దేవతలే గ్రహింపఁబడుదురో యపుడు విరోధ మెద్దియు లేదు. (కనుక విద్యాసామర్థ్యమువలనఁ బవలు గాని రాత్రి గాని దక్షిణాయనమునఁ గాని యెపుడైనను మరణించిన యుపాసకునకు విద్యాఫలప్రాప్తి సిద్ధము.)

ఇది యోగాదశాధికరణము

---

ఇది శ్రీమచ్ఛంకర భగవత్పాదకృత శారీరకమీమాంసాభాష్య చతుర్థాధ్యాయ ద్వితీయపాదాంధ్రీకరణము

---

# ఆంధ్రసూత్రభాష్యము

అధ్యాయము ౪. పాదము ౩.

---

అవ. వెనుకటిపాదమున నుత్క్రాంతిని నిరూపించి తత్సాధ్య మగు మార్గమును గంతవ్యమును నిరూపింప నీపాదము నారంభించుచున్నాఁడు.

## అర్చిరాద్యధికరణము. ౧

సూ. అర్చిరాదినా తత్ప్రథితేః. ౧

ప. అర్చిరాదినా - తత్ప్రథితేః.

అ. విద్వాంసుల కర్చిరాదిమార్గము ప్రసిద్ధ మగుట వలన బ్రహ్మముం బొందువాఁ డెల్ల నామార్గముననే పోవును.

భా. మృత్యుపక్రమము (మార్గోపక్రమము) వఱకు నుత్క్రాంతి సమాన మని చెప్పఁబడినది. మార్గము శ్రుత్యంతరములం దనేక ప్రకారముల వినంబడుచున్నది. "అర్థైత్రై రేవ

---

౧. బృ. ౬. ౨ ౧౫. తే = పంచాగ్న్యుపాసకు లగు గృహస్థులును, శ్రద్ధాపూర్వకముగా సత్యబ్రహ్మోపాసనముం జేయు వానప్రస్థులును త్రిదండిపరివ్రాజకులును, (అగ్నియందు వ్రేల్వఁబడినతరువాత దీప్తిమంతులై) అర్చిషం=అర్చిర్దేవతను, సంభవంతి = చేరుచున్నారు. అర్చిషః = అర్చిర్దేవతనుండి, అహః=అహరభిమానిదేవతను, సమీపించుచున్నారు. (కొన్ని పుస్తకములలో నర్చిష మభిసంభవంతి యనుదానికి బదులుగ నర్చిరభిసంభవంతి యనుపాఠము గలదు.)

రశ్మిభి రూర్ధ్వ మాక్రమతే” యని నాడీరశ్మి సంబంధముచే నొకమార్గము వినంబడుచున్నది. “తేర్చిష మభిసంభవం త్యర్చిషోహ” యని యర్చిరాదిక మగు నొక యయనము చెప్పంబడుచున్నది. “స^1^ఏతం దేవయానం పంథాన మాపద్యా గ్నిలోక మాగచ్ఛతి”యని యింకొక త్రోవ శ్రుతమగుచున్నది. “యదా^2^వై పురుషోస్మాల్లోకాత్ప్రైతి సవాయు మాగచ్ఛతి” యని వేఱొకపథము శ్రూయమాణ మగుచున్నది. సూ^3^ర్య ద్వారేణ తే విరజాః ప్రయాంతి” యని యింకొక వర్త్మము చెప్పఁబడుచున్నది. ఈ మార్గములు పరస్పరభిన్నములా ? యనేకవిశేషణములు గల యొక మార్గమా ? యని వాని

---

౧. కౌ. ౧. 3. సః=ఆ యుపాసకుఁడు, ఏతం దేవయానం-పంథానం=ఈ దేవయానమార్గమును, ఆపద్య = పొంది, అగ్నిలోకం = అగ్నిలోకమును, ఆగచ్ఛతి=చేరుచున్నాఁడు. అగ్నిస్వామిక మగు లోకమునకు వచ్చుచున్నాఁ డని యర్థము. (ఆపద్య యనుచో నాసాద్య యని యుపనిషత్కోశములలో నున్నది.)

౨. బృ. ౭. ౧౦. ౧. పురుషః = విద్వాంసుఁడు, యదావై=ఎపుడు, అస్మాత్—లోకాత్ = ఈలోకమునుండి, ప్రైతి = శరీరమును విడిచిపోవుచున్నాఁడో, (అపుడు) సః = అతఁడు, వాయుం — ఆగచ్ఛతి = వాయువుం బొందుచున్నాఁడు. వాయుస్వామిక మగులోకముం బొందుచున్నాఁడని యర్థము.

3. ముం. ౧ ౨. ౧౧. (ఎవ్వరు స్వాశ్రమవిహిత మగు కర్మమును హిరణ్యగర్భోపాసనమును జేయుచున్నారో) తే = వారు, విరజాః = విరజసః = క్షయించిన పుణ్యపాపకర్మములు గలవారై, సూర్యద్వారేణ = సూర్యమార్గముచేతను, ప్రయాంతి = ఎట హిరణ్యగర్భుఁ డున్నాఁడో యటకుఁ బోవుచున్నారు.

యందు సంశయము గలదు. అట్టి సంశయము గలుగు చుండఁగా నీ స్మృతులు భిన్నప్రకరణముల నున్నవి యగుట వలనను భిన్నములగు నుపాసనముల కంగములుగా వినంబడుట వలనను భిన్నములే యని ప్రాప్తమయ్యెను. మఱియును "అథైతైరేవ రశ్మిభి"యను నవధారణ మర్చిరాద్యపేక్ష గలుగు చుండఁగా నుపరోధింపఁబడుచున్నది; "స[1]యావత్క్షిప్యేన్మన స్తావ దాదిత్యంగచ్ఛతి" యను త్వరావచనమును బీడింపఁబడు చున్నది; కాఁబట్టి యీ పథములు భిన్నములే యని ప్రాప్తము కాఁగాను "అర్చిరాదినా" యని చెప్పుచున్నారము. బ్రహ్మముం బొందఁగోరు నెల్లవాఁడును, అర్చిరాదినా = అర్చిరాద్యధ్వము (=మార్గము) చేతనే పోవుచున్నాఁడని ప్రతిజ్ఞ చేయుచున్నారము. దేనివలనను ? తత్ప్రథితేః = విద్వాంసుల కెల్లరకు నర్చిరాదిమార్గము ప్రసిద్ధ మగుటవలనను. అదియె ప్రతిపాదింపఁబడుచున్నది. పంచాగ్నివిద్యా ప్రకరణమునను "యే[2]చామీ అరణ్యే శ్రద్ధాం సత్య ముపాసతే" యని విద్యాంతరశీలులకు నర్చిరాదిమార్గము వినిపింపఁబడుచున్నది.

---

౧. ఛాం. ౮. ౬. ౫ సః = ఆ యుపాసకుఁడు, యావత్ = ఎంత కాలములో, మనః - క్షిప్యేత్ = మనసు వోవుచున్నదో, తావత్ = అంత కాలముననే, ఆదిత్యం - గచ్ఛతి = సూర్యలోకమును బొందుచున్నాఁడు. శరీరమునుండి యుత్క్రమించుచున్న విద్వాంసుఁడు మనోవేగమున సూర్యలోకముం బొందుచున్నాఁడని యర్థము.

౨. బృ. ౬. ౨. ౧౫. (పంచాగ్నివిదులే కాక) యేచ-అమీ = ఎవరు, అరణ్యే = విజనస్థలమునందు, శ్రద్ధాం-సత్యం = శ్రద్ధాపూర్వకముగా సత్య

ఏ విద్యలందు గతి యెద్దియుఁ జెప్పంబడదో వానియందే యీ యర్చిరాదిమార్గము ప్రాప్తించు నను నిది కావచ్చును; కాని వేఱయందు వేఱువేఱు గతి వినిపింపఁబడుచున్నదో వానియం దర్చిరాద్యాశ్రయ మేల యనిన నిటుఁ జెప్పఁబడుచున్నది. ఈ మార్గము లత్యంతభిన్నము లయ్యె నేని యిది యిట్లగునుగాని యెల్లచో ట్లనేక దేశప్రత్యభిజ్ఞానము వలన నితరేతరవిశేషణవిశేష్యోపపత్తిం జేసి బ్రహ్మలోకముం బొందించునదియు ననేక విశేషణములు గలదియు నగు నీ మార్గ మొకటియే యొకచో నొక విశేషణముతోడను వేఱొకచో నింకొకవిశేషణముతోడను నుపలక్షితమని చెప్పుచున్నారము. ప్రకరణభేద మున్నను విద్యైకత్వ మున్నపు డితరేతరవిశేషణముల కుపసంహారమువలె గతివిశేషణములకు నుపసంహారము సిద్ధించుచున్నది. విద్యాభేద మున్నను గత్యేకదేశప్రత్యభిజ్ఞానము వలనను గంతవ్యాభేదము వలనను గతి కభేదమే. అదియే (=గంతవ్యాభేదమే) ప్రతిపాదింపఁబడుచున్నది. "తే తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి.

---

బ్రహ్మమును, ఉపాసతే = సేవించుచున్నారో యట్టి వానప్రస్థులుం ద్రిదండిసన్న్యాసులు నైతె మర్చిరాదిమార్గమునఁ బోవుచున్నారు.

౧. బృ. ౬. ౨. ౧౫. తే = ఆ బ్రహ్మవిదులు, తేషు - బ్రహ్మలోకేషు = నానావిధము లగుభోగములు గల బ్రహ్మలోకము లందుకే, పరాః=ప్రకృష్టు లగుచుకే, పరావతః = దీర్ఘాయువ్యంతుఁ డగు హిరణ్య

తస్మిన్ వసతి శాశ్వతీ స్సమాః, సాయా బ్రహ్మణోజితిర్యావ్యుష్టి స్తాం జితింజయతితాంవ్యుష్టిం వ్యశ్నుతే, తద్యఏవైతం బ్రహ్మలోకం బ్రహ్మచర్యేణానువిందంతి"యని యట నట బ్రహ్మలోక ప్రాప్తిరూపమగు ఫల మొకటియే చూపంబడుచున్నది. "అథైతైరేవరశ్మిభి" యను నవధారణ మర్చిరాద్యాశ్రయమున బాధింపబడుననునిది యీయవధారణము రశ్మి ప్రాప్తిపర మగుట వలన దోషము కాదు. ఒకశబ్దమే రస్మలను బ్రాపింపం జేయను నర్చిరాదులను వ్యావర్తిల్లంజేయను నర్హము కాదు

---

గర్భునియొక్క, పరాః - సమాః = అనేకము లగు వత్సరములు, వసంతి = వసించుచున్నారు. అనేకబ్రహ్మకల్పము లట నుందు రని యర్థము.

౧. బృ. ౭. ౧౦. ౧ (బ్రహ్మలోకముం బొందినవాఁడు) తస్మిన్ = బ్రహ్మలోకమునందు, శాశ్వతీ స్సమాః = అనేకవత్సరములు, వసతి = నివసించుచున్నాఁడు.

౨. కౌ. ౧. ౬ (బ్రహ్మలోకమునకుం బోయినవాఁ డతనితో సమాన దేహముంబొంది) బ్రహ్మణః = కార్యబ్రహ్మయొక్క, యా జితిః = ఏ సర్వలోకజయము కలదో, తాం జితిం = ఆ జయమును, జయతి = వశపఱచుకొనుచున్నాఁడు. (కార్యబ్రహ్మయొక్క) యా వ్యుష్టిః = ఏ సర్వలోకవ్యాప్తి కలదో, తాం - వ్యుష్టిం = ఆ వ్యాప్తిని, వ్యశ్నుతే = పొందుచున్నాఁడు.

3. ఛాం. ౮. ४. 3. తత్ - తత్ర = అధికృతులలోను, య ఏవ = ఎవరు, బ్రహ్మచర్యేణ = స్త్రీవిషయతృష్ణాత్యాగాది (సాధన)ము చేతను, అనువిందంతి = బ్రహ్మము నుపాసించుచున్నారో, (వారే) ఏతం - బ్రహ్మలోకం = ఈ బ్రహ్మాధిష్ఠిత మగు లోకమును బొందుచున్నారని యర్థము.

గదా! కాఁబట్టి యీ యవధారణము రశ్మిసంబంధమునే నిశ్చయించుచున్న దని యెఱుంగవలెను. (రాత్రి స్పష్టమైన రశ్మియోగము లేమింజేసి విద్వాంసునకు రశ్మిసంబంధము లేదని ప్రాప్తింపఁగా నేవకారము దన్నివృత్త్యర్థమ కాని యన్యనిరాసార్థము కాదని యర్థము.) త్వరావచనము నర్చిరాదిమార్గైక్య మున్నను 'నిమేషమాత్రమున నిట వత్తు నన్నట్లు వేఱొకమార్గము నపేక్షించి యీ మార్గము త్వరగా సత్యలోకముం బొందించు ననునర్థము కలదగుట వలనఁ బీడింపఁబడదు. మఱియును "అథైతయోః పథోర్న కతరేణచన" యను శ్రుతి దేవయాన పితృయాణములను రెండుమార్గములనుండి భ్రష్టు లగువారికిఁ గష్టమగు మూఁడవ మార్గమును జెప్పుచున్నది యగుచుఁ బితృయాణవ్యతిరిక్తము నర్చిరాదిపర్వము నగు దేవయానమార్గము నొక దానినే ప్రకటించు చున్నది. మఱియు (నుత్తరమార్గ మొక్కటియె యైన 'నర్చిరాదినా' యను విశేషణ మేలయనిన) నర్చిరాది మార్గమున ననేకపర్వములు నితరమార్గముల స్వల్పతరపర్వములు=(ఆవసథములు=మజిలీలు) నున్నవి. అనేకముల కాను

---

౧. ఛాం. ౫. ౧౦. ౮. (క్షుద్రజంతువులు) ఏతయోః-పథోః = ఈ యర్చిరాదిధూమాదిమార్గములలో, కతరేణ చన = ఒకదానిచేతనును, న = పోవవు.

గుణ్యమున నర్చిరాదుల నయనము న్యాయ్య మగుటవలన "నర్చిరాదినా తత్ప్రథితే" యని చెప్పంబడినది.

ఇది ప్రథమాధికరణము

## వాయ్వధికరణము. ౨

సూ. వాయు మబ్దా దవిశేషవిశేషాభ్యాం. ౨

ప. వాయుం - అబ్దాత్ - అవిశేషవిశేషాభ్యాం.

అ. అర్చిరాదిమార్గమునం బోవువారు సామాన్య విశేషోపదేశములవలన సంవత్సరముకంటెం దరువాతను నాదిత్యునికంటెం బూర్వమును వాయువును బొందుచున్నారు.

భా. ఏ క్రమ విశేషముచే నీ యర్చిరాదిమార్గవిశేషణముల కితరేతరవిశేషణవిశేష్యభావము సంభవించునో దాని నాచార్యుండు మిత్రభావముం బూని చెప్పుచున్నాండు. "సఏతం దేవయానం పంథానమాపద్యాగ్నిలోక మాగచ్ఛతి స వాయులోకం స వరుణలోకం స ఇంద్రలోకం స ప్రజాపతిలోకం స బ్రహ్మలోకం"[1] మని కౌషీతకీశాఖవారిచే దేవయానమగు మార్గము పఠింపంబడుచున్నది. అందు నర్చిరగ్ని శబ్దములు జ్వలన వాచకము లగుటవలన రెండు నేకార్థములే

---

౧. కౌ. ౧. 3. ఆపర్యంకోపాసకుండు దేవయానమార్గముం బ్రవేశించి యగ్నిలోకమును, వాయులోకమును, వరుణలోకమును, నింద్రలోకమును, బ్రజాపతిలోకమును, బ్రహ్మలోకమును బొందుచున్నాండని యర్థము.

కనుక నట నన్ని వేశ క్రమ మెద్దియు నన్వేషింపందగినది లేదు. అర్చిరాదిమార్గమున వినఁబడని వాయు వెన్నవచో నన్ని వే శయితవ్య మనినఁ జెప్పంబడుచున్నది. “తేఽర్చిష మభిసంభ వం త్యర్చిషోఽహరహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్య మాణపక్షాద్యాన్ షడుదఙ్జేతిమాసాం స్తాన్మాసేభ్య స్సంవ త్సరం సంవత్సరాదాదిత్య”మనుచోటను, అబ్దాత్ =సంవత్సర ముకంటెం దరువాత నాదిత్యునికంటెం బూర్వము నుపాసకు లు, వాయుం = వాయువుం బొందుచున్నారు. దేనివలనను? అవిశేష విశేషాభ్యాం = సామాన్యవిశేషోపదేశములవలనను. అవి ప్రతిపాదింపఁబడు చున్నవి. “స వాయులోక” మని సామాన్యమున నుపదేశింపఁబడిన వాయువునకు “యదావై

---

౧. ఛాం. ౫. ౧౦. ౧. పంచాగ్న్యుపాసకు లగు గృహస్థులును, బ్రహ్మనిష్ఠులగు, వానప్రస్థులును, బరివ్రాజకులును మరణానంతర మగ్ని దేవత నగ్ని దేవతనుండి యహార్దేవత నటనుండి శుక్లపక్షము నటనుండి యుత్త రాయణము, నటనుండి సంవత్సరదేవత, నటనుండి సూర్యు నటనుండి చంద్రు నటనుండి విద్యుత్తునుం బొందుదురు. అట నున్న వీరి నమానవపురుషుఁడు బ్రహ్మలోకమును బొందించుచున్నాఁ డని యర్థము.

౨. బృ. ౭. ౧౦. ౧. పురుషః=విద్వాంసుఁడు, యదావై =ఎపుడు అస్మాల్లోకాత్ = ఈ దేహమునుండి, ప్రైతి = బయలు వెడలి పోవుచు న్నాఁడో యపుడు, సః=అతఁడు, వాయుం=వాయువును, ఆగచ్ఛతి = చేరుచున్నాఁడు, సః=వాయువు, తత్ర = తనయందుఁ, తస్మై = వచ్చిన వానికొఱకుఁ, యథారథ చక్రస్య, ఖం = బండికంటి ఛిద్రముంబోలిన దానిని, (సందును) విజిహీతే=కలుగఁజేయుచున్నాఁడు, సః = ఆయుపాస కుఁడు, తేన=ఆరథచక్రముంబోలిన బిలమార్గముచేతను, ఊర్ధ్వ ఆక్రమతే = మీఁదికిఁబోవుచున్నాఁడు. (తరువాతను) సః=అతఁడు, ఆదిత్యం=సూర్యునిని ఆగచ్ఛతి=సమీపించుచున్నాఁడు.

పురుషోస్మాల్లోకాత్ప్రైతి సవాయు మాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా రథచక్రస్య ఖంతేన స ఊర్ధ్వ ఆక్రమతే స ఆదిత్య మాగచ్ఛతి = యని వేఱొక శ్రుతియందు విశేషోపదేశము చూపింపబడుచున్నది. శ్రుతియందుఁ జెప్పఁబడిన యాదిత్యునికంటె వాయువునకుం బూర్వత్వదర్శనమను నీ విశేషమువలన నబ్దాదిత్యుల కంతరాళమున వాయువు నన్నివేశయితవ్యము. ఎక్కారణమువలన నగ్నికంటెఁ బరత్వదర్శన మను విశేషమువలన నగ్నిలోకమునకుం దరువాత వాయువు సన్నివేశయితవ్యము కాదనిన నిది విశేషము కాదని చెప్పుచున్నారము. అయ్యా! "స ఏతం దేవయానం పంథాన మాపద్యాగ్నిలోక మాగచ్ఛతి సవాయులోక" మని శ్రుతి యుదాహరింపఁబడినది యనిన నిటఁ గేవలము పాఠము పౌర్వాపర్యమున నున్నదిగాని క్రమవచన మగు శబ్ద మెద్దియు నిట లేదు. ఇట నీనిని నీనిని బొందుచున్నాఁ డని పదార్థోపదర్శనమాత్రము చేయఁబడుచున్నది. రెండవ శ్రుతియందు దీనికి భిన్నముగా వాయుదత్తమును రథచక్రపరిమాణము గలదియు నగు ఛిద్రమున మీఁదికిఁ బోయి యాదిత్యుఁ బొందుచున్నాఁ డని క్రమము తెలియఁబడుచున్నది కాఁబట్టి యవిశేషవిశేషములవలన ననునిది సూక్తము. వాజసనేయులు "మాసేభ్యో దేవలోకం దేవలోకాదాదిత్య" మని పఠించు

చున్నారు. అట నాదిత్యానంతర్యముకొఱకు దేవలోకము నుండి వాయువుం బొందవలెను. "వాయుమబ్దాత్తని ఛాందోగ్యశ్రుత్యపేక్ష చేఁ జెప్పంబడినది. ఛాందోగ్యవాజసనేయక ములలో నొకచోట దేవలోకమును వేఱొకచో సంవత్సర మును బఠింపఁబడలేదు. అట శ్రుతిద్వయప్రత్యయమువలన రెండును రెండుచోట్ల గ్రథితవ్యములు. అందును మాస సంబంధమువలన మొదటిది సంవత్సరమును దరువాతిది దేవ లోకమునని వివేకింపవలెను. (సత్యలోకమునకుం బోవువారు సంవత్సరము మాసావయవి యగుటవలన మాసములకుం దరు వాత సంవత్సరమును దానితరువాత దేవలోకమును బిమ్మట వాయువుం దరువాతి నాదిత్యునిం బొందుచున్నా రని శ్రుతి ద్వయమునం గ్రమము నిష్పన్నము. కనుక సూత్రములోని వాయుశబ్దము దేవలోకపూర్వకవాయుపర మని సిద్ధము.)

ఇది ద్వితీయాధికరణము

---

తటిదధికరణము. 3

సూ. తటితోఽధివరుణ స్సంబంధాత్. 3

ప. తటితః - అధి - వరుణః - సంబంధాత్.

౧. బృ. ౮. ౨. ౧౫. (పంచాగ్నివిదులు మొదలగువారు) మాసా ధిమాని దేవతలవలన నతివాహ్యమానులై దేవలోకము వటనుండి సూర్యునిని బొందుచున్నారు.

అ. విద్యుత్తునకును వరుణునకును సంబంధమువలన విద్యుల్లోకము కంటెం దరువాత వరుణుఁడు సంబంధించుచున్నాఁడు.

భా. తటితోఽధి="ఆదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుత" మను శ్రుతివలన విద్యుత్తుకంటెం దరువాతను వరుణలోక మ్మని, వరుణః = ఈ వరుణుఁడు సంబంధించుచున్నాఁడు. (దేనివలనను?) సంబంధాత్ = విద్యుద్వరుణులకుఁ బరస్పరసంబంధము కలదను కారణమువలనను. "యదా హి విశాలా విద్యుత స్తీవ్రస్తనిత నిర్ఘోషా జీమూతోదరేషు ప్రనృత్యంత్యథాపః ప్రపతంతి" (ఎపుడు విశాలములగు విద్యుత్తులు తీవ్రమైన యుఱుములధ్వనులతోఁ గూడినవియై మేఘమధ్యమున స్ఫురించుచుండునో యపుడు వానలు కుఱియుచున్నవి) యని లోకప్రసిద్ధివలన విద్యుద్వరుణులకు సంబంధము కలదు. "విద్యోతతే స్తనయతి వర్షిష్యతివై"

---

౧. ఛాం. ౪. ౧౫. ౫. (బ్రహ్మలోకమునకుంబోవు విద్వాంసులు) ఆదిత్యాత్ = సూర్యునుండి, చంద్రమసం = చంద్రునిని, చంద్రమసః = చంద్రునుండి, విద్యుతం=విద్యుల్లోకమును బొందుచున్నారు. అట కమానవపురుషుఁ డొకఁడు వచ్చి వీరిని బ్రహ్మలోకముం బొందించుచున్నాఁడు.

౨. ఛాం. ౭. ౧౧. ౧. విద్యోతతే = (తేజము) మెఱయుచున్నది. స్తనయతి = ఉఱుముచున్నదియు, వర్షిష్యతివై=తమకఁ దప్పక వర్షించునని జనులు చెప్పుచున్నారు. దీనిచే వస్తేజములకుఁ గార్యకారణభావము స్పష్టము.

యని బ్రాహ్మణము. ఉదకముల కధిపతి వరుణుఁ డని శ్రుతిస్మృతిప్రసిద్ధి కలదు. వరుణుని కంటెం దరువాత నింద్రప్రజాపతులకు నివేశము. స్థానాంతరము లేకపోవుట వలనను బాఠసామర్థ్యమువలన నాగంతుకు లగుటవలనను వరుణాదుల కంతముననే సన్నివేశము. (వరుణున కుదకద్వారమున విద్యుత్తుతో సంబంధమువలన విద్యుదానంతర్యము గలుగుచుండఁగా నింద్రప్రజాపతులకుఁ బాఠానుసారముగాఁ గ్రమ మని యర్థము.) విద్యుత్తుకంటెం దరువాత స్థానాంతరము చెప్పంబడ లేదు కాఁబట్టి యర్చిరాదిమార్గమున విద్యుత్తంత్య మైనది.

ఇది తృతీయాధికరణము

ఆతివాహికాధికరణము. ౪

అవ. ఇట్లర్చిరాదుల క్రమము నిరూపించి స్వరూపమును నిరూపించుచున్నాఁడు.

సూ. ఆతివాహికా స్తల్లింగాత్. ౪

ప. ఆతివాహికాః - తల్లింగాత్.

అ. అంతమున విద్యుల్లోకముం బొందిన యుపాసకుల నమానవపురుషుఁడు బ్రహ్మలోకముం బొందించుచున్నాఁడను లింగమువలన నర్చ్యాదులు నాతివాహికులే. (ఒక

చోటునుండి వేఱొకచోటికిం గొంపోవు చేతనులే.) కాని మార్గచిహ్నములు గాని భోగభూములు గాని కావు.

భా. మీఁదఁ జెప్పంబడిన యర్చిరాదులందే యవి మార్గచిహ్నములా? భోగభూములా? కాక బ్రహ్మలోకము నకుం బోవువారిని దీసికొని పోవు చేతనులా? యని (మార్గ చిహ్నసామ్యమువలనను లోకశబ్దమువలనను నేతృత్వలింగము వలనను) సంశయము కలదు. అట్టి సంశయమునం దుపదేశ మట్టిరూపము కలది యగుటవలన నర్చిరాదులు మార్గలక్షణ భూతము లని ప్రాప్తమైనది. ఎట్లు లోకమున నగరమును గాని గ్రామమును గాని పోవం గోరువాఁ డిటనుండి యీ పర్వత ముఁ జేరు మటనుండి మఱ్ఱిని సమీపింపు మటనుండి నది యొడ్డును బ్రవేశింపుము పిమ్మట గ్రామమును గాని పత్తన మునుగాని చేరుదువని యుపదేశింపఁబడునో యట్లే యిటనును "అర్చిషో హారహ్న ఆపూర్యమాణపక్ష" మని యుపదేశింపఁ బడుచున్నది. వేఱొకపక్షమున నివి భోగస్థానము లనునిది ప్రాప్తమయ్యెను. అట్లే కదా "అగ్నిలోక మాగచ్ఛ తీ"త్యాది కము లోకశబ్దముతో నగ్న్యాదుల ననుబంధించు చున్నది "మనుష్యలోకః పితృలోకో దేవలోక" యని లోకశబ్దము ప్రాణులకు భోగాయతనములందుఁ బ్రయోగింపఁబడుచున్నది యును. "అహోరాత్రేషు తే లోకేషు సజ్యంతే" యని

బ్రాహ్మణమును లోకశబ్దము భోగాయతనమే యని తెలుపు చున్నది. కాఁబట్టి యర్చిరాదు లాతివాహికులుగారు. ఇవి యచేతనము లగుటవలనను నాతివాహికత్వమున కుపపత్తి లేదు. లోకమున రాజనియుక్తులును జేతనులు నగు పురుషు లతివాహ్యులను దుర్గమమార్గములందు మోసికొని పోవుచున్నారు గదా యని యిట్లు (పూర్వపక్షము) ప్రాప్తమైనది కాఁగా నీ విద్యుదంతము లగు నర్చిరాదులు, ఆతివాహికాః = బ్రహ్మలోకమునకుం బోవు నుపాసకుల మోచికొని పోవు దేవతలే కాఁ దగు చున్నారని చెప్పుచున్నారము. దేనివలనను? తల్లింగాత్ = నేతృత్వలింగము వలనను. అట్లేకదా "చంద్రమసో విద్యుతం తత్పురుషో మానవస్స ఏనాన్ బ్రహ్మ గమయతి" యని శ్రుతిపూర్వసిద్ధమైనదానినివలెనే గమయితృత్వముం జూపుచున్నది. ఆ వచనము తద్విషయమే యై యుపక్షీణ మగుననిన (విద్యుల్లోకమునందలి యమానవపురుషునకు నేతృత్వమాత్రముం జెప్పి నివృత్త మగుటవలన నర్చిరాదులకు నాతివాహికత్వమును సాధింపంజాలదనిన) (నమానవ) విశేషణము ప్రాప్తమానవత్వమాత్ర నివృత్తిపర మగుట

౧. కౌ. బ్రా. తే = ఆకర్మజ్ఞాననిష్ఠులు, అహోరాత్రేషు-లోకేషు = అహోరాత్రాదిలోకములందుఁ, సజ్యంతే=భోగముల ననుభవించుచున్నారు.

౨. ఛాం. ౪. ౧౫. ౫. ౬. విద్వాంసులు క్రమముగాఁ జంద్రుని విద్యుత్తును బొందినతరువాత నటనున్న వీరినొక యమానపురుషుఁడు వచ్చి బ్రహ్మలోకమునకుం గొనిపోవుచున్నాఁడని యర్థము.

వలన న ట్లనరాదు. ప్రకరణమువలన నర్చిరాదులందుఁ బురుషులు గమయితలు మానవులుం బ్రాప్తులైరేని య ట్లగుట వలనఁ దన్నివృత్త్యర్థ (=మానవత్వనివృత్త్యర్థ) మమానవ యను పురుషవిశేషణము యుక్త మగును.

అవ. ఓయీ! న్యాయాభావమువలన లింగమాత్రము గమకము కాదనిన నేతృత్వానువాదలింగము ననుగ్రహించు న్యాయపర మగు సూత్రముం జెప్పుచున్నాఁడు.

సూ. ఉభయవ్యామోహా త్తత్సిద్ధేః. ౫

ప. ఉభయవ్యామోహాత్ - తత్సిద్ధేః.

అ. [స్థూల] దేహవియోగమువలన నర్చిరాది మార్గమునఁ బోవువా రస్వతంత్రులు నచేతనము లగుటవలన నర్చిరాదులు నస్వతంత్రములు గావునను లోకమున నస్వతంత్రు లగు మత్తమూర్ఛితాదులు మఱొకనిచేఁ దీసికొని పోవఁ బడువారై కొనిపోఁబడుచున్నవారు గావున నర్చిరాద్యభిమానులుం జేతనులు నగు దేవతావిశేషులకు నేతృత్వము సిద్ధించుట వలన లింగము గమకము గాదను దోషము లేదు.

భా. ఉభయవ్యామోహాత్ = అర్చిరాదిమార్గమునం బోవువా రెవ్వరో వారు దేహవియోగమువలన సంపిండిత కరణగ్రాములు (లీనమగు నింద్రియసముదాయము కలవారు) గనుక నస్వతంత్రులు. అచేతనము లగుటవలన నర్చిరాదులకు

నస్వాతంత్ర్యము సిద్ధము కాఁబట్టి (యుపాసకులకు బ్రహ్మ లోకగమనము సిద్ధింపమిం జేసి) యర్చిరాద్యభిమానులుం జేతనులు నగు నొక తెగ దేవతలు పోవువారిం దీసికొనిపోవుట యందు నియుక్తు లని తోఁచును. లోకమున మత్తమూర్ఛారితాదు లగు సంపిండితకరణగ్రాములు చేతను లగు పరులచే దాఁటింపఁబడిన మార్గము కలవా రగుచున్నారు కాఁబట్టి తత్సిద్ధేః = అర్చిరాద్యభిమానిదేవతలకు నేతృత్వసిద్ధివలన లింగము న్యాయోపేతము కాదనుదోషము లేదు. మఱియు నర్చిరాదు లవస్థితములు (స్థిరములు) కాకపోవుటవలన వానికి మార్గచిహ్నత్వము కాని భోగస్థానత్వము కాని యుపపన్నము కాదు. రాత్రియందు మరణించినవాని కహస్స్వరూపప్రాప్తి సంభవింపదు గదా! మరణించువాఁ డహము వచ్చునందాఁక నిరీక్షించుట సంభవింపదని మున్ను చెప్పితిమి. దేవతలు నిలుకడగలవా రగుటవలన నీదోషము లేదు. వీరి కర్చిరాద్యభిమానమువలన నర్చిరాది శబ్దవాచ్యత్వమును సంభవించుచున్నది. అర్చిరాదుల కాతివాహికత్వము చెప్పినను "అర్చిషోహరి" త్యాది నిర్దేశ మర్చిర్హేతువుచే నహముం బొందుచున్నా రహ మను హేతువుచే నాపూర్యమాణపక్షముం బొందుచున్నా రనిన విరోధింపదు. అట్లేకదా యిటనుండి బలవర్మను జేరు మటనుండి జయసింహుని నటనుండి కృష్ణగుప్తునిం జేరు

మని లోకప్రసిద్ధు లగు నాతియాత్రికులం దిట్టి నిర్దేశము గాన్పించుచున్నది. మఱియు నుపక్రమమునను “తేర్చిష మ సంభవంతి” యని (యర్చిరాదులకును గంతలకును) సంబంధ మాత్రము చెప్పంబడినది కాని సంబంధవిశేష మెద్దియుఁ జెప్పంబడలేదు. ఉపసంహారమున దానికి భిన్నముగాను “స ఏనాన్ బ్రహ్మగమయతి” యని యతివాహ్యాతివాహక లక్షణ మగు సంబంధవిశేషము చెప్పంబడినది. దానిచే (సామాన్యముం జెప్పు శబ్దము విశేషము నపేక్షించినది యై కాన్పింపఁగా విశేషముం జెప్పు శబ్దముచే నాసామాన్యము నియంతవ్య మను న్యాయముచే) నుపక్రమమునందు నతి వాహ్యాతివాహకరూప మగు సంబంధము నిశ్చయింపఁబడు చున్నది. బ్రహ్మలోకమునకుం బోవువారు సంపిండితకరణ గ్రాము లగుటవలననే యట భోగమును సంభవింపదు. లోక శబ్ద మాలోకమున నున్న యితరులను భోగస్థాన మగుట వలన భోగము ననుభవింపని గంతలయందును యోజింప వచ్చును. కాఁబట్టి యగ్నిస్వామిక మగు లోకముం బొందినవా రగ్నిచేత మోచికొని పోవంబడుచున్నారు. వాయుస్వామిక మగు లోకముం బొంది వాయువుచేఁ గొనిపోవంబడుచున్నారు వని యన్వయింపవలెను.

నవపురుషునిచేతనే వరుణాదిలోకముల మీఁదుగా మోచికొని పోఁబడుచున్నవారై (గంతలు) బ్రహ్మలోకముం బొందు చున్నారని యెఱుంగునది. వరుణాదు లాపురుషునకే ప్రతి బంధము కావింపకపోవుటచేఁ గాని యెద్దియేని సాహాయ్య ముఁ జేయుటచేఁ గాని యనుగ్రాహకు లని తెలియవలెను. కాఁబట్టి యర్చిరాదు లాతివాహికు లగు దేవతాత్ము లనునది సాధువు.

ఇది చతుర్థాధికరణము

---

కార్యాధికరణము. ౫

అవ. ఇట్లు మార్గమును నిరూపించి, గతవ్యముఁ జెప్పు చున్నాఁడు.

సూ. కార్యం బాదరి రస్య గత్యుపపత్తేః. ౭

ప. కార్యం - బాదరిః - అస్య - గత్యు పపత్తేః.

అ. సగుణ బ్రహ్మమునకు గంతవ్యత్వ ముపపన్న మగుటవలన నమానవ పురుషుఁ డుపాసకుల నపరబ్రహ్మ ముం బొందించుచున్నాఁ డని బాదరి యను నాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

భా. "స ఏనాన్ బ్రహ్మగమయతి" యనుచో నమా నవ పురుషుఁ డుపాసకులను గార్యబ్రహ్మము (సగుణ

బ్రహ్మము)ను బొందించుచున్నాఁడా? పక్షాంతరమునఁ బర
ము నవికృతము నగు బ్రహ్మమునే పొందించు చున్నాఁడా?
యని సంశయింపఁ బడుచున్నది. దేనివలన సంశయింపఁ
బడుచున్నది? బ్రహ్మశబ్ద ప్రయోగము వలనను గతి శ్రవ
ణమువలనను. అటను, బాదరిః=బాదరి యను నాచార్యుఁడు.
కార్యం = సగుణము నపరము నగు బ్రహ్మమునే యమానవ
పురుషుఁడు పొందించు చున్నాఁ డని తలఁచుచున్నాఁడు.
ఏకారణము వలనను? అస్య - గత్యుపపత్తేః = ఈ కార్య
బ్రహ్మము ప్రదేశము కలదగుట వలన నితనికి గంతవ్య
త్వోపపత్తి కలదను కారణము వలనను. పరమగు బ్రహ్మము
సర్వగత మగుటవలనను గంతలకుఁ బ్రత్యగాత్మ యగుట వల
నను నట్టి బ్రహ్మమునందు గంతృత్వముగాని గంతవ్యత్వము
గాని గతి గాని సంభవింపదు.

సూ. విశేషితత్వాచ్చ. ౮

ప. విశేషితత్వాత్ - చ.

అ. వేఱొక శ్రుతియందు బహువచనము చేతను లోక
శబ్దము చేతను సప్తమి చేతను గంతవ్యుఁడు పరమగు బ్రహ్మ
మునుండి వ్యావర్తిల్లఁ జేయఁబడుట వలనను గతి (= అర్చి
రాది మార్గము) కార్యబ్రహ్మ విషయమే.

భా. "బ్రహ్మలోకాన్ గమయతి తే తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి " యని వేఱొక శ్రుతియందు బహువచనాదుల చేతను- విశేషితత్వాత్ -చ = గంతవ్యము విశేషణయుక్తముగాఁ జేయఁబడినది (పరమగు బ్రహ్మమునుండి వ్యావర్తిల్లఁజేయంబడినది) యగుటవలనను గతి కార్యబ్రహ్మ విషయమే యని తెలియఁబడుచున్నది. బహువచన విశేషణము పరమగు బ్రహ్మమునం దుపపన్నము కాదుగదా! కార్యబ్రహ్మమునం దవస్థాభేద ముపపన్న మగుట వలన బహువచనము సంభవించుచున్నది. లోకశ్రుతియు (లోకశబ్దము)ను వికారగోచరము సన్నివేశ విశిష్టము నగు భోగభూమియందే ముఖ్యమును " బ్రహ్మైవలోకఏష సమ్రాడి" త్యాదుల (భోగ్యత్వోపచారము వలన) గౌణము నగును. " లోకేష్వి" త్యాద్యాధారాధేయ నిర్దేశమును బరమగు బ్రహ్మమునందు ముఖ్యమైనది సంభవింపదు. కాఁబట్టి యమానవ పురుషుఁడు తీసికొని పోవుట కార్యబ్రహ్మ విషయమే.

అవ. ఓయీ! సమన్వయాధ్యాయమునందు నెల్ల జగమునకు బ్రహ్మము జన్మాది కారణ మని స్థిరపఱుపఁ బడి

౧. బృ. ౮. ౨. ౧౫. ఈ యధ్యాయమున నీపాదమున నర్చిరాద్యధికరణమున ౧౧౪-౧౨౮ పుటలలో వ్యాఖ్యాతము.

నది యగుటవలన (నపుంసకలింగ) బ్రహ్మశబ్దమును గార్య బ్రహ్మవిషయమున నుపపన్నము గాదనిన నీ సూత్రము చెప్పఁబడుచున్నది.

సూ. సామీప్యాత్తు తద్వ్యపదేశః. ౯

ప. సామీప్యాత్ - తు - తద్వ్యపదేశః.

అ. పరబ్రహ్మ సామీప్యమువలనఁ గార్య బ్రహ్మయందును (లాక్షణికముగాఁ) గారణవాచకమగు (నపుంసక) బ్రహ్మశబ్ద ప్రయోగము విరోధింపదు.

భా. తుశబ్ద మాశంకావ్యావృత్త్యర్థము. సామీప్యాత్ = అపరమగు బ్రహ్మమునకుఁ బరబ్రహ్మ సామీప్యమువలన నపరబ్రహ్మము నందును - తద్వ్యపదేశః = (నపుంసక) బ్రహ్మశబ్దప్రయోగము విరోధింపదు. పరమగు బ్రహ్మమే విశుద్ధోపాధి సంబంధము గలదై యొకానొకచో మనోమయత్వాదు లగు కొన్ని వికార ధర్మములతో నుపాసనముకొఱ కుపదేశింపఁబడుచున్నది యగుచు నపర మగు బ్రహ్మమని కదా నిర్ణయము.

అవ. అయ్యా! కార్యబ్రహ్మ ప్రాప్తియం దనావృత్తి యెట్లు ఘటిల్లును? పరమగు బ్రహ్మము కంటె వేఱొకచోట నెటను నిత్యత సంభవింపదుగదా! "ఏతేన ప్రతిపద్యమానా

౧. ఛాం. ४. ౧౫. ౬. ఈ యర్చిరాది మార్గమున బ్రహ్మము

ఇమం మానవ మావర్తం నావర్తంతే, తేషా మిహా నపునరావృత్తి రస్తి, తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి ” యని శ్రుతులు దేవయాన మార్గమునం బోయినవాని కనావృత్తిం జూపుచున్నవి యనిన నిటఁ జెప్పుచున్నారము.

సూ. కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పర మభిధానాత్. ౧౦

ప. కార్యాత్యయే - తదధ్యక్షేణ-సహ - అతః పరం- అభిధానాత్.

అ. ఉపాసకు లర్చిరాది మార్గమున బ్రహ్మలోకముం బొంది కార్య బ్రహ్మలోకమునకుఁ బ్రలయము తటస్థించినది యగుచుండఁగా దాని కధ్యక్షుఁ డగు హిరణ్యగర్భునితోఁ గూడ నట నుత్పన్నమైన బ్రహ్మాత్మజ్ఞానము కలవారై యంతకంటె విలక్షణమగు విష్ణుని పరమపదముం బొందుచున్నారని క్రమముక్తి ననావృత్తి శ్రుతులవలన నెఱుంగునది.

భా. కార్యాత్యయే = కార్యబ్రహ్మ లోకమునకుం బ్రలయము ప్రాప్తించినది యగుచు నుండఁగా నటనే యుత్పన్నమైన సమ్యగ్దర్శనము కలవారై (బ్రహ్మలోకమును బొందిన

---

బొందినవా రీ మనుసృష్టిలక్షణ మగు కల్పమున మరల జన్మింపరని యర్థము.

౧. బృ. ౮. ౨. ౧౫ అర్చిరాదిమార్గమున బ్రహ్మముం బొందినవారికీ కల్పమున మరల నావృత్తి లేదని యర్థము.

౨. ఛాం. ౮. ౬. ౬. క. ౬. ౧౬. } మూర్ధన్యనాడిచే నిష్క్రమించిన వారు ముక్తు లగుచున్నారని యర్థము.

యుపాసకులు) తదధ్యక్షేణ సహ = దాని కధ్యక్షుఁ డగు హిరణ్యగర్భునితోఁ గూడను, అతఃపరం = అంతకంటెం బరిశుద్ధమగు విష్ణుని పరమపదమును బొందుచున్నారని యీ ప్రకారముగాఁ గ్రమముక్తిని, అభిధానాత్ = అనావృత్త్యాది శ్రుత్యభిధానముల (శ్రుతివాక్యముల) వలన నంగీకరింప వలెను. గతిపూర్వకముగా ముఖ్యమైన పరమపదప్రాప్తి సంభవింపదని మున్ను ప్రతిపాదింపఁ బడినదిగదా.

సూ. స్మృతేశ్చ. ౧౧

ప. స్మృతేః - చ.

అ. స్మృతివలనం గూడ నీ యర్థము నెఱుచున్నారము.

భా. "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపద"మని స్మృతియు నీ యర్థముం బ్రతిపాదించుచున్నది యను హేతువువలన గతిశ్రుతులు కార్యబ్రహ్మ విషయములే యని సిద్ధాంతము.

అవ. ఏ పూర్వపక్షము నాశంకించు కొని "కార్యం బాదరిః" త్యాది సూత్రములచే నీ సిద్ధాంతము స్థిరపఱుపఁ

౧. కార్యబ్రహ్మలోకముం బొందినవా రట జ్ఞానమును సంపాదించి కాని యాతనియవసానమున నతనితోఁ బరమపదముఁ బొందుచున్నా రని యగము.

బడినది యనిన నా పూర్వపక్షము సూత్రములచేతనే కను
పఱుపఁ బడుచున్నది.

సూ. పరంజైమిని ర్ముఖ్యత్వాత్. ౧౨

ప. పరం - జైమినిః - ముఖ్యత్వాత్.

అ. (నపుంసక) బ్రహ్మశబ్దమునకుఁ బరమగు బ్రహ్మ
ము ముఖ్యమగు నాలంబనమును=(ముఖ్యార్థమును) గార్య
బ్రహ్మము గౌణార్థము నగుటవలన జైమిన్యాచార్యుఁ డుపాస
కుల నమానవ పురుషుఁడు పరమగు బ్రహ్మమునే చేర్చు
చున్నాఁ డని తలఁచుచున్నాఁడు.

భా. జైమినిః=జైమిన్యాచార్యుఁడు "సఏనాన్ బ్రహ్మ
గమయతి" యనుచోట నమానవ పురుషుఁడు, పరం = పర
మగు బ్రహ్మమునే (యుపాసకులను) పొందించుచున్నాఁ డని
తలంచుచున్నాడు. ఏ కారణమువలనను? ముఖ్యత్వాత్=నపుం
సక బ్రహ్మశబ్దమునకుఁ బరమగు బ్రహ్మము ముఖ్యార్థము
నపరమగు బ్రహ్మము గౌణార్థము నగుటవలనను. ముఖ్యార్థ
గౌణార్థములలో ముఖ్యార్థమే మిక్కిలి విశ్వాసార్హముగదా!

సూ. దర్శనాచ్చ. ౧3

ప. దర్శనాత్ - చ.

అ. "తయోర్ధ్వ మాయ న్న" త్యాది శ్రుతి జాతము
గతిపూర్వక మైన యమృతత్వముం జూపుచున్నది యగుట

వలన నుపాసకులకుఁ బరమగు బ్రహ్మమే గంతవ్యము.

భా. దర్శనాచ్చ = "తయోర్ధ్వ మాయన్న మృతత్వమేతి"యను శ్రుతి గతిపూర్వక మైన యమృతత్వముం జూపుచున్నది యగుటవలనఁ బరమగు బ్రహ్మమే గంతవ్యము. అమృతత్వము పరమగు బ్రహ్మమునందే యుపపన్న మగును గాని కార్యము వినాశియగుటవలనఁ గార్య బ్రహ్మమునం దుపపన్నముగాదు. "అథ యత్రాన్యత్పశ్యతి...తదల్పం - తన్మర్త్య" మని శ్రుతి కార్యమునకు వినాశముం జెప్పుచున్నది. ఈ గతి (ఊర్ధ్వ నాడీద్వారమున గమనము) పరవిషయమే యై కఠవల్లియందుఁ బఠింపఁబడుచున్నది. అటను "అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మాత్త్"ని పరమగు బ్రహ్మమే ప్రక్రాంత మగుటవలన విద్యాంతర ప్రక్రమము లేదుగదా!

(అవ. ఈ ప్రకారముగా నపుంసక బ్రహ్మశబ్ద శ్రవణమువలన నమృతత్వ లింగమువలనను బ్రకరణము వలనను గతి పర విషయమే యని చెప్పి యిపు డుపాసకునకు మరణకాలమునందుఁ బ్రజాపతి సభం బ్రవేశింతు నను సంకల్ప శ్రుతి

---

౧. ఛాం. ౭. ౨౪. ౧. అవిద్యాకాలమందుఁ దాను వేఱుగా నుండి వేఱు సాధనమున వేఱు వస్తువుం జూచుచున్నాఁడు గాఁబట్టి యది వినాశి యని యర్థము.

౨. క. ౨. ౧౪. ధర్మాధర్మముల స్పృశింపని యేవస్తువును నీవు చూచుచున్నావో యావస్తువు నుపదేశింపు మని నచికేతుఁడు యము నడిగెను.

వలనఁ బరము గంతవ్యము కాదను శంకను వారించుచున్నాఁడు.)

సూ. నచకార్యే ప్రతిపత్త్యభిసంధిః. ౧౪

ప. న - చ - కార్యే - ప్రతిపత్త్యభిసంధిః.

అ. "ప్రజాపతేస్సభాం వేశ్మ ప్రపద్యే" యను నదియుఁ గార్యవిషయ మగు ప్రతిపత్త్యభిసంధి కాదు.

భా. మఱియు "నామరూపయోర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ"[1] యని కార్యవిలక్షణముం బరము నగు బ్రహ్మమే ప్రస్తుత మగుటవలనను "యశోహం భవామి బ్రాహ్మణానాం"[2] మని సర్వాత్మత్వోపక్రమము వలనను "న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహద్యశః"[3] యని పరమగు బ్రహ్మమునకే యశోనామత్వ ప్రసిద్ధివలనను "ప్రజాపతేస్సభాం వేశ్మ ప్రపద్యే"[4] యనునది, కార్యే - ప్రతిపత్త్యభి సంధిః = కార్యబ్రహ్మవిష

---

౧. ఛాం. ౮. ౧౪. ౧. నామరూపముల నిర్వహించునదియు వానిచే స్పృశింపఁబడనిదియుఁ బరమగు బ్రహ్మమే.

౨. బ్రాహ్మణానాం - యశః - భవామి = బ్రాహ్మణుల కాత్మఁడ నగుచున్నాను. (అని యుపాసకుఁడు ప్రాయణసమయమున సంకల్పించును.)

౩. శ్వే. ౪. ౧౯. యస్య నామ = ఎవని పేరు, మహత్ - యశః = గొప్పది యగు యశమో, తస్య = ఆయాత్మునకు, ప్రతిమా = సామ్యము, నాస్తి = లేదు.

౪. ఛాం. ౮. ౧౪. ౧. ప్రజాపతేః - సభాం - వేశ్మ - ప్రపద్యే = చతుర్ముఖుని సభాభవనముం బ్రవేశింతును. (ఇదియును మరణకాలమున నుపాసకునకుఁ గల్గు సంకల్పమే.

యమగు ప్రాప్తి సంకల్పము, న = కాదు. ఆ యీ గతిపూర్వక మైన వేశ్మప్రతిపత్తి "తదపరాజితాపూ ర్బ్రహ్మణః ప్రభు విమితం హిరణ్మయ" మనుచో హార్దవిద్యయం దుదాహ రింపఁ బడినది. పదిధాతువు గత్యర్థ మగుటవలనను మార్గా పేక్ష నిశ్చయింపఁ బడుచున్నది. కాఁబట్టి గతిశ్రుతులు పర బ్రహ్మ విషయములే యని యింకొక పక్షము. (జైమిని పక్ష ము.) గత్యుప పత్త్యాదులచే నొక పక్షమును ముఖ్య త్వాదులచే నింకొక పక్షమునను నీ రెండు పక్షములు నాచార్యునిచే సూత్రింపఁబడినవి. వానిలో గత్యుప పత్త్యాదులు ముఖ్యత్వాదుల నాభాసింప సమర్థము లగు చున్నవి గాని ముఖ్యత్వాదులు గత్యుపపత్త్యాదుల నాభా సింప సమర్థములు కావు గనుక మొదటి పక్షమే సిద్ధాంత మనియు రెండవది పూర్వపక్షమనియు వక్కాణింపఁబడియె. సంభవము లేనిది యగుచు నుండఁగా ముఖ్యార్థమునే గ్రహిం పవలె నని యాజ్ఞాపించువాఁ డెవఁడును లేఁడుగదా! "విమ్వా జ్జన్యా ఉత్క్రామన్తే భవంతి" యన్నట్లు పరవిద్యా ప్రకరణ

౧. ఛాం. ౮. ౫. 3. తత్ = తత్ర = ఆ బ్రహ్మలోకమునందే, ప్రభు విమితం = చతుర్ముఖునిచే నిర్మింపఁబడినదియును, హిరణ్మయం = సువర్ణ వికారము నగు మండపమును, అపరాజితా = బ్రహ్మచర్యాదిసాధనసంపన్నులు గానివారికి సాధ్యము కాని, బ్రహ్మణః - పూః = బ్రహ్మయొక్క పురము (గలదు.)

మునకు వాని స్తుత్యర్థము విద్యాంతరాశ్రయ మగు (=అపర విద్యాశ్రయ మగు) గతి సంకీర్తన ముపపన్న మగుచున్నది. "ప్రజాపతేః సభాంవేశ్మ ప్రపద్యే" యని పూర్వవాక్య విచ్ఛేదమునఁ గార్య బ్రహ్మమునందుం బ్రతిపత్త్యభి సంధి విరోధింపదు. సగుణబ్రహ్మము నందును సర్వాత్మత్వ సంకీర్తనము "సర్వకర్మా సర్వకామ" ఇత్యాదు లందువలె సంభవింపవచ్చును. కాఁబట్టి గతి శ్రుతులపరబ్రహ్మ విషయములే. కొందఱు మొదటిసూత్రములు పూర్వపక్షసూత్రములు నుత్తరసూత్రములు సిద్ధాంతసూత్రములు నను సీ వ్యవస్థ ననుసరించుచున్నవారై గతి శ్రుతులను బరబ్రహ్మ విషయములుగానే ప్రతిష్ఠాపించుచున్నారు. బ్రహ్మమునకు గంతవ్యత్వా నుపపత్తివలన నది యుపపన్నము గాదు. "ఆకాశ[1]వత్సర్వ గతశ్చనిత్యః, య[2]త్సాక్షా దపరోక్షాద్బ్రహ్మ - య ఆత్మాసర్వాంతరః, ఆ[3]త్మైవేదం సర్వం, బ్ర[4]హ్మైవేదం విశ్వ

౧. ఆత్మ యాకాశమువలె సర్వగతుఁడును నిత్యుఁడును.

౨. బృ. ౫. ౪. ౧. యత్ = ఏ, బ్రహ్మ = బ్రహ్మము, సాక్షాత్-అపరోక్షాత్ = అవ్యవహితమును ముఖ్యమునో, యః - ఆత్మా = ఏయాత్మఁడు, సర్వాంతరః = ఎల్లవానికంటె లోనున్నవాఁడో (తం = అతనిని, మే = నాకొఱకు, వ్యాచక్ష్వ = చెప్పుమని యుషస్తుఁడు యాజ్ఞవల్క్యు నడిగెను. ఈ యుషస్తుఁ డనుటకు బదులు ఉషస్తి యని ఛాందోగ్యమున నున్నది.

౩. ఛాం. ౭. ౨౫. ౨. ఇదంసర్వం = ఎల్లదిక్కులనున్న యీ పదార్థమంతయును, ఆత్మైవ = ఆత్మయే.

౪. ముం. ౨. ౨. ౧౧. ఇదం-విశ్వం = ఈజగమంతయును, ఇదం-వరిష్ఠం-బ్రహ్మైవ = శ్రేష్ఠమగు నీ బ్రహ్మమే.

మిదం పరిష్ఠ మ"నునవి మొదలగు శ్రుతులచే నిశ్చయింపఁ బడిన విశేషము కలదియు సర్వగతమును సర్వాత్మకము సర్వాంతరము పరము నగు నట్టి బ్రహ్మమున కొకానొక పునకు గంతవ్యత్వ ముపపన్నముగాదు. గతమే గంతవ్యము కాదుగదా! ఇతరుఁడు దనకంటె భిన్నమగు దానిని బొందు చున్నాఁ డని లోకమునం బ్రసిద్ధము. అయ్యా! లోకమునఁ బృథివియందున్న వాఁడే దేశాంతర ద్వారమునఁ బృథివిం బొందుచున్నట్లు గతమునకును దేశాంతర విశిష్టమగు గంతవ్య త్వము చూడఁబడుచున్నది. అట్లే యనన్యమే యైనను బాలు నకుఁ గాలాంతరవిశిష్ట మగు వార్ధకము స్వాత్మ భూతమే గంతవ్యమై చూడఁబడినది. అట్లే (సర్వగతము నాత్మభూతము నే యైనను) బ్రహ్మమును సర్వశక్త్యుపేత మగుటవలన నట్లో (=సంసార దేశముకంటె వేఱొక దేశము తోడ నాకాలము కంటె భిన్నమగు కాలముతోడను విశిష్టమగుటచే) గంత వ్యము కావచ్చుననిన బ్రహ్మము ప్రతిషిద్ధ సర్వవిశేష మగుట వలన నట్లుకాదు. "నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం

౧. శ్వే. ౬. ౧౯. నిష్కలం=నిరవయవమును, నిష్క్రియం=క్రియా శూన్యమును, శాంతం = రాగద్వేషవర్జితమును, నిరవద్యం = నిర్దోషమును, నిరంజనం=లేపశూన్యమును (మోక్షప్రాపక మగు వస్తువును శరణొందు చున్నాను.)

నిరంజనం, అస్థూల మనణ్వ హ్రస్వమదీర్ఘం, సబాహ్యా భ్యంతరో హ్యజః, సవా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽ మృతోఽభయో బ్రహ్మ, స ఏష నేతి నేత్యాత్మా" యనునవి మొదలగు శ్రుతిస్మృతిన్యాయములవలన నేభూప్రదేశవయోవ స్థాన్యాయముచే = (ఎట్టి దేశకాల విశేషయోగకల్పనముచే) నీ బ్రహ్మమునకు గంతవ్యత్వము సంభవించునో యట్టి దేశ కాల విశేషయోగము పరమాత్మునకుఁ గల్పింప శక్యము

---

౧. బృ. ౫. ౮. ౮. అస్థూలం=స్థూలముకంటె భిన్నమును, అనణు= అణువుకంటె వేఱొకటియును, అహ్రస్వం-అదీర్ఘం=హ్రస్వదీర్ఘములకంటె విలక్షణము నగువస్తువు (నీ వడిగిన యక్షరపదార్థముగా బ్రాహ్మణులు చెప్పు చున్నా రని యాజ్ఞవల్క్యుఁడు గార్గితోఁ జెప్పెను.

౨. ముం. ౨. ౧. ౨ (పరుఁడగు పురుషుఁడు) అజః = జన్మరహితుఁ డును, సబాహ్యాభ్యంతరః = లోపల వెలుపల నిండియున్నవాఁడును.

3. బృ. ౬. ౪. ౨౫. సః-వై-ఏషః-ఆత్మా = జనకయాజ్ఞవల్క్య ఖ్యాయికయందుఁ జెప్పఁబడిన యీ యాత్ముఁడు, అజః = జన్మింపనివాఁడు (కనుకనే) అజరః = ముదిమిలేనివాఁడు (కాఁబట్టి) అమరః = మరణింపని వాఁడు. (ఎవఁడు జన్మించునో ముదిమి నొందునో యతఁడు మరణించును గాని యితఁడు జన్మింపనివాఁడును ముదిమి నొందనివాఁడు కాఁబట్టి మరణిం పఁడని యర్థము.) (కనుకనే) అమృతః = జన్మాదు లగు మూఁడు వికార ములతోడను శూన్యుఁడు కాఁబట్టి మృత్యురూపము లగు కామకర్మాదులతో వర్జితుఁ డని యర్థము. అభయః=మీఁదఁజెప్పి విశేషణములు గలవాఁడు గనుకనే యీయాత్ముఁడు భయవర్జితుఁడును, బ్రహ్మ=నిరతిశయమహత్తును (అగును.)

౪. బృ. ౫. ౯. ౨౬. నేతి-నేతి-సః-ఏషః-ఆత్మా = మధుకాండ మున నిది కా దిది కా దను నిషేధముఖమున నిర్దేశింపఁబడిన యాత్ముఁడు, (అగృహ్యః=కార్యధర్మరహితుఁ డగుటవలన గ్రాహ్యుఁడు కాఁడు.)

గాదు. భూమికిని వయసునకును బ్రదేశావస్థాది విశేషయోగ మువలన దేశకాల విశిష్టమగు గంతవ్యత్వ ముపపన్నము కావచ్చును. జగదుత్పత్తి స్థితి ప్రలయ హేతుత్వశ్రవణము వలన బ్రహ్మమున కనేక శక్తిత్వము సంభవించు ననిన విశేష నిరాకరణ శ్రుతు లనన్యార్థము లగుటవలన నటనరాదు. ఉత్పత్త్యాది శ్రుతులకు ననన్యార్థత్వము సమానమునిన నవి యేకత్వ ప్రతిపాదనపరము లగుటవలన నట్లుకాదు. మృదాది దృష్టాంతములచే నేకము సత్తునగు బ్రహ్మమునకు సత్యత్వము వికారిమున కనృతత్వముం బ్రతిపాదించు శాస్త్ర ముత్పత్త్యాది పరము గానర్హము గాదు. ఎక్కారణము వలన నుత్పత్త్యాది శ్రుతులకు విశేష నిరాకరణ శ్రుతిశేషత్వము గాని విశేష నిరాకరణ శ్రుతుల కుత్పత్త్యాది శ్రుతిశేషత్వము సంభవింప దనవచ్చు ననిన విశేష నిరాకరణ శ్రుతులు నిరాకాంక్షార్థకము లగుటవలన నని చెప్పఁబడు చున్నది. "తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః, అభయం వై జనక ప్రాప్తోసి,

౧. ఈ. ౭. ఏకత్వం=శుద్ధ మగు నాత్మైకత్వమును, అనుపశ్యతః= చూచుచున్నవానికిని, తత్ర = ఆకాలమునను, మోహః-కః=మోహ మెద్ది? శోకః-కః=శోక మెద్ది? అప్పుడు శోకమోహములు లే వని యర్థము.

౨. బృ. ౬. ౨. ౪. జనక = ఓజనకుఁడా, అభయంవై = జన్మమరణాదినిమిత్తభయశూన్య మగు వస్తువునే, ప్రాప్తోసి = పొందితివని (యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.)

విద్వా న్నభిభేతి కుత శ్చన — ఏతం హ వావ న తపతి కిమహం సాధునా కరవం కిమహం పాప మకరవమి" త్యాది శ్రుతుల వలన నాత్మున కేకత్వ నిత్యత్వ శుద్ధత్వా ద్యవగతి కలుగు చుండఁగాఁ బురుషార్థ సమాప్తి బుద్ధి పుట్టుటవలన మరల నే యాకాంక్షయుం బుట్టదుగదా! అట్లే విద్వాంసులకు (బ్రహ్మ విదులకు) దృష్టి యనుభవము కాన్పించుట వలనను "మృత్యో స్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" యని వికారా నృతాభిసం ధ్యపవాదము వలనను విశేష నిరాకరణశ్రుతుల కన్యశేషత్వము తెలియ శక్యము గాదు. ఇట్లుత్పత్త్యాది శ్రుతులకు నిరాకాంక్షార్థ ప్రతిపాదన సామర్థ్యములేదు. ప్రత్యక్షముగా (శ్రుతివలనను) వాని కన్యార్థకత్వము తెలియఁబడు చున్నది. అదియె ప్రతిపాదింపఁ బడు చున్నది. 'తత్రైత చ్ఛుంగ ముత్పతితం సోమ్య విజానీహి నేదమ

౧. తై. ౨. ౯. (బ్రహ్మణః - ఆనందం = బ్రహ్మానందమును) విద్వాన్ = తెలిసికొన్నవాఁడు, కుతశ్చన-నభిభేతి = దేనివలనను భయ పడఁడు. ఏతం-హ-వావ = ఇట్టి విద్వాంసునిని, అహం = నేను, సాధు= సత్కార్యమును, కిం-నాకరవం=ఏలచేయకపోతిని? అహం = నేను, పాపం-కిం-అకరవం-ఇతి=పాపము నేలచేసితి నని (మరణకాల మాసన్నమైనపుడు) నతపతి=నతపతః=(పుణ్యపాపక్రియలు) తాపమును బుట్టింపఁజాలవు.

౨. ఏకరస మగు బ్రహ్మమునందు భేద మున్నట్లెవఁడు తెలిసి కొనుచున్నాఁడో వాఁడు సంసారమునుండి మరల సంసారమునే పొందు చున్నాఁడు.

3. ఛాం. ౬. ౮. సోమ్య=ఓ శ్వేతకేతూ! తత్ర=మూలకారణము నందు, ఏతత్-శుంగం=ఈ జగద్రూప మగు కార్యము, ఉత్పతితం = వట

మూలంభవిష్యతి" యని శ్రుతి (జగద్రూపమగు కార్య ముత్పన్నమైనది యని) యుపన్యసించి యుత్తరమున నేకమును జగన్మూలము నగు సత్తునకే విజ్ఞేయత్వముం జూపుచున్నది. "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయం త్యభిసంవిశంతి త ద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ" యనియును శ్రుతి జగజ్జన్మా ద్యనువాదముచే బ్రహ్మమునకే జ్ఞేయత్వముం జూపుచున్నది. ఇట్లుత్పత్త్యాది శ్రుతులు త్రైకాల్యావగాహ పరము లగుటవలన బ్రహ్మమునకనేక శక్తియోగము లేదు. కనుకనే గంతవ్యత్వమున కుపపత్తి లేదు. "నతస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" యనియును శ్రుతి బ్రహ్మవిషయమైన గతి నివారించుచున్నది. "స్పష్టో హ్యేకేషా" మను సూత్రము నొద్దన యివి వివరింపఁబడినది. గతి కల్పనయందు నత్యంత తాదాత్మ్యము గలుగుటకుంగాగ గనునారు పపత్తివలన గంతయగు జీవుండు గంతవ్యమగు బ్రహ్మమునకు నవయవము కాని వికా

బీజమున నంకురముఁ దాలె, సంప్పన్నమైన దని, విజానీహి = తెలిసికొనుము. ఇదం:= ఈ జగము, అమూలం = కారణము లేనిదై, నభవిష్యతి = కలుగునది కాదు.

౧. మొదటి యధ్యాయమున మొదటిపాదమున జన్మాద్యధికరణమున వ్యాఖ్యాతము.

౨. బృ. ౬. ౪. ౬. బ్రహ్మవిదుని ప్రాణముల కుత్క్రమణము లేదు. (అతఁడు) యున్నను బ్రహ్మమే యగుచు బ్రహ్మముం బొందుచున్నాఁడు.

రము కాని బ్రహ్మముకంటె నన్యుఁడు గాని కావలయును. ఇట్లయ్యె నేని దానివలన నేమి యగు ననినఁ జెప్పఁబడు చున్నది. ఏకదేశ (అవయవ) మయ్యెనేని దానిచే నేకదేశి (అవయవి) నిత్యప్రాప్తము యగుటవలన మరల బ్రహ్మాగమన మనుపపన్నము గాదు. నిరవయవ మను ప్రసిద్ధివలన బ్రహ్మ మునందు నేకదేశైకదేశికల్పన యనుపపన్నయును. వికార ముచే వికారి నిత్యప్రాప్త మగుటవలన వికార పక్షమునను నిః ఫల్యము. పరిత్యాగము గలుగుచుండఁగా సభావప్రాప్తివలన ఘటము మృదాత్మత్వమును బరిత్యజించి యుండదు గదా! వికారిపక్షమునందు నవయవపక్షమునందును దద్వాంత మగు (వికారావయవరూపజీవవిశిష్ట మగు) బ్రహ్మము స్థిర మగుట వలన జీవులకు సంసారగమనాగమన(రూపమగు చలన)ము సంభవింపదు. (మాయామతమున నజ్ఞానమువలనఁ గల్పిత మగు నుపాధిచే గతివిభ్రమ మని భావము.) బ్రహ్మముకంటె జీవుఁ డన్యుఁడను పక్షమున నణువుగాని వ్యాపిగాని మధ్యమ పరి మాణుఁడుగాని కావలయును. వ్యాపి యయ్యెనేని గమనమున కనుపపత్తి సంభవించును. మధ్యమపరిమాణుఁ డయ్యెనేని యనిత్యత్వము ప్రసక్తించును. అణువయ్యెనేని యెల్లశరీరము నందలి వేదన కనుపపత్తి సంభవించును. అణుత్వమధ్యమ పరిమాణత్వములు మున్ను విస్తరముగఁ బ్రతిషేధింపఁబడిన

వియును. జీవుఁడు పరుఁ డగు నాత్మునికంటె నన్యుఁ డనుపక్ష
మునను "తత్త్వ మసీ"త్యాదిశాస్త్రమునకు బాధ ప్రసంగము
వచ్చును. వికారము నవయవము ననుపక్షములందు నీదోష
ము సమానమే. వికారావయవములకును దద్వంతునకు నన
న్యత్వమువలన దోషము లేదనిన ముక్త్యైకత్వానుపపత్తివలన
లేకపోను. ఈ మూఁడు పక్షము లందును సంసార్యాత్మత్వా
నతిక్రమణమువలన (జీవునితాత్త్వికస్వరూపము సంసారిత్వము
నతిక్రమించినది కాకపోవుట వలన) ననిర్మోక్ష ప్రసంగము
సంభవించును. అనివృత్తి (జీవుని తాత్త్వికస్వరూపమగు
సంసారమునకు నాశము) కలుగుచుండఁగా (నెద్ది సంసా
రము నశించిన నశింపదో యట్టి) బ్రహ్మాత్మత్వము (జీవునకుఁ
దాత్త్వికస్వరూప మని) మాచేతనువలె మీచే నంగీకరింపఁ
బడకపోవుటవలన జీవునికి స్వరూపనాశప్రసంగము వచ్చును.
(అయ్యా! బ్రహ్మాత్మత్వమున నేమి ప్రయోజనము? సంసారా
భావము గదా మోక్షము? అది కర్మాభావమాత్రమున
సిద్ధించుచున్న దను కర్మజడుల మతము నుపన్యసించి నిరసించు
చున్నాఁడు.) ప్రత్యవాయానుత్పత్తి కొఱకు నిత్యనైమిత్తిక
కర్మము లనుష్ఠింపఁబడు చున్నవి. స్వర్గనరకావాప్తిపరిహార
మునకై కామ్యనిషిద్ధకర్మములు పరిహరింపఁబడు చున్నవి.
వర్తమాన దేహోపభోగ్యములగు కర్మము లుపభోగమున

నశింపఁ జేయఁబడుచున్నవి యను నీ కారణమువలన వర్త
మానదేహపాతముకంటెం దగువాతి దేహాంతర ప్రాప్తికిం
గారణాభావమువలన స్వదేహావస్థానలక్షణ మగు కైవల్యా
పత్తిప్రాప్తియు గలవానికి బ్రహ్మాత్మత్వమును విచారగను
సిద్ధించు నని కొందఱచే నెట్టి జల్పింపఁబడినదో యది
ప్రమాణా భావమువలన యుక్తము గాదు. (జల్పము వాదివి
గీషులకథ) నశాస్త్రముచేతను మోక్షార్థి యిట్లు చేయునది
యని యిది ప్రతిపాదింపఁ బడలేదు గదా? ఏకారణ
ణము వలన సంసారము కర్మనిమిత్తమో యాకారణము
వలనఁ గర్మనిమిత్త మగు సంసారము నిమిత్తాభావము
వలన సంభవింప దనుచిని స్వబుద్ధిచే నూహింపఁబడినది!
కాని నిమిత్తాభావము దుర్జ్ఞాన మగుటవలన నిది తర్కింప
శక్యముగాదు. జన్మాంతర సంచితములు నిష్టానిష్టఫలములు
నగు ననేకకర్మము లొకొక్క జంతువునకుఁ గల వని సంభా
వింపఁబడు చున్నది. పరస్పరవిరుద్ధము లగువాని కన్నిటికి
నొక్క జన్మమునను భోగాసంభవము వలనఁ గొన్ని కర్మ
ములు లబ్ధావసరములై జన్మముల నిర్మించుచున్నవి; కొన్ని
దేశకాలనిమిత్తప్రతీక్షము లై నిలుచుచున్నవియు నను కార
ణమువలన నవశిష్టము లగు నాకర్మములకు సాంప్రత మగు
భోగముచే క్షపణాసంభవము వలన వర్ణింపఁబడినట్టి చరి

త్రము గలవానికిని స్వర్గమాన దేహపాతానంతరమున దేహాంతరనిమిత్తాభావము నిశ్చయింప శక్యము గాదు. "తద్య ఇహ రమణీయచరణాః, తతశ్శేషేణ" యనునవి మొదలగు శ్రుతిస్మృతుల వలనఁ గర్మశేషసద్భావసిద్ధియుఁ గలదు. నిత్యనైమిత్తికకర్మము లే (యుపశిష్ట) కర్మములకు క్షేపకములు గాఁగలవను నిది తగునని విరోధాభావమువలన నది యుక్తము గాదు. విరోధము కలుగుచుండఁగా క్షేప్యక్షేపకభావము సంభవించుచున్నది. శుద్ధిరూపత్వాదిసామ్యము వలన జన్మాంతరసంచితము లగు సుకృతములకు నిత్యనైమిత్తికకర్మములతో విరోధమును లేదు. దురితము లశుద్ధిరూపము లగుట వలన విరోధము గలుగుచుండఁగా వానికి క్షపణమైనం గావచ్చును. సుకృతమునకు నిమిత్తశక్త్యపహతివలన దుష్కృతములు నశించినంతమాత్రమున దేహాంతరనిమిత్తమున కభావము సంభవింపదు. దుష్కృతమునకైనను నిశ్శేషముగా నశించు నను ప్రమాణము లేకపోవుటవలన (నిశ్శేషమగు) నాశము సంభవింపదు. మఱియును నిత్యనైమిత్తికకర్మానుష్ఠా

౧. ఛాం. ౫. ౧౦. ౭. తత్-తత్ర = పరలోకమునుండి యీలోకమునకు వచ్చువారిలో, యే - రమణీయచరణాః = ఎవరు పుణ్యకర్మము కలవారో (వారు బ్రాహ్మణాదికులమున జన్మించుచున్నారు. పాపకర్మము గలవారు శ్వసూకరాదులందు జన్మించుచున్నారు.) తతశ్శేషేణ = భుక్తఫలమగు కర్మముకంటె మిగిలినకర్మముచే నిట్లు జన్మించుచున్నారు.

నమువలన నానుషంగికమైన ఫలము సంభవించుటవలనఁ బ్రత్యవాయానుత్పత్తియె కాని ఫలాంతరోత్పత్తి లేదనుటకుం దగిన ప్రమాణ మెయ్యదియుఁ గానరాదు. "తద్యథామ్రే ఫలార్థే నిర్మితే ఛాయాగంధావనూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యంతే" యని యాపస్తంబులు స్మరించుచున్నారు గదా! మిక్కిలి నిపుణులను సైతము సూక్ష్మాపరాధములు కాన్పించుటవలన సమ్యగ్దర్శనము లేనిది యగుచు నుండఁగా జన్మప్రాయణమధ్యకాలమునను "సర్వాత్మనా = ఎల్లవిధములను గామ్యప్రతిషిద్ధవర్జన మెవ్వనిచేతను బ్రతిజ్ఞ చేయఁబడ శక్యము గాదు. = మిక్కిలి తెల్విగలవారికిని నపరాధములు గాన్పించుటవలన జన్మించినది మొదలుగా మరణించునందాఁక బ్రహ్మాత్మజ్ఞానము లేనివాఁ డెవ్వఁడు నే కాలఁది కామ్యకర్మమును గాని నిషిద్ధకర్మమును గాని చేయ

౧. ఆ. సూ. తద్యథా = ప్రత్యవాయపరిహారార్థమై నిత్యాదికర్మ మనుష్ఠింపఁబడినది యగుచు నుండఁగా ఫలాంతరము నిష్పన్న మగుచున్న దనుదానికి దృష్టాంత మిద్ది యనం జెప్పఁబడుచున్నది. ఆమ్రే = మామిడి వృక్షము, ఫలార్థే=ఫలము నిమిత్తమై, నిర్మితే = ఆరోపింపఁబడినది (మొలిపింపఁబడినది.) యగుచునుండఁగా, ఛాయాగంధౌ=నీడయుం బరిమళమును, అనూత్పద్యేతే = వెంటనంటి యానుషంగికముగాఁ బుట్టుచున్నవి. ఏవం-ధర్మంచర్యమాణం-అర్థా అనూత్పద్యంతే = అట్లే, నిత్యాదికర్మము ప్రత్యవాయ పరిహారార్థ మనుష్ఠింపఁబడిన నానుషంగికముగా నెద్దియే నొక ఫలము పుట్టు నని యర్థము. (కనుక దానివలన నైన జన్మము సంభవింప వచ్చునని తాత్పర్యము.)

వని ప్రతిజ్ఞ చేయ లేఁ డని యర్థము. (అయినను గామ్యాది
కర్మసత్తానిశ్చయము లే దనినఁ) గర్మశేషసద్భావము సంశ
యితవ్య మైనను దేహాంతరమునకు నిమిత్తాభావము దుర్జ్ఞా
నమే. జ్ఞానగమ్య మగు బ్రహ్మాత్మత్వ మంగీకరింపఁ బడినది
యగుచు నుండఁగా నగ్న్యౌష్ణ్యమునకువలె స్వభావమునకుఁ
బరిహార్యత్వము లేమిం జేసి కర్తృత్వభోక్తృత్వస్వభావము
గల యాత్మునకుఁ గైవల్య మాకాంక్షింపను శక్యముగాదు.
కర్తృత్వభోక్తృత్వాదులగు కార్య మనర్థము గాని తచ్ఛక్తి
యనర్థముకాదు గనుక శక్తి యున్నను గార్యపరిహారము
వలన మోక్ష ముపపన్న మగు ననునది కావచ్చు ననిన శక్తి
సద్భావము గలుగుచుండఁగాఁ గార్యప్రసవము దుర్నివార
మగుటవలన నదియు (= కార్యపరిహారమును) సంభవింపదు.
ఇతరము లగు (=అదృష్టదేశకాలాదు లగు) నిమిత్తముల నపే
క్షింపక కేవల శక్తి కార్యము నారంభింపం జాలదు కాఁబట్టి
యేకాకిని యగు నాశక్తి యున్నది యయ్యు నపరాధింప దను
పక్షమున (శక్తి యున్నది యగుచు నుండఁగా) దానికి విష
య మగు కార్యమును దేశకాలాదినిమిత్తములును శక్తిద్వార
మున (నాత్మునితో) నిత్యము సంబద్ధములే యగుటవలనఁ
గేవలశక్తి యపరాధింపదనియు ననరాదు. కాఁబట్టి యాత్మ
నంతఁ గర్తృత్వభోక్తృత్వస్వభావము గలుగుచుండఁగాను

విద్యాగమ్య మగు బ్రహ్మాత్మత్వము లేనిది యగుచు నుండఁ
గాను మోక్షాపేక్ష యెట్లును లేదు. "[౧]నాన్యః పంథా
విద్యతేఽయనాయ" యని శ్రుతియు జ్ఞానముకంటె వే ఱగు
మోక్షమార్గమును వారించుచున్నది. పరుఁ డగు నాత్మని
కంటె జీవుఁ డనన్యుఁ డైనను బ్రత్యక్షాది ప్రమాణప్రవృత్త్య
భావమువలన నెల్లవ్యవహారమునకు లోపప్రసంగ మనినఁ
బ్రబోధముకంటెఁ బూర్వము స్వప్నవ్యవహారమునకు వలె
నెల్లవ్యవహారమునకు నుపపత్తి గలుగుటవలన నిది దోషము
కా దని పలుమాఱు చెప్పితిమి శాస్త్రము సైత మప్రబుద్ధ
విషయమై "[౨]యత్ర హి ద్వైత మివ భవతి తదితర ఇతరం పశ్యతీ"
త్యాది వాక్యముచేఁ బ్రత్యక్షాదివ్యవహారముం జెప్పి మరలఁ
బ్రబుద్ధవిషయమై "యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూ
త్తత్కేన కం పశ్యేది" త్యాదికముచే వ్యవహారాభావముం
జూపుచున్నది. కనుక నిట్లు బ్రహ్మవిదునకు గంతవ్యాది
విజ్ఞానము బాధిత మగుటవలన నెట్లును గతి యుపపాదింప
శక్యముగాదు. గతిశ్రుతులు కింవిషయము లనిన సగుణవిద్యా

---

౧. శ్వే. ౩. ౮. మోక్షప్రాప్తికి జ్ఞానముకంటె వేఱొకమార్గము లేదు.

౨. బృ. ౬. ౫. ౧౫. ఎపుడు ద్వైత మున్నట్లుండునో యపుడు తా నన్యుఁడై వేఱొకదానిం జూచును. ఎపుడు చూచువాని కంతయు నాత్మఁడే-తన స్వరూపమే యయ్యెనో యపు డేసాధనముచే దేని నెవఁడు చూచును?

విషయము లని చెప్పఁబడుచున్నది. దానిని బ్రతిపాదించు చున్నారు. ఒకానొకచోట బంచాగ్నివిద్యం బ్రస్తావించి గతి చెప్పఁబడినది. మఱియొకచోట బర్యంకవిద్యను బ్రస్తావించియు నింకొకచో వైశ్వానరవిద్యం దలంచియు గతి చెప్పఁబడు చున్నది. ఎచటను "ప్రాణో బ్రహ్మకం బ్రహ్మఖం బ్రహ్మ" యనియు "అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ" యనియును బ్రహ్మముం బ్రస్తావించి గతి చెప్పఁబడు చున్నదో యట సైతము వామనీత్వాదులు సత్యకామత్వాదులు నగు గుణములచే సగుణమే యుపాస్య మగుటవలన గతి సంభ వించుచున్నది. ఎట్లు "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" యని గతిప్రతిషేధము వినిపింపఁబడుచున్నదో యట్లు పరబ్రహ్మ విషయ మగు గతి యొకానొక చోటను వినిపింపఁబడదు. "బ్రహ్మవిదాప్నోతి పర మిత్యా" దులందును "ఆప్నోతి" యనునది గత్యర్థక మైనను బూర్వము వర్ణితమగు న్యాయము (బ్రహ్మమునకు సర్వగతత్వము సర్వాత్మత్వము సర్వాంత రత్వము మొదలగునది వర్ణిత న్యాయము) చేతను బరబ్రహ్మ విదునకు దేశాంతరప్రాప్తి సంభవింపమివలన నిది యవిద్యా

---

౧. అ ౧. పా ౨. అంతరాధికరణమున వ్యాఖ్యాతము.

౨. అ ౧. పా 3. దహరాధికరణమున వ్యాఖ్యాతము.

3. తై. ౨. ౧. బ్రహ్మవిదుఁడు నిరతిశయ మగు బ్రహ్మమునే పొందును.

ధ్యారోపిత నామరూప ప్రవిలయాపేక్షచే స్వరూప ప్రతి పత్తియే "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" త్యాదులందు వలెఁ జెప్పఁబడుచున్న దని యెఱుఁగునది. మఱియుఁ బరవిషయ మగు గతి చెప్పంబడుచున్నదియై ప్రరోచనకొఱకుఁ గాని యనుచింతనము కొఱకుఁ గాని వర్ణింపఁబడినది కా వలెను. వానిలోఁ బ్రరోచనము బ్రహ్మవిదునకు స్వసంవే ద్యమె యయినదియు నవ్యవహితమురు విద్యాసమర్పితము నగు స్వాస్థ్యముచేతనే సిద్ధించుటవలన నది గత్యుక్తిచేఁ జేయం బడదు. మఱియు నిత్యసిద్ధనిశ్శ్రేయస నివేదనము నసాధ్య ఫలమునగు విజ్ఞానమునకు గత్యనుచింతనమున నేయపేక్షయు లేదు. కాఁబట్టి గతి యపరబ్రహ్మ విషయమే. అట్లగు చుండఁగాఁ గొందఱు పరాపరబ్రహ్మ వివేకావధారణము లేమిచే(=భ్రాంతిచే) నపరమగు బ్రహ్మమునందుఁ బ్రవర్తించు గతి శ్రుతులను బర మగు బ్రహ్మమునం దధ్యారోపించు చున్నారు. పరము నపరము నని బ్రహ్మములు రెండా? "ఏత ద్వై సత్య కామ పరంచాపరంచ బ్రహ్మయ దోంకార" యను నది మొదలగు వాని దర్శనమువలన రెండెయని యంగీకరింతు ము. పరమగు బ్రహ్మ మెద్ది యపరమగు బ్రహ్మ మెద్దియనినం

---

౧. ప్ర. ౫. ౨. ఓ సత్యకాముఁడా! ఓంకారమే పరాపరబ్రహ్మో పాసనములకు నాలంబన మని పిప్పలాదుఁ డుపదేశించెను.

చెప్పఁబడుచున్నది. ఎద్ది యస్థూలాదిశబ్దములచే నవిద్యాకృతము లగు నామరూపాదివిశేషము లప్రతిషేధమున నుపదేశింపఁబడుచున్నదో యది పరమగు బ్రహ్మము. అదియే నామరూపాదులతో నెద్దియో నొకదానితోఁ గూడినదియై "మనోమయః ప్రాణశరీరో భారూపః" ఇత్యాదు లగు శబ్దములచే నుపాసనకొఱకు నుపదేశింపఁబడుచున్నది యగుచు నపరమగు బ్రహ్మ మగును. ఆ నన్వా! ఇట్లగుచునుండఁగా నద్వితీయశ్రుతి బాధింపబడుచున్నది యనిన నపర మగు బ్రహ్మ మవిద్యాకృత నామ రూపోపాధికృత మగుటచే బాధము పరిహృతమగుటవలనఁ బీడింపఁ బడదు. ఆ యపరబ్రహ్మోపాసనమునకు నుపాసకుఁ డవిద్యనుండి నివర్తింపఁడు కాకపోవుటవలన దాని సన్నిధియందు వినంబడుచున్న "స యది పితృలోక కామో భవతి" యను నది మొదలగు జగదైశ్వర్యలక్షణమును సంసారగోచరము నగు ఫలమే యగుచున్నది. అది దేశవిశేషముతో సంబద్ధమగుటవలనఁ దత్ప్రాప్త్యర్థము గమన మవిరుద్ధము. ఆత్మయందు సర్వగతుఁ డయ్యు నతనికి ఘటాదిగమనమున నాకాశమునకు వలె నుపాధిగమనమున గమనప్రసిద్ధి యని "తద్గుణసారత్వా"

౧. భాం. 3. ౧౪. ౨. అ ౧. పా ౨. మొదటి యధికరణమున వ్యాఖ్యాతము.

త్తను సూత్రమునఁ జెప్పితిమి. కాఁబట్టి (పరబ్రహ్మవిషయమున గత్యభావమువలనను నపరబ్రహ్మవిషయమున గత్యుపపత్తివలనను) కార్యాం బాదరి యను సిద్ధాంతమే నిశ్చితము. పరం జైమిని యను సిద్ధాంతము ప్రజ్ఞావికాసమునకుఁ బ్రతిభానమాత్రప్రదర్శన మని యెఱుంగునది.

ఇది పంచమాధికరణము

## అప్రతీకాలంబనాధికరణము. ౬.

సూ. అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽదోషాత్తత్క్రతుశ్చ. ౧౫

ప. అప్రతీకాలంబనాన్-నయతి-ఇతి-బాదరాయణః-ఉభయథా-అదోషాత్-తత్క్రతుః-చ.

(ఇట్లుగంతవ్యమును నిరూపించి గంతలనిరూపించుచున్నాఁడు)

అ. అమానవపురుషుఁడు ప్రతీకోపాసకులను విడిచి తక్కిన వికారాలంబనులను బ్రహ్మలోకమును బొందించుచున్నాఁ డని బాదరాయణాచార్యుఁడు తలంచుచున్నాఁడు. (దేనివలనను?) ప్రతీకోపాసకుల బ్రహ్మలోకముం బొందింపఁడు; తక్కిన యుపాసకులఁ బొందించుచున్నాఁడు నను నుభయథాభావ మంగీకరింపఁబడినచో విరోధాభావమువలనను. తత్క్రతున్యాయము దీని సమర్థించు హేతువు.

భా. (పూర్వాధికరణమున) గతి కార్యబ్రహ్మవిషయము కాని పరబ్రహ్మవిషయము కాదను నిది స్థిరపఱుపఁబడినది. ఇపు డుపాసకుల నెల్లర నవిశేషముగ నమానవపురుషుఁడు బ్రహ్మలోకమునకుఁ గొంపోవుచున్నాఁడా? లేక కొందఱను గొంపోవుచున్నాఁడా? యని సందేహింపఁబడుచున్నది. ఏమి ప్రాప్తమయ్యెను? పరమగు బ్రహ్మముకంటె వేఱువానిని (కార్యబ్రహ్మవిషయమైన) యీ గతి విద్వాంసులకెల్లరకును గావచ్చును; అట్లేదా యనియమాధికరణమున విద్యాంతరములందు నీ గతి యవిశేషముగ నుపసంహరింపఁబడినది యని ప్రాప్తము కాఁగా నిరాకరించుచున్నాఁడు. (అమానవపురుషుఁడు) అప్రతీకాలంబనాన్ = నామాదిప్రతీకోపాసకులను విడిచి తక్కిన వికారోపాసకుల (అహంగ్రహోపాసకుల) నెల్లరను బ్రహ్మలోకమునకుఁ గొంపోవుచున్నాఁడని, బాదరాయణః = బాదరాయణాచార్యుఁడు తలఁచుచున్నాఁడు. (ఏకారణమువలనను?) ఉభయథా - అదోషాత్ = ఇట్లుభయథా భావాభ్యుపగమము గలుగుచుండఁగా ననియమన్యాయమునకుఁ బ్రతీకోపాసనముకంటె నితరము లగు నుపాసనములం దుపపత్తివలన నేవిరోధమును లేకపోవుటవలనను. తత్క్రతుశ్చ=తత్క్రతున్యాయ (ఎవఁడు దేని నుపాసించుచున్నాఁడో వాఁడు దానిం బొందుచున్నాఁ

డను న్యాయ) మీ యుభయథా భావాభ్యుపగమమును సమర్థించు హేతు వని యెఱుంగునది. "తం యథా యథో పాసతే తదేవ భవతి" యను శ్రుతివలన నెవరు బ్రహ్మో పాసకులో వారు బ్రహ్మమును బొందుదు రని సిద్ధి యుక్తము. ఉపాసనము ప్రతీక ప్రధాన మగుటవలన (నామాది) ప్రతీకోపాసకులందు బ్రహ్మదృష్టి లేదు. అట్లే! బ్రహ్మక్రతువు (బ్రహ్మోపాసకులు) కాని వారును బ్రహ్మలోకమును పొందుచున్నారు అని ఛాందోగ్య విద్యయందు "స ఏనాన్ బ్రహ్మ గమయతి" యని వినం బడుచున్నది యనిన నెట్టి ప్రత్యక్షవచనము గలదో యట్టి సామాన్యమగు తత్క్రతున్యాయమునకు నపవాదము కావచ్చును. కాని యది లేనిచోట సామాన్య (సామాన్య) మగు తత్క్రతున్యాయముచే బ్రహ్మక్రతువులకే బ్రహ్మ ప్రాప్తి గాని యితరులకు లేదని యాచార్యులు తలంచు చున్నారు.

సూ. విశేషంచ దర్శయతి. ౧౬

ప. విశేషం - చ - దర్శయతి.

అ. మఱియు శ్రుతి ప్రతీకోపాసనములందు బూర్వ పూర్వపు దానికంటె నుత్తరోత్తర మగు దానియందు ఫలా ధిక్యము జూపుచున్నది. అది బ్రహ్మ మేకరూప మగుట

వలనఁ దదుపాసనములందు లేవని చెప్పఁబడెను. కాఁబట్టి బ్రహ్మోపాసకులఫలముతో సమానఫలము వారికి లేదు.

భా. (అపిచ = మఱియును) శ్రుతి నామాదు లగు ప్రతీకోపాసనములందుఁ బూర్వపూర్వపు దానికంటెఁ బరువాతిది దరువాతిది యగు దాని యందు, విశేషం=ఫలాధిక్యమును "[1]యావన్నామ్నో గతం తత్రాస్య కామచారో భవతి, [2]వాగ్వావనామ్నో భూయసీ, [3]యావద్వాచో గతం తత్రాస్య యథాకామచారో భవతి [4]మనోవావ వాచో భూయః" యనునవి మొదలగువానిచేఁ గనుపఱుచుచున్నది. ఉపాసనములకు ఫలవిశేషము ప్రతీకాధీన మగుటవలన (వానియుత్కర్షాపకర్షములవలన) నుపపన్న మగుచున్నది. బ్రహ్మాధీనము లయ్యెనేని బ్రహ్మ మవిశిష్ట మగుటవలన నెట్లు ఫలవిశేషము సంభవించును? కాఁబట్టి ప్రతీకోపాసకుల కితరుల (బ్రహ్మోపాసకుల) తో సమానఫలము లేదు.

---

౧. ఛాం. ౭. ౧. ౫. నామము బ్రహ్మ మని యుపాసించినవానికి నామమునకు గోచర మగునంతవిషయమున స్వేచ్ఛాసంచారము సంభవించుచున్నది.

౨. ఛాం. ౭. ౨. ౧. వాక్కు నామముకంటె గొప్పది.

3. ఛాం. ౭. ౨. ౨. వాక్కును బ్రహ్మముగా నుపాసించువానికి వాగ్విషయమునఁ గామచారము సిద్ధించును.

౪. ఛాం. ౭. 3. ౧. మనసు వాక్కుకంటెఁ బ్రశస్తము.

(ప్రతీకోపాసకులకుఁ బిత్రుయాణమునం గాని తృతీయ మార్గమునం గాని ప్రవేశము లేమిం జేసి యర్చిరాదిమార్గ గమనమే వాచ్యము. కాని వా రా మార్గమున విద్యుల్లోకము వఱకుం బోయి యటనే ఫలానుభవముదాఁక నుందు రని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు.)

ఇది షష్ఠాధికరణము

---

ఇది శ్రీమచ్ఛంకర భగవత్పాదకృత శారీరక మీమాంసాభాష్య చతుర్థాధ్యాయ తృతీయపాదాంధ్రీకరణము

# ఆంధ్ర సూత్ర భాష్యము

## అధ్యాయము ౪ పాదము ౪

---

(అవ. పూర్వపాదమున బ్రహ్మోపాసకులకుఁ గార్యబ్రహ్మప్రాప్తి చెప్పంబడినది. ఇపుడు వారికీపాదము నుత్తరార్థమున బ్రాహ్మానికమగు నైశ్వర్యవిశేషముం బ్రసంచింపఁగలవాఁ డగుచు మొదట సర్వోత్కృష్టపరవిద్యాప్రాప్యమగు నిర్విశేషబ్రహ్మభావముం జెప్పుచున్నాఁడు.)

### సంపద్యావిర్భావాధికరణము. ౧

సూ. సంపద్యావిర్భావ స్స్వేన శబ్దాత్. ౧

ప. సంపద్య - ఆవిర్భావః - స్వేనశబ్దాత్.

అ. శ్రుతియందలి స్వశబ్దమువలన ముక్తుఁడు బ్రహ్మస్వరూపముం బొంది కేవలమగు నాత్మరూపముచే నభినిష్పన్నుఁ డగుచున్నాఁడు గాని ధర్మాంతరముచేఁ గాఁడు.

భా. "ఏవమేవైష సంప్రసాదో2స్మా చ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే"[1]

[1] ఛాం. ౮. ౧౨. ౩. ఏవమేవ=అట్లే, (అశరీరములగు వాయువు మొదలగునవి వర్షాదిప్రయోజనావసానమున నాకాశభావముం బొందినట్లే)

యని ఛాందోగ్యమున వినఁబడుచున్నది. అందు, (సంప్రసా
దుఁడు) దేవలోకాద్యుపభోగస్థానములందు వలె నాగంతుక
మగు నద్వితీయ లోకరూపమున నభినిష్పన్నుఁడగు చున్నాఁడా?
లేక యాత్మమాత్రముననా? యని సంశయము కలదు. ఏమి
ప్రాప్తమయ్యెను? మోక్షమునకు ఫలత్వ ప్రసిద్ధివలనను "అభి
నిష్పద్యతే" యనునట్టి యుత్పత్తిపర్యాయ మగుటవలన
నాగంతుక మగు నద్వితీయ లోకరూపవిశేషముచే నభినిష్పత్తి
కావలెను. స్వరూపమాత్రమున నభినిష్పత్తి యయ్యెనేని
యది పూర్వావస్థలయందును, స్వరూపానపాయమువలన సిద్ధమె
కాఁబట్టి యద్వితీయ లోకరూపవిశేషమున నభినిష్పన్నుఁ డగు
చున్నాఁడని యిట్లు పూర్వపక్షము ప్రాప్తమగుచుండఁగాను,
సంపద్య = బ్రహ్మమును సాక్షాత్తుగాఁ బొంది కేవల మగు
నాత్మరూపముననే, ఆవిర్భావః = అభినిష్పత్తి కలవాఁ డగు
చున్నాఁడని చెప్పుచున్నారము. దేనివలనను? స్వశబ్దాత్ =
"స్వేనరూపేణాభినిష్పద్యతే" యని స్వశబ్దమువలనను. వేఱొక

---

సంసారావస్థయందవిద్యచే నేను వీని కుమారుఁడను జాతుఁడను ముదుసలి
వాఁడను మరణింతు నను నీప్రకారముగా దేహసామ్యమును బొందిన, ఏషః
సంప్రసాదః = ఈ జీవుఁడు, (నీవు దేహేంద్రియాదిధర్ముఁడవు గావు
కేవల సచ్చిదానందుఁడవే యని బోధితుఁడై) శరీరాత్-సముత్థాయ = శరీరము
నుండి లేచి=దేహాదివిలక్షణ మగు నాత్మస్వరూపమును దెలిసికొని దేహాత్మ
భావమును విడిచి యని యర్థము. పరంజ్యోతిః-ఉపసంపద్య = పరమాత్మని
బొంది, స్వేనరూపేణ = సదాత్మరూపముచేతను, అభినిష్పద్యతే = అభి
నిష్పన్నుఁ డగుచున్నాఁడు.

ప్రకారమున నయ్యెనేని (ఆగంతుకరూపమున నభినిష్పన్నుఁ డయ్యెనేని) స్వేన యను విశేషణము నిరర్థక మగును. అయ్యా! స్వశబ్ద మాత్మీయాభిప్రాయము గావచ్చునసిన నది చెప్పఁదగినది కాకపోవుటవలన నట్లనరాదు. ఏరూపముచే నభినిష్పన్నుఁ డగుచున్నాఁడో యారూప మాతని కాత్మీయ మగుటవలన స్వేన యను విశేషణము నిరర్థకము. ఆత్మవచన మగుచుండఁగా (స్వశబ్ద మాత్మార్థ మగుచుండఁగా)ఁ గేవల మగునాత్మరూపముచే నభినిష్పన్నుఁ డగుచున్నాఁడు గాని యాగంతుక మగు రూపముచే నభినిష్పన్నుఁడు గాఁ డని యా విశేషణము సార్థక మగుచున్నది. మోక్షమునకు ఫలత్వము గలుగుచుండఁగాఁ బ్రాప్త మగు నాగంతుకత్వనిరాసార్థము స్వశబ్ద విశేషణము సార్థక మని యర్థము.

అవ. పూర్వావస్థలందు నిపుడును స్వరూపానపాయ సామ్యము గలుగుచుండఁగా విశేష మేమి యను శంక గలుగుటవలనఁ జెప్పుచున్నాఁడు.

సూ. ముక్తః ప్రతిజ్ఞానాత్. ౨

ప. ముక్తః - ప్రతిజ్ఞానాత్.

అ. మున్ను బద్ధుఁడు నిపుడు ముక్తుఁడు నను నిది విశేషము. ఇది సర్వదోషవిహీనుఁ డగు నాత్ముఁడు వ్యాఖ్యేయుఁ డను ప్రతిజ్ఞానమువలనఁ దెలియంబడుచున్నది.

భా. ఎవఁ డిట నభినిష్పన్నుఁడని చెప్పంబడినవాఁడో యతఁడు, ముక్తః = ఎల్ల బంధములచేత విడువఁబడినవాఁడై శుద్ధ మగు నాత్మము (స్వరూపము) తో నిలుచుచున్నాఁడు. "అంధోభవతి, రోదితీవ వినాశమే వాపీతో భవతి" యని మున్ను జాగ్రదాద్యవస్థాత్రయకలుషిత మగు నాత్మము (స్వరూపము) తో నుండుననునదియే గొప్పవిశేషము. ఇపు డతఁడు ముక్తుఁ డగుచున్నాఁడని యెట్లు తెలియంబడుచున్నది యాలని ప్రతిజ్ఞానాత్తని = చతుర్ముఖునిచే నట్లు ప్రతిజ్ఞ[1] చేయఁబడుటవలన నని చెప్పుచున్నాఁడు. ఆప్రతిజ్ఞానము వివరింపబడుచున్నది. "ఏతం త్వేవ తేభూయోనువ్యాఖ్యాస్యామి" యని యవస్థాత్రయదోషవిహీనుఁడగు నాత్ముఁడు వ్యాఖ్యేయుఁడని ప్రతిజ్ఞచేసి "అశరీరంవా[2] వసంతం నప్రియాప్రియే స్పృశత"యని యుపన్యసించి "స్వేనరూపేణాభినిష్పద్యతే సఉత్తమఃపురుష" యని యుపసంహరించుచున్నాఁడు. అట్లే యాఖ్యాయికారంభమునను "య[3] ఆత్మా౽పహత పాప్మా

౧. ఛాం. ౮. ౯. ౩. } మున్ను నీ కుపదేశించిన యాత్మనిఁకె
౮. ౧౦. ౪. } మరలఁ బ్రకారాంతరమున నుపదేశింతు
౮. ౧౧. ౩. } నని యింద్రునితో బ్రహ్మ చెప్పెను.

౨. ఛాం. ౮. ౧౨. ౧. దేహేంద్రియాదులం దాత్మబుద్ధి లేనివానిఁ బ్రియము గాని యప్రియము గాని స్పృశింపదు. వానికిఁ బ్రియాప్రియములు లేవని యర్థము.

౩. ఛాం. ౮. ౭. ౧. ఏ యాత్ముఁ డపహతపాప్మత్వాదులు గలవాఁడో మఱియు నేయాత్ముఁడు జరామరణాదివికారములు లేనివాఁడో

విజరో విమృత్యు" వనునది మొదలగు ముక్తాత్మవిషయమే యైన ప్రతిజ్ఞానము గలదు. మోక్షమునకు ఫలత్వసిద్ధియు బంధనివృత్తిమాత్రాపేక్షమె కాని యపూర్వోపజననాపేక్షము గాదు. అభినిష్పత్తి యనునది యుత్పత్తిపర్యాయమని యెద్ది చెప్పంబడినదో యదియును రోగనివృత్తి గలుగుచుండఁగా నరోగుఁడుగా నిష్పన్నుఁ డగుచున్నాఁ డను నట్లే కాని యపూర్వావస్థాపేక్షము గాదు. కనుక దోషము లేదు.

సూ. ఆత్మా ప్రకరణాత్. 3

ప. ఆత్మా - ప్రకరణాత్.

అ. "పరంజ్యోతి రుపసంపద్య" యని శ్రుతి యితనిని గార్య(భౌతిక)జ్యోతిం బొందినవానిఁగాఁ జెప్పుచున్నది యను కారణమువలన నితఁడు ముక్తుఁ డనియెట్లు చెప్పవచ్చు ననినఁ బ్రకరణమువలన నిట నాత్మయే జ్యోతిశ్శబ్దమునం జెప్పఁబడుచున్నవాఁ డగుటవలన నిది దోషము గాదు.

భా. ఎక్కారణముచేతను "పరంజ్యోతి రుపసంపద్య" యని శ్రుతి జ్యోతిశ్శబ్దము భౌతికమగు జ్యోతియందు రూఢమగుటవలన నితనిని వికారమగు జ్యోతిం బొందినవానినిగానే వినిపించుచున్నదో యాకారణమున నితఁడు ముక్తుఁడని యెట్లు

యట్టియాత్మ తెలియంగునది. ఆ యాత్మ నెఱింగినవాఁ డెల్ల కామములం బొందును. మఱియు నతని కెల్లలోకముల నిచ్చవచ్చినట్లు సంచారము సంభవించును.

చెప్పఁబడుచున్నాఁడు ? వికారమున కార్తత్వ = (తుచ్ఛత్వ) ప్రసిద్ధివలన వికారవిషయమునుండి యతిక్రమింపనివాఁడెవ్వఁడును ముక్తుఁడు గా నగ్గుడు గాఁ డనిన నెక్కారణమువలన నిట జ్యోతిశ్శబ్దము చేసెను, ప్రకరణాత్ = ప్రకరణమువలనను ఆత్మా = ఆత్మయే తెలుపఁబడుచున్నాఁడో యాకారణము వలన నిదోషము లేదు. "య ఆత్మాపహత పాప్మా విజరో విమృత్యు" వని పరిగాఁగు నాత్మము ప్రస్తుతమగుచు నుండఁగా నకస్మాత్తుగా నెట్లు భౌతిక మగుజ్యోతి గ్రహింపఁబడ శక్యమగును? గ్రహింపఁబడినఁ బ్రకృత హానా ప్రకృత ప్రక్రియా ప్రసంగము సంభవించును గదా! "తద్దేవాజ్యోతిషాం జ్యోతి "యని జ్యోతిశ్శబ్ద మాత్మునందును జూడఁబడుచున్నది. జ్యోతిర్దర్శనా త్తనుసూత్రమునొద్ద నిది ప్రపంచింపఁబడి నదియును.

ఇది ప్రథమాధికరణము

## అవిభాగాధికరణము. ౨

సూ. అవిభాగేన దృష్టత్వాత్. ౪

ప. అవిభాగేన - దృష్టత్వాత్.

అ. శ్రుతులం దట్లు కాన్పించుటవలన ముక్తుఁడు పరమగు బ్రహ్మముతో నేకీభవించియే యుండును గాని వేఱుగా నుండఁడు.

భా. ఎవఁడు పరమగు జ్యోతిం బొంది తనరూపమున నభినివ్పన్నుఁ డగునో వాఁడు పరుఁడగు నాత్మునికంటె వేఱుగా నుండునా? వేఱొకపక్షమునఁ బరుఁడగు నాత్ముని గలిసి యుండునా? యను సంశయము గలుగుచుండఁగాను "[1]సతత్ర పర్యేతి" యను నాధారాధేయభావనిర్దేశమువలనను "పరం జ్యోతి రుపసంపద్య" యని కర్మ కర్తృ నిర్దేశమువలనను వేఱుగానే యుండు నను బుద్ధి యెవనికేఁ గలుగునో వానిని ముక్తుఁడు పరమాత్మునితో నవిభక్తుఁడయియే యుండు నని బోధించుచున్నాఁడు. దేనివలనను? అవిభాగేన-దృష్టత్వాత్ = అవిభాగముననే (పరమాత్మునితో నేకీభవించియే) యుండు నని శ్రుతులందుఁ గాన్పించుటవలనను. అది యెట్లన్నం బ్రతిపాదింపఁబడుచున్నది. "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, [2]యత్ర నాన్య త్పశ్యతి, [3]నతు తద్ద్వితీయ మస్తి తతోన్యద్విభక్తం

---

౧. ఛాం. ౮. ౧౨. ౩. సః = ఆ పరమాత్మం బొందిన యుత్తమ పురుషుఁడు, తత్ర = స్వాత్మయందున్, (సర్వాత్మభూతుఁడై యింద్రాది స్వరూపమున నీప్సితార్థముల ననుభవించుచున్) పర్యేతి = సంచరించుచుండును.

౨. ఛాం. ౭. ౨౪. ౧. యత్ర = ఏ భూమతత్త్వమునను, అన్యత్-నపశ్యతి = వేఱొకఁడు మఱియొక సాధనముచే నింకొక వస్తువును జూడఁడో (అదియే సుఖము నమృతమును; తక్కినది తుచ్ఛము.)

౩. బృ. ౬. ౩. ౨౩. తతః = ఆ ద్రష్టకంటెను, అన్యత్ = వేఱుగాను, విభక్తం - యత్ = విభజింపఁబడిన దేనిని, పశ్యేత్ = చూచునో,

యత్ర త్వస్యే" త్యాదులగు వాక్యము లవిభాగమునే పర మాత్మతో జూపుచున్నవి. తత్క్రతున్యాయమువలన దర్శ నానుసారముగానే ఫలము యుక్తమగును. "యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి ఏవం మునే ర్విజానత ఆత్మా భవతి గౌతమ" యనునది మొదలగు ముక్తస్వరూప మును నిరూపించు వాక్యములును నదీసముద్రాద్యుదాహరణ ములును ముక్తునకుం బరమాత్మనకు నవిభాగమునే చూపు చున్నవి. భేదనిర్దేశము భేదము లేకున్నను "సభగవః, కస్మిన్ ప్రతిష్ఠితః, స్వే మహిమ్ని" యనునదియు "ఆత్మరతి రాత్మక్రీడ" యనునదియు మొదలగువాని కాన్పించుటవలన నుపచారమునం గావచ్చును.

ఇది ద్వితీయాధికరణము

---

తత్ - ద్వితీయం = అట్టి రెండవవస్తువు (పరమాత్మతో భేదించిన కాల మునను) నతు = లేనే లేదు.

౧. క. ౪. ౧౫. గౌతమ - ఓ నచికేతుఁడా, శుద్ధే - ప్రసన్న మగు జలమునందున్, ఆసిక్తం=పోయఁబడిన, శుద్ధం- ఉదకం=నిర్మల మగు నుదకము, తాదృగేవ=అట్టిదియే=ఏకరసమే, యథా-భవతి = ఎట్లగుచున్న దో, ఏవం = ఇట్లే, విజానతః = జీవేశ్వరుల కైక్యమును దెలిసికొన్న, మునేః = మననశీలునియొక్క, ఆత్మా = ఆత్మయును, తాదృగేవభవతి= అట్టివాఁడే యగుచున్నాఁడు. ఏకరసుఁడే యగుచున్నాఁ డని యర్థము.

౨. ఛాం. ౭. ౨౪. ౧. భగవః=పూజ్యుఁడ వగు ఓ సనత్కుమా రుఁడా, సః = ఆ భూమపదార్థము, కస్మిన్ = దేనియందు, ప్రతిష్ఠిత- ఇతి=నిల్చినదని (నారదుఁ డడుగఁగా సనత్కుమారుఁడు నీ పెద్దయే నొక

## బ్రాహ్మాధికరణము. 3

సూ. బ్రాహ్మేణ జైమిని రుపన్యాసాదిభ్యః. ౫

ప. బ్రాహ్మేణ - జైమినిః - ఉపన్యాసాదిభ్యః.

అ. అపహతపాప్మత్వాద్యుపన్యాసాదులవలన ముక్తుఁడు బ్రహ్మసంబంధ మగు సర్వజ్ఞత్వాదులతోఁ గూడినరూపముచే నభినిష్పన్నుఁ డగుచున్నాఁ డని జైమినిముని తలఁచుచున్నాడు.

భా. "స్వేన రూపేణ" యనుచో నాత్మమాత్రస్వరూపముచే ముక్తుఁ డభినిష్పన్నుఁ డగుచున్నాఁడు గాని యాగంతుక మగు పరధర్మముచే నభినిష్పన్నుఁడు గాఁ డనునిది మున్ను నిరూపింపఁబడినది. ఇపు డా స్వరూప మెద్ది యని = (సత్య మగు సర్వజ్ఞత్వాది ధర్మయుక్తమా? చిన్మాత్రమా? వాస్తవముగాఁ జిన్మాత్ర మయ్యు జీవాంతర వ్యవహారదృష్టిచేఁ గల్పితసర్వజ్ఞత్వాదియుక్తమా? యని)

---

యాశ్రయముం గోరితివేని, స్వే-మహిమ్నితి=తన విభూతియందుఁ బ్రతిష్ఠిత మని చెప్పుదుము. (పరమార్థము నడిగితివేని యందును భూమము ప్రతిష్ఠితము గాదని చెప్పుదు మని చెప్పెను.)

3. ఛాం. ౭. ౨౫. ౨. ఆత్మరతిః=ఆత్మయందు (తనయందు) రమణము కలవాఁడు, ఆత్మక్రీడః = ఆత్మయందే క్రీడ కలవాఁడు నై బాహ్యాపేక్ష లేని విద్వాంసుఁడు జీవించియుండఁగనే స్వారాజ్యమున నభిషిక్తుఁడై దేహపాతానంతరమునను స్వరాట్టగును. (దేహమాత్రసాధనము రమణము, బాహ్యసాధనము క్రీడయు నని భేదము.)

బుధుత్స గలుగుచుండఁగాను, బ్రాహ్మేణ = అపహతపాప్మ త్వాదులు సత్యసంకల్పత్వావసానములు నట్టి సర్వజ్ఞత్వము సర్వేశ్వరత్వము నను బ్రాహ్మమగు రూపము ముక్తునకు స్వరూపము. ఆస్వరూపముతో నభినిష్పన్నుఁ డగుచున్నాఁ డని, జైమినిః = జైమిన్యాచార్యుఁడు తలంచుచున్నాఁడు. ఏకారణమువలనను? ఉపన్యాసాదిభ్యః = ఉపన్యాసాదు లగు హేతువులవలన నట్లు జ్ఞాత మగుటవలనను. అది ప్రతి పాదింపఁబడుచున్నది. "య ఆత్మాపహతపాప్మా" యను నది మొదటఁ గలదియును "సత్యకామ స్సత్యసంకల్ప" యనున దంతమునఁ గలదియు నగు నుపన్యాసముచే (శ్రుతి) యాత్మున కిట్టిరూపము కలిమిని బోధించుచున్నది. (ఆది పదముచే విధివ్యపదేశములు గ్రాహ్యములు.) అట్లే "సతత్ర పర్యేతి జక్షత్ క్రీడన్ రమమాణ" యనియును "తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి" యనియును విధులు ముక్తున కైశ్వర్యమును బోధించుచున్నవి. (ఇవియు) "సర్వజ్ఞ స్సర్వేశ్వర" ఇత్యాదివ్యపదేశములును నిట్లయిననే యుప పన్నములగుచున్నవి. కాఁబట్టి జైమిని యట్లు తలంచుచున్నాఁ డు. (ఉపన్యాసము నాముద్దేశము. అది వేఱొకచో జ్ఞాతమైన

---

౧. ఛాం. ౭. ౨౫. ౨. తస్య = బాహ్యసాధనముల నపేక్షింపని విద్వాంసునకు, సర్వేషు లోకేషు = ఎల్లలోకములందును, కామచారః = స్వేచ్ఛాసంచారము, భవతి = సంభవించుచున్నది.

దానికి మఱియొక విధ్యర్థమైన యనువాదము. ఇట “య ఆత్మేత్యా” దిక ముపన్యాసము. ప్రమాణాంతరమున నజ్ఞాత మగు నర్థమును బోధించు వాక్యము విధి. అది యిటఁ “జక్షన్ని ” త్యాదికము. విధ్యభావముచే ననుద్దేశ్యమును నప్రతిపాద్యమగుటచే నవిధేయమును నగుదానిని సిద్ధమగు దానిని వలె నిర్దేశించువాక్యము వ్యపదేశము. అది యిట “ యస్సర్వజ్ఞ ” ఇత్యాదికము.) అప. సత్యకామత్వాదు లగు ధర్మములకు సత్యత్వమును నిరసించుచు సత్యాంతాసత్వపక్షమును జెప్పుచున్నాఁడు.

సూ. చితితన్మాత్రేణ తదాత్మకత్వా దిత్యౌడులోమిః. ౬

ప. చితి - తన్మాత్రేణ - తదాత్మకత్వాత్ - ఇతి - ఔడులోమిః.

అ. ముక్తుఁడు కేవల చిత్స్వరూపుఁ డగుటవలనఁ జిత్తునందు సర్వజ్ఞత్వాదులు లేమిం జేసి చిన్మాత్రస్వరూపముతో నభినిష్పన్నుఁ డగుచున్నాఁడు గాని సర్వజ్ఞత్వాదిస్వరూపముతో నిష్పన్నుఁడు గాఁ డని యౌడులోమ్యాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

భా. పరికింపఁగా నపహతిపాప్మత్వాది ధర్మములు వేఱుగానే నిర్దేశింపఁబడుచున్నవి కాని యవి, చితి=చిత్తునందు శబ్దవికల్పమువలనం బుట్టినవియే. (శబ్దజ్ఞానమువలని యప

త్రుత్యయమువలనఁ బుట్టినవియే = అత్యంతాసత్తులే.) ఆ యపహతపాప్మత్వాదులందుఁ బాప్మాదినివృత్తి మాత్రము తెలియఁబడుచున్నది. తదాత్మకత్వాత్ = ఈ యాత్మునకుఁ జైతన్యమాత్రమే స్వరూప మగుటవలనను, తన్మాత్రేణ = కేవలచైతన్యస్వరూపముచే నభినిష్పత్తి యుక్త మగును. ఇట్లగుచు నుండఁగాను "ఏవంవా అరేఽయ మాత్మాఽనంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" యను నిట్టిశ్రుతి యను గ్రహింపఁబడినది యగును. పరికింపఁగాను "సత్యాః కామా అస్య" యను (సత్యమగు కోర్కులితనికిఁ గలవను) వ్యుత్పత్తిచే సత్యకామత్వాదులు స్వరూపముచేతనే ధర్మములని చెప్పఁబడుచున్నవి. ఐన బ్రహ్మమున కనేకాకారత్వప్రతిషేధమువలన నవి యుపాధిసంబంధాధీనములు కాఁబట్టి వానికిని జైతన్యమునకువలె స్వరూపత్వము సంభవింపదు. "న స్థానతోఽపి పరస్యోభయలింగ" మను సూత్రముకడ బ్రహ్మమున కనేకాకారత్వము ప్రతిషేధింపఁబడినది గదా! అనేకాకారత్వ ప్రతిషేధమువలననే జక్షణాది సంకీర్తనము

---

౧. బృ. ౬. ౫. ౧౩. అరే = ఓ మైత్రేయీ, ఏవం - వై = ఈ యుపష్టు గడ్డవలెనే, అయ మాత్మా = ఈ యాత్మయు, అనంతరః - అబాహ్యః = లోపలను వెలుపలను వివిధమగు భేదము లేని, కృత్స్నః - ప్రజ్ఞానఘనఏవ = కేవల చైతన్యపు ముద్దయే.

దుఃఖాభావమాత్రాభిప్రాయ మై యాత్మరతి రిత్యాదులుం బలె స్తుత్యర్థము. రతిక్రీడామిథునాదులు ద్వితీయవిషయము లగుటవలన ముఖ్యములే యగునవి యాత్మనిమిత్తము లైనవి వర్ణింప శక్యములు కావు. కాఁబట్టి (ముక్తుఁడు) నిరస్తాశేష ప్రపంచమును బ్రసన్నము నవ్యపదేశ్యము నగు బోధరూప ముచే నభినిష్పన్నుఁ డగుచున్నాఁడు. ఇతి = అని, ఔడు లోమిః = ఔడులోమ్యాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

అవ. ఇట్లు ధర్మములకు సత్యత్వము నత్యంతాసత్య త్వము నను పక్షద్వయము చెప్పఁబడినది. అద్వైతశ్రుతుల కును సర్వజ్ఞత్వాదిశ్రుతివ్యవహారమునకును బాధ ప్రాప్తించుట వలన మూఁడవపక్షము శ్రేయమని సిద్ధాంతించుచున్నాఁడు.

సూ. ఏవ మప్యుపన్యాసా త్పూర్వభావా దవిరోధం బాద రాయణః. ౭

ప. ఏవం - అపి - ఉపన్యాసాత్ - పూర్వభావాత్ - అవిరోధం - బాదరాయణః.

అ. ముక్తునకుఁ గేవల చైతన్యస్వరూపత్వ మంగీక రింపఁబడినను బూర్వము చెప్పఁబడిన యుపన్యాసాదులవలన నవగత మగు బ్రాహ్మైశ్వర్యము నిషేధింపఁబడక పోవుటవలన నుభయథా భావమునకు విరోధము లేదని బాదరాయణాచా ర్యుఁడు తలంచుచున్నాడు.

భా. ఏవ మపి = ముక్తునకుం బారమార్థికచైతన్య మాత్ర స్వరూప మంగీకరింపంబడినను వ్యవహారాపేక్ష చేతను, ఉపన్యాసాత్ =ము న్నుదాహరింపంబడిన యుపన్యాసాదులవలన నవగత మగు, పూర్వభావాత్ =మీాంచుం జెప్పబడిన బ్రాహ్మ మగు నైశ్వర్యరూపమున కప్రత్యాఖ్యానము వలనను, అవిరోధః = ఉభయవిధత్వమునకు విరోధాభావమును, బాదరాయణః = బాదరాయణాచార్యుండు తలంచుచున్నాండు. (ఇట ముక్తులకు నఖండచిన్మాత్రజ్ఞానమువలన నజ్ఞానము లేమింజేసి యాజ్ఞానికధర్మసంబంధ మట్లని కొందఱు మోహపడుచున్నారు. కాని పూర్వధర్మము లెవ్వియో యవి ముక్తుండగుచిదాత్మునందు నితరజీవులచే వ్యవహరింపంబడుచున్న వని వారిని బోధింపవలెను.)

ఇతి త్ర్యధికరణము

## సంకల్పాధికరణము. ౪

అవ. ఇట్లు పరవిద్యాఫలముం జెప్పి యపరవిద్యాఫలముం జెప్పుచున్నాండు.

సూ. సంకల్పా దేవతు తచ్ఛ్రుతేః ౮

ప. సంకల్పాత్-ఏవ-తు-తచ్ఛ్రుతేః.

అ. ముక్తునకు భోగ్యజాతము తలఁ[illegible]స్ఫురించు నను శ్రుతివలనఁ గేవల మగు సంకల్పమువలననే పుత్త్రాది ప్రాప్తి యగును.

భా. "స యది పితృలోక కామో భవతి సంకల్పా దేవాస్య పితర స్సముత్తిష్ఠంతీ"త్యాది వాక్యము దహరవిద్య యందు వినంబడుచున్నది. అందుఁ గేవల సంకల్పమే పిత్రాది ప్రాప్తి హేతువా? నిమిత్తాంతర సహితమైన సంకల్పము హేతువా? యని సంశయము గలదు. అట్టి సంశయము గలుగుచుండఁగా సంకల్పమువలననే యని శ్రవణ మున్నను లోకమునందు వలె నిమిత్తాంతరాపేక్ష యుక్తము. ఎట్లన్న దామలకు సంకల్పము గమనము మొదలగు కారణముల వలనఁ బిత్రాదిసంపత్తి యగుచున్నదో యట్లే ముక్తునకు నగును. ఇట్లగుచునుండఁగా దృష్టవిపరీతము కల్పింపఁబడినది గాదు. సంకల్పమువలననే యనునది రాజునకువలె (ముక్తునకు) సంకల్పితార్థసిద్ధిం గావించు సామగ్రి సులభమను

౧. ఛాం. ౮. ౨. ౧. (ఎవఁడు యథోక్తలక్షణ మగు నాత్మని జకినియందలి సత్యకామాది గుణములను వక్ష్యమాణము లగు బ్రహ్మచర్యాది సాధనములు గలవాఁడై హృదయమున సాక్షాత్కరింపఁజేసికొనునో) సః = వాఁడు, (దేహమును విడిచినవాఁడై) పితృలోకకామః = పితృదేవత లందు భోగ్యతదార్థమునందుఁ గోరిక గలవాఁడు (భవతి) యది = అయ్యెనా అస్య = ఈతనియొక్క, సంకల్పాదేవ = మనోరథమువలననే, పితరః = పితృ దేవతలు,

నభిప్రాయమునఁ జెప్పఁబడినది. మఱియు సంకల్పమాత్రమున
నావిర్భవించిన పిత్రాదులు మనోరథవిజృంభితార్థములుం బలెఁ
బుష్కలమగు భోగమును సమర్పింపంజాలవు నని యిట్లు
ప్రాప్తింపఁగాను సంకల్పాదేవతు = ముక్తుని కేవలమగు సం
కల్పము వలననే పిత్రాదిసముత్థాన మగునని చెప్పుచున్నా
రము. దేనివలనను? తచ్ఛ్రుతేః = ముక్తునకు భోగ్యములు
సంకల్పమాత్రము వలననే సంభవించు నను నేవకార శ్రుతి
వలనను. "సంకల్పాదేవాస్య పితర స్సముత్తిష్ఠంతీ"త్యాది
శ్రుతి నిమిత్తాంతరాపేక్ష గలుగుచుండఁగా బాధింపఁబడు
చున్నదిగదా! నిమిత్తాంతర మైనను సంకల్పానువిధాయియే
యయ్యెనేని కావచ్చును గాని సంపత్తికిం బూర్వము వంధ్య
సంకల్పత్వ ప్రసంగమువలన యత్నాంతర సాధ్యమగు నిమి
త్తాంతర మంగీకరింపఁబడదు. శ్రుతి గమ్యమగు నర్థమునందు
లోకసామాన్యముగా లోకమునం జూడంబడినది సంభవింప
దును. మఱియు ముక్తసంకల్పము ప్రాకృతసంకల్పముకంటె
విలక్షణ మగుటవలన సంకల్పబలమువలననే ముక్తునిభోగ్య
ములకుఁ బ్రయోజనము గలుగునందాఁక స్థైర్యోపపత్తియుం
గలదు.

సూ. అతఏవచానన్యాధిపతిః. ౯

ప. అతః - ఏవ - చ - అనన్యాధిపతిః.

అ. అవంధ్య సంకల్పము గలవాఁడు గనుకనే ముక్తుఁడు వేఱొకరాజు లేనివాఁడగును. స్వాధీనమైన నైశ్వర్యము గలవాఁ డగునని యర్థము.

భా. అతఏవచ = అవంధ్యమగు సంకల్పము గలవాఁ డగుటవలననే (ఈశ్వరధర్మ మతనియం దావిర్భవించుట వల ననే) ముక్తుఁడు, అనన్యాధిపతిః = మఱియొక రాజు లేనివాఁ డగుచున్నాఁడు. ఇతనికి వేఱొక యధిపతి యుండఁడని యర్థము. ప్రాకృతుఁడు నయితము గతికలష్పును సంకల్పిం చుచుఁ దనకు నన్యస్వామికత్వమును సంకల్పింపఁడు గదా! "అథ య ఇహాత్మాన మనువిద్య వ్రజంత్యేతాం శ్చ సత్యా న్కామాం స్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" యని శ్రుతియు నీయర్థముం జూపుచున్నది.

ఇది చతుర్థాధికరణము

---

౧. ఛాం. ౮. ౧. ౬. అథ = తరువాతను, యే = ఎవరు, ఇహ= ఈ లోకమునందుఁ, ఆత్మానం = శాస్త్రాచార్యోపదిష్టుఁ డగు నాత్మునిని, ఏతాన్ - సత్యాన్ - కామాన్ - చ = ఈయాత్మునందున్న సత్యసంకల్పాది కార్యములను, అనువిద్య=చక్కఁగం దెలిసికొని, వ్రజంతి = పోవుచున్నారో, తేషాం=వారికిఁ, సర్వేషులోకేషు = ఎల్లలోకములందును, కామచారః = సార్వభౌమునకి లోకమునందువలె, నిచ్చవచ్చినట్లు సంచారము, భవతి = సంభవించుచున్నది.

## అభావాధికరణము. ౫

సూ. అభావం బాదరి రాహ హ్యేవం. ౧౦

ప. అభావం-బాదరిః-ఆహ-హి-ఏవం.

అ. ముక్తునకు శరీరేంద్రియములు లేవని బాదర్యాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

భా. సంకల్పాదేవాస్య "పితరస్సముత్తిష్ఠంతి" యను శ్రుతివలన సంకల్పసాధనమగు మనసు కలదని సిద్ధము. ప్రాప్తైశ్వర్యుఁ డగు విద్వాంసునకు=(ముక్తునకు) శరీరేంద్రియములు కలవా? లేవా? యని సమీక్షింపఁబడుచున్నది. విచారింపఁబడుచున్నదని యర్థము. అట్టి విచారమునను, బాదరిః=బాదర్యాచార్యుఁడు, అభావం= మహీయమానుఁడగు విద్వాంసునకు=(ముక్తునకు) శరీరేంద్రియాభావమును దలంచుచున్నాఁడు. శరీరేంద్రియములు లేవని తలంచుచున్నాఁడని యర్థము. ఏమికారణమువలనను? ఏవం - ఆహహి = "మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే, య ఏతే బ్రహ్మలోకే" యని యామ్నా

౧. ఛాం. ౮. ౧౨. ౫. (ముక్తుఁడు స్వరూపమును బొందినవాఁడై యవిద్యాకృతము లగు దేహేంద్రియములతో వియుక్తుఁడై సర్వాత్మభావమును బొంది) బ్రహ్మలోకే = బ్రహ్మలోకమునందున్, యే - ఏతే = ఏ యీ కామములు గలవో, ఏతాన్ - కామాన్ = ఈ కామములను, ఈప్సితార్థముల నని యర్థము. మనసైవ = మనసుచేతనే, (=సవితృప్రకాశమువలె నిత్యప్రకాశమగు దర్పణముచేతను) పశ్యన్ = చూచుచున్ (=అనుభవించుచున్) రమతే = సంతసిల్లుచుండును.

యు మట్లు చెప్పుచున్నదను కారణమువలనను. శరీరేంద్రియ ములతోడను మనసుతోడను గూడి ముక్తుఁడు విహరించునేని "మనసా" యను విశేషణము లేకపోవలెను. కాఁబట్టి మోక్ష మున శరీరేంద్రియముల కభావ మని సిద్ధము.

సూ. భావం జైమిని ర్వికల్పామననాత్. ౧౧

ప. భావం-జైమినిః-వికల్పామననాత్.

అ. శ్రుతియనేకధాభావమును (పెక్కుప్రకారముల నునికిని) జెప్పుటవలన జైమినిముని ముక్తునకు శరీరేంద్రియ సద్భావమును జెప్పుచున్నాఁడు.

భా. జైమినిః=జైమిన్యాచార్యుఁడు మనసునకువలెనే యింద్రియములతోఁ గూడిన శరీరమునకును, భావఁ=ముక్తు నకుఁ గలిమిని తలంచుచున్నాఁడు. (దేనివలనను?) వికల్పా మననాత్=ఏకారణమువలనను "సఏకధాభవతి త్రిధాభ వతి"[1] యనునది మొదలగువానిచేత ననేకధాభావమును వికల్పముగాఁ (కొన్నిశాఖలవారు) జెప్పుచున్నారో యాకారణమువలనను. అనేకవిధత్వము శరీరభేదముతో వినాగ

౧. ఛాం. ౭. ౨౬. ౨. సః = ధీరుఁడటియా బ్రతికింగిన విద్వాంసుఁడు, ఏకధాభవతి = సృష్టికింబూర్వ మేకాకారముగ నుండును; తరువాతను, త్రిధాభవతి = అనేకాకారములం బొందును. తేజోబన్నరూపములం బొందు నని యర్థము. అట్లు పొంది మరల సంహారకాలమున నేకాకారమును బొందును.

నాంజనము (ముఖ్యము) సంభవింపదుగదా! పరిశీలింపఁగా నిర్గుణ మగు భూమవిద్యయందీయనేకధా భావవికల్పము పఠింపఁబడినది. కాని సగుణావస్థయందు విద్యమానమగు నీశ్వైశ్వర్యమే భూమవిద్యాస్తుతికొఱకుఁ గీర్తింపఁబడుచున్నది యను నీకారణమువలన(విశిష్టభోగయోగ్యమగు) సగుణవిద్యయందు ఫలభావమున బ్రాప్తించుచున్నది యని చెప్పఁబడుచున్నది. ఇట్లు ప్రాప్తింపఁగా సిద్ధాంతము చెప్పఁబడుచున్నది.

సూ. ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణో౽తః ౧౨

ప. ద్వాదశాహవత్-ఉభయవిధం-బాదరాయణః-అతః.

అ. రెండువిధములను బోధించుశ్రుతులు కాన్పించుట వలన ద్వాదశాహమునకు వలె ముక్తున కుభయవిధత్వము యుక్త మని బాదరాయణాచార్యుఁడు తలంచుచున్నాఁడు.

భా. బాదరాయణః=బాదరాయణాచార్యుఁడు, అతః =ఉభయలింగశ్రుతిదర్శనమువలనను, ద్వాదశాహవత్=ద్వాదశాహ మనుక్రతువునకువలెనే, ఉభయవిధం=ఉభయవిధత్వము సాధువని తలంచుచున్నాఁడు. ("య ఏవం విద్వాంస స్సత్ర ముపయంతి" యని) కర్తృబాహుల్యాదిశ్రుతివలన ద్వాదశాహమునకు సత్రత్వమును ("ద్వాదశాహం ప్రజాకామం యాజయేత్త"ను) నియతకర్తృకత్వాదిశ్రుతివలన నహీనత్వమును సాధువైనట్లే ముక్తుఁడు సత్యసంకల్పుఁ డగుటవల

నను సంకల్పవైచిత్ర్యమువలన నెపుడు సశరీరత్వమునుసం కల్పించునో యపుడు సశరీరుఁ డగుచున్నాఁ డెపు డశరీరత్వ మును సంకల్పించునో యపు డశరీరుఁ డగుచున్నాఁ డని సశరీరత్వాశరీరత్వములను రెండును బాదరాయణాచార్యుఁడు సాధువుగాఁ దలంచుచున్నాఁడని యర్థము.

అవ. ముక్తునకు భోగాభావప్రసంగమువలన శరీరా ద్యభావము యుక్తము కాదని శంకించుకొని చెప్పుచున్నాఁడు.

సూ. తన్వభావే సంధ్యవ దుపపత్తేః. ౧౩.

ప. తన్వభావే-సంధ్యవత్-ఉపపత్తేః.

అ. ఇ ట్లయిననే శ్రుతియందలి "మనసా" యను విశే షణ ముపపన్న మగుటవలన నింద్రియములతోఁ గూడిన శరీ రము లేనియపుడు ముక్తునకు స్వప్నమునందువలె భోగములు సంభవించుచున్నవి.

భా. ఉపపత్తేః = "మనసైతాన్ కామాన్ పశ్యన్ర మతే" యను శ్రుతియందలి మనసా యనువిశేషణ మిట్లయి ననే యుపపన్న మగుటవలన తన్వభావే = ఎపు డింద్రియ ములతోఁ గూడిన శరీరమున కభావమో యపుడు సంధ్య వత్ = ఎట్లు స్వప్నస్థానమున శరీరేంద్రియ విషయములు లేనివి యయినను బుత్త్రాది కామము లుపలబ్ధిమాత్రములే యగుచున్నవో యట్లే మోక్షమునందు నగుచున్నవి.

సూ. భావే జాగ్రద్వత్. ౧౪

ప. భావే - జాగ్రద్వత్.

అ. ఇట్లగుచుండఁగనే "న వశధే" త్యాది శ్రుతి యుపపన్న మగుటవలన సేంద్రియమగు శరీర మున్నపుడు జాగ్రదవస్థయందు వలె ముక్తునకు భోగము లగుచున్నవి.

భా. భావే = ఇంద్రియములతోఁగూడిన శరీరము గలుగుచుండఁగాను, జాగ్రద్వత్ = జాగ్రదవస్థయం దెట్లు పిత్రాదికామములు విద్యమానములే యగుచున్నవో యట్లే ముక్తునకు భోగము లుపపన్నము లగుచున్నవి.

ఇది పంచమాధికరణము

---

## ప్రదీపాధికరణము. ౬.

సూ. ప్రదీపవదావేశ స్తథాహి దర్శయతి. ౧౫

ప. ప్రదీపవత్ - ఆవేశః - తథా హి - దర్శయతి.

అ. దీపమున కనేకవర్తులందుఁ బ్రవేశమువలె సలింగుఁడగు ముక్తునకు ననేకశరీరములందుఁ బ్రవేశము సంభవించుచున్నది. శ్రుతి యట్లు కనుపఱుచుచున్నదిగదా!

భా. "భావం జైమినిర్వికల్పామననాత్త"ను సూత్రము నొద్ద ముక్తునకు సశరీరత్వము చెప్పంబడినది. అట (ముక్తునందు)ఁ త్రిధాభావాదులం దనేకశరీరసర్గము గలుగుచుండఁగా

దారుయంత్రములువలె నిరాత్మకము లగు శరీరములు సృజింపఁబడుచున్నవా? యస్మదాది శరీరములుంబలె సాత్మకములా? యని వీక్ష = (విచారము) గల్గుచున్నది. అట్టి వీక్షయం దాత్మ మనములకు భేదానుపపత్తివలన నొక శరీరముతోడనే సంబంధమువలన నితరశరీరములు నిరాత్మకములే యని ప్రాప్తము కాఁగాను "ప్రదీపవదావేశ" యని=దీపమున కనేకవర్తులందువలె విద్వాంసున కనేకశరీరములందుఁ బ్రవేశము సంభవించుచున్న దని చెప్పుచున్నాఁడు. ఎట్లు ప్రదీపమొకటి వికారశక్తి యోగమువలన ననేకవర్తులందుఁ బ్రవేశించి యనేక ప్రదీపభావమును బొందుచున్నదియో యట్లే విద్వాంసుఁడు=(ముక్తుఁడు) నొకఁడే యైన నైశ్వర్యయోగమువలన ననేకభావముం బొంది తనచే సృజింపఁబడిన యనేకశరీరములం బ్రవేశించుచున్నాఁడు. దేనివలన నిది తెలియంబడుచున్నది యంటేని, తథాహి - దర్శయతి = "సఏకధాభవతి త్రిధాభవతి పంచధాభవతి సప్తధా నవధా" యనునది మొదలగు దానిచే శాస్త్ర మొకని కనేకభావమును జూపుచున్నది యను కారణమువలనను. ఈయనేకధాభావము దారుయంత్రసామ్యాంగీకారమునఁగాని జీవాంతరప్రవేశమునఁగాని శ్రుతివిరోధమువలన ననుసంధానాభావప్రసంగము వలనను యుక్తము కాదు. మఱియు నిరాత్మకము లగుశరీరములకుఁ బ్రవృ

త్తి సంభవించదు కావునను శరీరములు సాత్మకములే. ఆత్మమనములకు భేదానుపపత్తివలన ననేకశరీరయోగమున కసంభవ మని యెద్ది చెప్పంబడినదో యది దోషముకాదు. ముక్తుండు సత్యసంకల్పుం డగుటవలన నేకమనోనువర్తులు సమనస్కములు నగునితరశరీరముల సృజియింపఁగలఁడు. సృజియింపఁబడిన యాశరీరములయం దుపాధిభేదమువలన నాత్మునకు ననస్వాత్మత్వమును సంభవింపవచ్చును యోగశాస్త్రమున యోగులకు "నిర్మాణచిత్తా"న్యిత్యాది సూత్రములచేఁ జెప్పఁబడిన యనేకశరీరయోగప్రక్రియ యిదియే.

అన. ఎక్కారణమువలనను తత్కేన[2] కం విజానీయాత్ నతుతద్ద్వితీయమస్తి, తతో[3]ఽన్యద్విభక్తం యద్విజానీయాత్,

---

౧. పా. యో. ౪. ౪. ౧. నిర్మాణచిత్తాన్యస్మితామాత్రాత్ ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేక మనేకేషాం - (యోగియుక్త) అస్మితా మాత్రాత్ = సంకల్పమాత్రము వలనను, నిర్మాణచిత్తాని = నిర్మింపఁబడిన మనములు, (నిర్మితశరీరములందు సంభవించును.) ప్రవృత్తిభేదే = వేఱు వేఱు ప్రవృత్తులందు, అనేకేషాం = అనేకము లగు కల్పితచిత్తములకు, ఏకం-చిత్తం = అనాదిచిత్త మొకటియే, ప్రయోజకం = నియామకము. అస్మితా మాత్ర మనియు భేదప్రయోజక మనియు నానందగిరిపాఠము.

౨. బృ. ౬. ౫. ౧౫. తత్ = ఆ సమయమునకు సర్వము నాత్మస్వరూపమే యైన యవస్థయందు, (కః = ఎవఁడు) కం = దేనిని, కేన = ఏ సాధనము చేతను, విజానీయాత్ = తెలిసికొనును? సర్వము నాత్మయే యని తెలిసికొనినపుడు ద్రష్ట్రాదివ్యవహారము లేదని యర్థము.

౩. బృ. ౬. ౩. ౩౦. (పరమాత్మునితో నేకీభవించినపుడు) తతః = ద్రష్టకంటెను, అన్యత్ = వేఱుగాను, విభక్తం = విభజింపఁబడిన, యత్ = దేనిని, విజానీయాత్ = తెలిసికొనునో, తత్ = అట్టి, ద్వితీయం = రెండవ వస్తువు, నాస్తి = లేనేలేదు.

సలిలఏకో ద్రష్టాద్వైతో భవతి " యనునవి మొదలగు శ్రుతులు విశేష విజ్ఞానమును వారించుచున్నవో యాకారణమువలన నెట్లు ముక్తున కనేకశరీరప్రవేశాది లక్షణ మగు నైశ్వర్య మంగీకరింపఁబడుచున్నది యను శంక రాఁగా నుత్తరముం జెప్పుచున్నాఁడు.

సూ. స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతంహి. ౧౬

ప. స్వాప్యయసంపత్త్యోః - అన్యతరాపేక్షం - ఆవిష్కృతం - హి.

అ. విశేషవిజ్ఞానము లేదను వచనము నిద్రావస్థయుఁ గైవల్యావస్థయు ననువానిలో నొకదాని నపేక్షించినది యై ప్రవృత్తమైనది గాని సగుణవిద్యాఫలస్థానము నపేక్షించినది యై ప్రవర్తించినది గాదు. కాఁబట్టి ముక్తున కనేకశరీరప్రవేశాద్యైశ్వర్యాభ్యుపగమము విరోధింపదు.

భా. స్వాప్యయసంపత్త్యోః - అన్యతరాపేక్షం = " స్వమపీతో భవతి తస్మాదేనం స్వపితీ త్యాచక్షతే" యను శ్రుతి వలన స్వాప్యయము నా సుషుప్తము = నిద్రావస్థ "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి " యను శ్రుతివలన సంపత్తి నాఁ గైవ

౧. బృ. ౬. 3. 3౨. సలిలః = ఉదకమువలె స్వచ్ఛుఁడును, ఏకః = ఒకఁడు నగు, ద్రష్టా = ద్రష్ట = ఆత్మజ్యోతిస్స్వరూపుఁడు, అద్వైతః = (ద్రష్టవ్యము లేమివలన) నద్వితీయుఁ డగుచున్నాఁడు.

ల్యము = మోక్షావస్థ. ఆరెండవస్థలలో నిద్దానినే నొకదాని నపేక్షించినదై యీవిశేషసంజ్ఞాభావవచనము ప్రవర్తించినది. ఒకానొకచో సుషుప్త్యవస్థ నపేక్షించి విశేషవిజ్ఞానాభావము చెప్పఁబడుచున్నది. వేఱొకచోఁ గైవల్యావస్థ నపేక్షించి చెప్పఁబడుచున్నది. ఎట్లిది తెలియఁబడుచున్నది? హి=ఎక్కారణమువలనను "ఏతేభ్యో భూతేభ్యస్సముత్థాయతాన్యేవానువినశ్యతి నప్రేత్యసంజ్ఞాస్తి, యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేనకం పశ్యేత్ యత్ర సుప్తోనకంచన కామం కామయతే నకంచనస్వప్నం పశ్యతి" యను నవి మొదలగు శ్రుతులవలన నీ విశేష సంజ్ఞాభావవచనములకు - ఆవిష్కృతం = ప్రకరణబలముచే నన్యతరాపేక్షత్వము ప్రకటింపఁబడుచున్నదో యా కారణమువలనను. (ఇందు సముత్థానాదివాక్యము ముక్తవిషయము; "యత్ర సుప్త" ఇత్యాదివాక్యము సుషుప్తవిషయము నని యెఱుంగునది.) ఎట ముక్తున కనేక శరీరాద్యావేశరూప మైన యైశ్వర్యము చెప్పఁబడుచున్నదో యది స్వర్గాదికమువలె సుషుప్తికైవల్యములకంటె విలక్షణమైన సగుణ విద్యావిపాకస్థానము. కాఁబట్టి = భిన్న విషయము లగుటవలన దాని కసంభవదోషము లేదు.

ఇది వ్యస్తాధికరణము

## జగద్వ్యాపారవర్జాధికరణము. ౮

సూ. జగద్వ్యాపారవర్జం ప్రకరణాద సన్నిహితత్వాచ్చ. ౧౭

ప. జగద్వ్యాపారవర్జం - ప్రకరణాత్ - అసన్నిహితత్వాత్ - చ.

అ. మనసుతోఁ గూడ నెవఁ డీశ్వరసాయుజ్యముం బొందుచున్నాఁడో వానికి జగత్సృష్ట్యాది వ్యాపారమును వినాగ నితర మగు నణిమాద్యైశ్వర్యము కలుగును. ఆతఁ డటఁ బ్రకృతుఁ డగుటవలన నితరులు సన్నిహితులు కాకపోవుట వలనను సృష్ట్యాదివ్యాపారము నిత్యసిద్ధుఁ డగు నీశ్వరునకే కలదు.

భా. ఎవరు సగుణబ్రహ్మోపాసనమువలన మనసుతోఁగూడనే యీశ్వర సాయుజ్యమును బొందుచున్నారో వారికి నిరవగ్రహమగు నైశ్వర్యము కలుగుచున్నదా? పక్షాంతరమున సావగ్రహమగు నైశ్వర్యము సంభవించుచున్నదా? యని సంశయము కలుగుచున్నది. ఏమి ప్రాప్తమయ్యెను? "[1]ఆప్నోతి స్వారాజ్యం, [2]సర్వేఽస్మైదేవా బలి మావహంతి,

---

౧. తై. ౧. ౬. (వ్యాహృతిశరీరుఁ డగు హిరణ్యగర్భు నుపాసించిన వాఁడు హిరణ్యగర్భున కంగభూతులు, వ్యాహృత్యాత్మకులు నగు నగ్న్యాదులం దాత్మభావమున నుండి బ్రహ్మభూతుఁ డయి) స్వారాజ్యం = స్వారాజ్యభవమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు. తానే యధిపతి యగుచున్నాఁ డని యర్థము.

౨. తై. ౧. ౫ సర్వే - దేవాః=(వ్యాహృతిశరీరుఁ డగు) హిరణ్య

తేషాంసర్వేషులోకేషుకామచారో భవతి" యనునవి మొదలగు శ్రుతులవలన వీరికి నిరంకుశమైన యైశ్వర్యము ప్రాప్తింపనర్హమగుచున్నది. ఇట్లు ప్రాప్తించినది కాఁగా నీసూత్రముం బఠించుచున్నాఁడు. జగద్వ్యాపారవర్జం=ముక్తులకు జగత్సృష్ట్యాదివ్యాపారమును విడిచి మఱియొకటి యగు నణిమాద్యైశ్వర్యము కానర్హమగుచున్నది. జగద్వ్యాపారము నిత్యసిద్ధుఁడగు నీశ్వరునకే సంభవించుచున్నది. ఏకారణమువలనను? ప్రకరణాత్ - అసన్నిహితత్వాత్ - చ= అతఁడటఁ బ్రకృతుఁడగుటవలన నితరులు సన్నిహితులు కాకపోవుటవలనను పరమేశ్వరుం బ్రస్తావించియే జగదుత్పత్త్యాద్యుపదేశమువలనను (సృష్టి) శబ్దైకసమధిగమ్యమగుటవలనను జగద్వ్యాపారమునఁ బరుఁడగు నీశ్వరుఁడే యధికృతుఁడు గదా! అతని యన్వేషణ విజిజ్ఞాసనపూర్వకముగా నాదిమంత మగు నైశ్వర్యము "తేషాంసర్వేషు లోకేషు కామచారోభవతీ" త్యాది శ్రుతులవలన ముక్తులకు వినఁబడుచున్నది. ఆకారణముచే

---

గన్ధర్వ కింగభూతు లగు వగ్న్యాదిదేవత లందఱును, (స్వారాజ్యప్రాప్తి యగుచుండఁగాను) అస్మై=ఈ హిరణ్యగర్భోపాసకునికొఱకు, బలిం=పూజను, ఆవహంతి = చేయుచున్నారు.

౧. ఛాం. ౮. ౨౫. ౨. (ఎవనికిఁ గ్రిందు చెల్ల కామ్యవస్తునిరపేక్షముగ నాత్మనిమిత్తముగానే యగుచున్నవో యట్టి విద్వాంసుఁడు జీవించియుండఁగనే స్వారాజ్యమును నభిషిక్తుఁడగు. మృతుఁడయినను స్వారాట్టే యగును. కనుకనే,) తేషాం=అట్టివారికి, సర్వేషు - లోకేషు= ఎల్లలోకములందును, కామచారః = స్వేచ్ఛానుసారముగా సంచారము, భవతి=అగును.

జగద్వ్యాపారమున వారు సన్నిహితులు కారు. (సృష్టికిం దరువాతివా రగుముక్తులు సృష్టికాలమున లేరు గావునను బూర్వకల్పమున నున్న సిద్ధు లాప్రలయముననే ముక్తు లగుట వలనను వారికి సృష్ట్యాదికము సంభవింప దని యర్థము) మఱియు వీరు సమనస్కు లగుటవల ననే యైకమత్యము లేనియపు డొకనికి స్థిత్యభిప్రాయము నింకొకనికి సంహారాభిప్రాయమును గలుగు నను నీవిరోధము నొకానొకప్పుడు సంభవింపవచ్చును. ఒకని సంకల్పము నను సరించి యితరుల సంకల్ప ముండుటవలన నవిరోధము సమ ర్థింపఁబడునేని దానికంటె నితరులకు నిత్యసిద్ధపరమేశ్వరా కూతతంత్రత్వమే యుక్త మని యంగీకర్తవ్యము.

సూ. ప్రత్యక్షోపదేశాదితిచే న్నాధికారికమండలస్థోక్తేః ౧౮

ప. ప్రత్యక్షోపదేశాత్ - ఇతి-చేత్ - న- ఆధికారిక మండలస్థోక్తేః.

అ. శ్రుతి ముక్తుఁడు స్వారాజ్యమును బొందుచున్నాఁ డని యుపదేశించుటవలన ముక్తునైశ్వర్యము నిరంకుశ మనిన నిట సూర్యమండలాంతర్గతుఁ డగు నీశ్వరుని ప్రాప్తిం జెప్పుట వలన నట్లనరాదు.

భా. తరువాతను, "ప్రత్యక్షోపదేశాత్ - ఇతి - చేత్ - "ఆప్నోతి స్వారాజ్య" మిత్యాది శ్రుత్యుపదేశము

వలన విద్వాంసులకు నిరవగ్రహ మగు నైశ్వర్యమే న్యాయ్య మని యెద్ది చెప్పంబడినదో యది పరిహర్తవ్యము, ఆధికారిక మండలస్థోక్తేః=ఈస్వారాజ్యప్రాప్తి యాదిత్యాదుల నయ్యాయధి కారముల నియోగించువాఁడును సూర్యమండలాదులగు విశేషాయతనముల నుండువాఁడు నగు పరమేశ్వరుఁ డెవ్వఁడో తదాయత్తమే యని చెప్పఁబడుచున్నది. కాఁబట్టి న=ఇది దోష మనరాదు. కారణ మెద్ది? తరువాతను "ఆప్నోతిమనసస్పతిమ్" మని చెప్పుచున్నది. ఎవఁడు సర్వమనములకుం బతియుఁ బూర్వ సిద్ధుఁడునగు నీశ్వరుఁడో యతనిం బొందుచున్నాఁ డని దీనిచేఁ చెప్పఁబడినది యగుచున్నది. తదనుసారముగానే తరువాతను "వాక్పతి శ్చక్షుష్పతి శ్శ్రోత్రపతి ర్విజ్ఞానపతిశ్చ భవతి" యని[1] చెప్పుచున్నది. ఇట్లే వేఱుచోట్లనును (కామచారాది వాక్య ములందును) యథాసంభవముగా నితరులకొక్క నైశ్వర్య ము నిత్యసిద్ధేశ్వరాయత్తమే యని తెలియవలెను.

సూ. వికారావర్తిచ తథాహి స్థితి మాహ. ౧౯

ప. వికారావర్తి - చ - తథాహి - స్థితిం - ఆహ.

---

౧. తై. ౧. ౬. (అట్లీశ్వరుం బొందిన యుపాసకుఁడు) వాక్పతిః= ఎల్లవాక్యములకుఁ బ్రభువు - భవతి = అగుచున్నాఁడు. (అట్లే) చక్షుష్పతిః - శ్రోత్రపతిః - విజ్ఞానపతిః - భవతి = ఎల్ల చక్షువులకు, శ్రవణేంద్రియములకును, విజ్ఞానములకును బ్రభు వగుచున్నాఁడు. సర్వాత్మకుఁ డగుట వలన నెల్లప్రాణులకరణములచేతను దద్వంతుఁ డగుచున్నాఁ డని యర్థము.

అ. పరమేశ్వరున కుభయవిధ మగు స్థితి నామ్నా యము చెప్పుచున్నది కాఁబట్టి వికారమునం దుండని (నిర్గుణ) రూపము నతనికిఁ గలదు.

భా. వికారావర్తిచ = పారమేశ్వర మగు రూపము కేవల వికారగోచర మగు సవితృమండలాద్యధిష్ఠానమే కాక నిత్యముక్తము వికారములందుండనిదియు (నిర్గుణము)ఁ గలదు. తథాహి - స్థితిం = అట్లే కదా పరమేశ్వరునకు ద్విరూప మగు స్థితిని, "తావానస్యమహిమా, తతోజ్యాయాంశ్చ పురుషః, పాదోస్యసర్వాభూతాని, త్రిపాదస్యామృతందివి" త్యాద్యా మ్నాయము ఆహ = చెప్పుచున్నది. మఱియు నితరాలం బనుల (సగుణోపాసకుల) తత్క్రతువు లగుటవలన నా నిర్వి కారరూపముం బొందుదు రని చెప్ప శక్యముగాదు. కాఁబట్టి వా రెట్లు ద్విరూపుఁ డగు పరమేశ్వరునందు నిర్గుణరూపముం బొందక సగుణరూపమందే నిలుతురో యట్లే సగుణమందు నిరవగ్రహ మగు నైశ్వరముం బొందఁజాలక సావగ్రహము నందే నిలుతు రని యెఱుంగునది.

సూ. దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే. ౨౦

ప. దర్శయతః - చ - ఏవం - ప్రత్యక్షానుమానే.

---

౧. ఛాం. 3. ౧౨. ౬. మొదటి యధ్యాయము ౧౬४-వ పుటలో దీనియర్థము వ్రాయఁబడె.

* అ. పర మగు జ్యోతిస్సునకు (బ్రహ్మమునకు) వికారావర్తిత్వమును = (నిర్గుణత్వమును) శ్రుతిస్మృతులు చూపుచున్నవి.

భా. పరమగుజ్యోతికి వికారావర్తిత్వము (వికారము లందుండని రూపము=నిర్గుణత్వము)ను, "నతత్ర సూర్యో భాతి నచంద్ర తారకం, నేమా విద్యుతో భాంతికుతో యమగ్ని" యని యును "నతద్భాస యతే సూర్యో నశశాంకో నపావక" యని యును - ప్రత్యక్షానుమానే = శ్రుతిస్మృతులు దర్శయతశ్చ, చూపుచున్నవియు. కనుక నీప్రకారముగాఁ బరమగు జ్యోతికి వికారావర్తిత్వము ప్రసిద్ధ మని యభిప్రాయము.

సూ. భోగమాత్రసామ్యలింగా చ్చ. ౨౧

ప. భోగమాత్ర సామ్యలింగాత్ - చ.

అ. ముక్తుల కనాదిసిద్ధుఁడగు నీశ్వరునితో భోగమాత్ర సామాన్యము వినంబడుచున్నది యను లింగమువలనను నిరంకుశమైన యైశ్వర్యము లేదు.

భా. భోగమాత్ర సామ్యలింగాచ్చ=ఏకారణము వలన వికారాలంబను (సగుణోపాసకు) ల కనాదిసిద్ధుఁడగు నీశ్వరునితో భోగమాత్రము సమానమని వినంబడుచున్నదో

---

* ౧. సూ. ౨. ౨. ౧౧. అ ౧. ౩౭౨ పుటలో వ్యాఖ్యాతము.

౨. భగ. అ ౧౫. ౬. అ ౧. ౩౭౮ పుటలో దీనియర్థము వ్రాయఁబడె.

యాయీ కారణమువలనను వీరిదైశ్వర్యము నిరంకుశముగాదు. "తమాహాపో[1] వై ఖలు మీయంతే లోకోఽసా సయత్వై తాం దేవతాం సర్వాణి భూతాన్యవం త్యేవం హై[2]వంవిదం సర్వాణి భూతాన్యవంతి తేనో యేతస్యై దేవతాయై[3] సాయుజ్యం సలోకతాంజయతి" మొదలగు భేదవ్యపదేశ లింగములవలన (నిత్యసిద్ధుఁడగు నీశ్వరునితో భోగమాత్రమున ముక్తులకు సామ్యముకలదు గాని జగద్వ్యాపారమున సామ్యములేదు.)

అవ. అయ్యా ! యిట్లగుచు నుండగా వీరిదైశ్వర్యము సాతిశయ మగుటవలన దాని కంతవత్త్వము ప్రసక్తించును. అట్లగుటవలన నావృత్తి ప్రసక్తించు నంఁగా భగవంతుఁ డగు బాదరాయణాచార్యుఁ డుత్తరముం బఠించుచున్నాఁడు.

---

౧. కౌ. ౧. ౬. (హిరణ్యగర్భుఁడు) అపః = అమృతమయము లగు నుదకములు, మీయంతే= నాచే ననుభవింపఁబడుచున్నవి; (నీకును) అసా- లోకః = ఈ యమృతోదకరూప మగు భోగ్యమే (కలదు గాఁబట్టి యనుభవింపు మని) తం=తనలోకమునకు వచ్చిన యుపాసకునిని, ఆహ=(అనునయ పూర్వకముగాఁ) జెప్పుచున్నాఁడు. (ఉపనిషత్పుస్తకములో నీశ్రుతికి వేఱు పాఠము గాన్పించుచున్నది గాని యర్థభేదము మిక్కిలి లేదు.)

౨. బృ. ౩. ౫. ౨౦. స యథా=భోగమాత్రసామ్యమున దృష్టాంత మెట్లన్నఁ జెప్పఁబడుచున్నది. సర్వాణి - భూతాని = ఎల్లజంతువులును, యథా =ఎట్లు, ఏతాం- దేవతాం= ఈ దేవతను, అవంతి= సేవించుచున్నవో, ఏవం=ఇట్లే, సర్వాణి-భూతాని=ఎల్ల జంతువులును, ఏవం-విదం=ఈ దేవత ని ట్లుపాసించువానిని, అవంతి-హ=భజించుచుండు నని చెప్పుదురు.

౩. బృ. ౫. ౨౩. తేన-ఉ=ప్రాణవ్రతధారణముచేతనును, ఏతస్యై- దేవతాయై= ఈ దేవతయొక్కయే, సాయుజ్యం=ఏకాత్మత్వమును, సలోకతాం-హ-ఉ =ఏకస్థానత్వమును, జయతి=పొందుచున్నాఁడు.

(ఇట భగవచ్ఛబ్దముచే సూత్రకారులకు సర్వజ్ఞత్వము మొదలగునదియు, నాచార్యశబ్దముచే సూత్రద్వారమున శిష్యులను సదాచారమున నిల్పుటయు బాదరాయణపదముచే బదరికాశ్రమవాసోక్తిచే నిత్యసర్వజ్ఞుఁడుఁ బరమగురువు నగు నారాయణుని ప్రసాదమువలనఁ దత్ప్రణీతశాస్త్రమునకు నిరవద్యత్వమును గల దని భాష్యకారులు సూచించిరి.)

సూ. అనావృత్తి శ్శబ్దా దనావృత్తిశ్శబ్దాత్. ౨౨

ప. అనావృత్తిః-శబ్దాత్-అనావృత్తిః-శబ్దాత్.

అ. అర్చిరాదిమార్గమున బ్రహ్మలోకముం బొందినవారు "నచ పునరావర్తతే" మొదలగు శబ్దములవలనఁ జంద్రమండలమునుండి వలె నటనుండి భోగానంతరమున మరలిరారు.

భా. "అరశ్చ హవై ణ్యశ్చార్ణవౌ బ్రహ్మలోకే తృతీ[1]

---

౧. ఛా. ౮. ౫. ౩. ఇతః-తృతీయస్యాం-దివి=ఈ భూలోకమునుండి లెక్కింపఁగా మూఁడవది యగు (భూలోకమునకు నంతరిక్షలోకమునకుం దరువాత నున్నది యగు)దివియందు (నే బ్రహ్మలోకము గలదో) తత్-బ్రహ్మలోకే=ఆబ్రహ్మలోకమునను, అరశ్చ-ణ్యశ్చ-హ-వై = అరము ణ్యము నను ప్రసిద్ధనామములుగల, అర్ణవౌ=సముద్రసదృశము లగు (సుధాహ్రదములు గలవు.) మఱియును, తత్-తత్ర=ఆ లోకమునను, ఐరం-మదీయం-సరః=అన్నమయమును హర్షకరము నగు కొలను (గలదు.) తత్=అటనే, సోమసవనః = అమృతవర్షి యగు, అశ్వత్థః = పిప్పలవృక్షమును (గలదు.) తత్ = ఆ లోకమునందే, బ్రహ్మణః=హిరణ్యగర్భునియొక్క, అపరాజితా-పూః=కర్మజ్ఞానశూన్యులకు దుష్ప్రాపమగు పురము (గలదు.) తత్ = ఆ పట్టనమునను, ప్రభువిమితం = హిరణ్యగర్భునిచే నిర్మింపఁబడిన, హిరణ్మయం = స్వర్ణవికారభూతమైన- (మండపము గలదు.)

యస్యామితో దివి యస్మిన్నైరం మదీయం సరస్తదశ్వత్థస్సోమ సవనస్త దపరాజితా పూర్బ్రహ్మణః ప్రభువిమితం హిరణ్మ యమ్" మ్మను శాస్త్రమునఁ జెప్పబడిన విశేషణములు గలదియు మంత్రార్థవాదాది ప్రదేశముల ననేకప్రకారముల వర్ణింపఁ బడినదియు నగు నేబ్రహ్మలోకము గలదో దానిని నాడీరశ్మి సమన్వితము నర్చిరాదిపర్వములు గలదియు నగు దేవయాన మార్గమున, నే విద్వాంసులు బొందుదురో వారికిన్ - అనావృత్తిః=పునరావృత్తియొక్క యభావము కలుగును=బ్రహ్మ లోకమును బొందిన విద్వాంసులు చంద్రలోకమునుండి వలె భోగముల ననుభవించి (జన్మింప) మరలి రా రని యర్థము. దేనివలనను? శబ్దాత్ = శబ్దేభ్యః - "తయోర్ధ్వమాయన్న మృతత్వమేతి. తేషాం(ఇహ) నపునరావృత్తిః, ఏతేన ప్రతిపద్య

౧. ఛా. ౬. ౧౬. (హృదయమున నూటొక నాడులు గలవు. వానిలో సుషుమ్న యనునది యొకటి బ్రహ్మరంధ్రమువఱకు వ్యాపించియుండును.) తయా=ఆ నాడిచేతను, ఊర్ధ్వం-ఆయన్ = మీఁదికిఁ బోవుచున్నవాఁడు, (సూర్యద్వారమునను) అమృతత్వం=ఆపేక్షిక మగు నమృతత్వమును, (అమరణధర్మత్వమును) ఏతి=పొందుచున్నాఁడు. 'ఆభూతసంప్లవం స్థాన మమృతత్వం హి భాష్యతే' యను స్మృతివలనఁ బ్రలయమువఱకు హిరణ్యగర్భలోకమున నుండుటయే యాపేక్షిక మగు నమృతత్వము. అంతవఱకు నటనుండి యట నున్న నిరుపమానభోగముల ననుభవించి యాహిరణ్యగర్భునితోఁ గాలాంతరమున ముఖ్య మగు నమృతత్వమును బొందుచున్నాఁ డనియుని యర్థము.

౨. బృ. ౬. ౨. ౧౫. తేషాం = అర్చిరాదిమార్గమున హిరణ్యగర్భలోకమునకుఁ బోయినవారికిన్, ఇహ = ఈ కల్పమునను, పునరావృత్తిః=తిరిగి యాగమనము, న=లేదు. వారు మరల నీకల్పమున జన్మింప రని యర్థము. (దీనివలన వేఱొకకల్పమున జన్మింతు రని తోఁచును.)

మానా[1] ఇమంమానవ మావర్తం నావర్తంతే, బ్రహ్మలోక మభిసంపద్యతే[2] నచ పునరావర్తతే, యనునవి మొదలగు శబ్దములవలనను. (సగుణబ్రహ్మలోకము నొందిన) వారికైశ్వర్య మంతవంతమైన ననావృత్తి యెట్లగునో యట్లు 'కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతఃపర' మను సూత్రముకడ వర్ణింపఁబడినది. (పరికింపఁగాను "ఇహ, ఇమ" మను శబ్దములవలన నీకల్పమున బ్రహ్మలోకముం బొందినవారికి వేఱొక కల్పమున నావృత్తి భాసిల్లుచున్నది; అయినను నీశ్వరోపాసనతో వినాఁగ బంచాగ్నివిద్యాఽశ్వమేధదృఢబ్రహ్మచర్యాది సాధనములచే నెవ్వరు బ్రహ్మలోకమునకుఁ బోయిరో వారికిఁ దత్త్వజ్ఞాన నియమాభావమువలన నావృత్తి యగు ననియు నెవ్వరు దహరాద్యుపాస్తిచే బ్రహ్మలోకముం బొందిరో వారికి సగుణవిద్యాఫలము క్షయించినను నిరవగ్రహేశ్వరానుగ్రహాలబ్ధాత్మజ్ఞానమువలన ముక్తినియమము కలదని

---

౧. ఛా. ౪. ౧౫. ౬. ఏతేన=ఈ దేవయానమార్గముచేతను, ప్రతిపద్యమానాః=బ్రహ్మలోకముం బొందినవారు, ఇమం-మానవం-ఆవర్తం=ఈ మనుష్యసృష్టిలక్షణ మగుసంసారమును, నావర్తంతే=పొంద రని యర్థము. (దీనిచే మఱియొకకల్పమున జన్మము సూచింపఁబడె.)

౨. ఛా. ౮. ౧౫. ౧. (ఇట్లు గృహస్థధర్మమును జక్కఁగ నడిపిన వాఁడు) బ్రహ్మలోకం = హిరణ్యగర్భలోకమును, అభిసంపద్యతే = (దేహపాతానంతరము) పొందుచున్నాఁడు, న-చ-పునరావర్తతే= దేహగ్రహణము కొఱకు మరలి రాఁడును.

యుఁ దలఁచి యిట్లు చెప్పఁబడియె.) మఱియు సమ్యగ్దర్శన
విధ్వస్తతమస్కులు నిత్యనిర్వాణపరాయణులు నగు (నిర్గుణ
బ్రహ్మవిదు లయిన) వారి కనావృత్తి సిద్ధము. సగుణబ్రహ్మ
విదులకు నిర్గుణ బ్రహ్మవిదాశ్రయణము ననేకదా యనావృత్తి
సిద్ధించును. సగుణబ్రహ్మవిదుల కావృత్తి ప్రాప్తింపఁగా
సమ్యగ్దర్శనాశ్రయణముననే యనావృత్తి సాధింపఁబడినది
యగుటవలన స్వయముగానే సమ్యగ్దర్శను లగువారి కావృత్తి
శంక లేదని యేమి చెప్పవలయు నని యర్థము. శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమద్గోవిందభగవత్పూజ్య
పాదశిష్య శ్రీమచ్ఛంకరభగవత్పూజ్యపాదకృతి యగు
శారీరకమీమాంసాభాష్య చతుర్థాధ్యాయ
చతుర్థపాదాంధ్రీకరణము

నత్వా సూత్రప్రణేతారం భాష్యకారం గురూనపి
పురాణపండవంశ్యోఽహం భద్రయార్యతనూభవః
మల్లయాఖ్యస్సూత్రభాష్యం దేశభాషావిదాం ముదే
అకార్ష మాంధ్రభాషాయాం శ్రీమత్సూర్యనృపాజ్ఞయా
అజ్ఞానాద్వా ప్రమాదాద్వా దోషాఅత్రపరిష్కృతాః
సంతుమాత్సర్యముత్సార్య దోషజ్ఞాః క్షంతుమర్హథ
శ్రీమద్రావుకులాబ్ధీందుం సకుటుంబం సబాంధవం
శ్రీసూర్యరాయభూపాలం పాయా త్సర్వేశ్వర స్సదా.

# విజ్ఞాపనము

విద్వాంసులార !

అధ్యాసగ్రంథము శాస్త్రారంభమునను సంగీతము; కాని యిది తెలుఁగుభాషలో సుబోధముగ వ్రాయుట మున్నాధమని తలఁచి మిక్కిలి సంగ్రహముగా నుపోద్ఘాతమును వ్రాసితిని. తరువాతఁ గొంద ఱభియుక్తులు నా వృత్తాంతము విన్న వింత సాధ్యమగునట్లు గ్రంథమంతయుఁ బూర్ణముగ వ్రాయుటయే యుక్తమని సెలవిచ్చుటం జేసి యిటుఁ బొందుపఱచితిని; కాబట్టి నాయం దనుగ్రహించి యీ భాగమును మొదటనే చేర్చి పఠింపవలయునని వందనపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాను. మఱియొకసారి యుచ్చిత్రించు భాగ్యము నేఁ జూచితినేని ముద్రింపవలయుచోటనే ముద్రించునట్లు చేయుదునని విన్నవించుచున్నాను.

ఇట్లు,

విన్నవించు విధేయుఁడు,

పురాణపండ మల్లయ్యశాస్త్రి.

గురుభ్యో నమః

అవిఘ్న మస్తు.

# అధ్యాసగ్రంథము

---

(ఈ క్రింది గ్రంథమును అ ౧-పాదము ౧౮ పుటలో ౧౫ వ పంక్తి తరువాతఁ జేర్చి పఠించునది.)

ఇట్టఁ బూర్వపక్షమున బంధము సత్యమగుటచే జ్ఞానము వలన నివర్తిల్లమింజేసి ముక్తి యుపాయాంతరసాధ్య మని ఫలము, సిద్ధాంతమున జ్ఞానమువలననే ముక్తి యని ఫలము. బ్రహ్మసూత్రముల వ్యాఖ్యానింపం దలంచిన భగవంతులగు భాష్యకారు లిదియంతయు మనమున నిడుకొని సూత్రముచే విచారకర్తవ్యతారూప మగు శ్రౌతార్థానుపపత్తిచే నర్థమువలన సూత్రిత మగు విషయప్రయోజనవత్త్వ ముపోద్ఘాత మగుటవలనఁ దత్సిద్ధిహేతు వగు నధ్యాసమును "యుష్మదస్మత్ప్రత్యయగోచరయో రిత్యాది" గ్రంథమున నాక్షేపసమాధానములతో మొదట వర్ణించుచున్నారు. ఇట్లనుటచే నార్థికార్థస్పృష్టి యగుటంజేసి యధ్యాసగ్రంథము సూత్రార్థాస్పృష్టి యగుటవలన భాష్యము కాదను నిది నిరసింపఁబడినది. మఱియు మంగళాచరణాభావమువలన నీ భాష్యము వ్యాఖ్యే

యము కాదను నీ దోషము సహితము "సుతరా మితరేతర భావానుపపత్తి" రిత్యంత భాష్య రచనార్థము తదర్థమును సర్వోపప్లవరహితమును విజ్ఞానఘనము నగు ప్రత్యగర్థమైన తత్త్వము స్మృతి మగుటవలన నిరసింపఁబడినది. కాఁబట్టి నిర్దుష్ట మగుటవలన నీ భాష్యము వ్యాఖ్యేయము. లోకమున నిది రజత మను భ్రమము సత్యరజతమున నిది రజత మని యధిష్ఠానసామాన్యారోప్యవిశేషముల కైక్యప్రమాహితసంస్కారజన్యమై చూడఁబడుచున్నది; కాఁబట్టి యాత్మనంద నాత్మాహంకారాధ్యాసము గలుగుచుండఁగా నట్టి ప్రమయ వశ్యము కావలెను. అది యాత్మానాత్మలకు వాస్తవైక్యము నపేక్షించును గాని యది సంభవింపదు; అది యెట్లన్నం బ్రతిపాదింపఁబడుచున్నది. ఆత్మానాత్మ లైక్యశూన్యములు, పరస్పరైక్యాయోగ్యము లగుటవలనను, దమఃప్రకాశములు వలె నని తలఁచి హేతుభూత మగు విరోధమును స్వరూపమునను బ్రతీతివలనను వ్యవహారమువలనను సాధించుచున్నారు. యుష్మదస్మత్ప్రత్యయగోచరములు - విషయవిషయులు - దమః ప్రకాశములువోలె విరుద్ధ స్వభావములు నగు నాత్మానాత్మల కితరేతరభావానుపపత్తి గలుగు చుండఁగా (ఇట యుష్మత్పదముచే యుష్మచ్ఛబ్దజన్య ప్రత్యయయోగ్య మగు పరాగర్థము లక్షణచే బోధింపఁబడుచున్నది. అస్మత్పదముచే

లక్షణచేతనే యస్మచ్ఛబ్దజన్య ప్రత్యయ యోగ్య మగు ప్రత్యగాత్మ చెప్పఁబడు చున్నది. కాఁబట్టి యీ శబ్దములచే నాత్మానాత్మలకు (వస్తుతః)= స్వరూపమువలన విరోధము చెప్పఁబడినది. ప్రత్యయపదము " ప్రతీయతే-ఇతి=ప్రత్యయ యను వ్యుత్పత్తిచే దృశ్యముగా భాసిల్లు ననాత్మయగు నహంకారాదికమును-ప్రతీతత్వాత్ ప్రత్యయ యను వ్యుత్పత్తిచే స్వప్రకాశమగు నాత్మను బోధించును గాఁబట్టి దీనిచేఁ బ్రతీతి వలని విరోధము చెప్పఁబడినది. గోచరపదము యుష్మదర్థ మగు నహంకారాదికము ప్రత్యగాత్మ తిరస్కార పూర్వకముగా (కర్తాహమిత్యాది)=నేను గర్త ననునది మొదలగు వ్యవహార గోచరము నస్మదర్థమగు నాత్మ ప్రవిలాపమున (అహం బ్రహ్మాస్మి) నేను బ్రహ్మము నను వ్యవహార గోచరము నని బోధించుఁ గాన దీనిచే వ్యవహారమువలని విరోధ ముక్తము. ఇట్లు ముప్విధముల విరుద్ధస్వభావము గల యాంత్మానాత్మల కితరేతరభావము=అత్యంతాభేదముగాని తాదాత్మ్యముకాని-సిద్ధింపని దగుచునుండఁగా)( దద్ధర్మములకు=ఆత్మానాత్మధర్మము లగు చైతన్య సుఖజాడ్య దుఃఖాదులకు బొత్తిగా నితరేతర భావానుపపత్తి = ఇతర = ధర్మ్యంతరమునందు—ఇతర భావ-వేఱు ధర్మముల కనుపపత్తి వలన నస్మత్ప్రత్యయగోచరము విషయియుఁ జిదాత్మకము నగు నాత్మునందు యుష్మ

త్రప్రత్యయగోచరము విషయమునగు ననాత్మనకును దద్ధర్మ
ములకు నధ్యాసముగాని తద్విపర్యయమున (=చైతన్యస్వరూ
పముచే) విషయికి (=బుధ్ధ్యాదిసాక్షికి)ఁ దద్ధర్మములకును విష
యము=(అహంకారము) నందు నధ్యాసముగాని మిథ్యయనుట
యుక్తము. ఇట్లాత్మానాత్మలు ప్రత్యక్కు పరాక్కు, చిత్తు
నచిత్తు, గ్రాహ్యము గ్రాహకము నగుటచేత విరోధమువలనఁ
దమఃప్రకాశములకువలె వానికి నైక్యముగాని తాదాత్మ్యము
గాని సంభవింపని దగుచునుండఁగా ధర్మసంసర్గమునకు బొత్తిగ
ననుపపత్తివలన (అసంగాత్మ ధర్మికి దేనితోడను సంసర్గము
లేమి వలన ధర్మి సంసర్గపూర్వకమైన ధర్మసంసర్గమునకు నుప
పత్తి లేశమైనను లేమివలన)ఁ దత్ప్రమాభావముచే హేతు
వగు ప్రమాజన్యసంస్కారము లేదు గనుక సామగ్ర్యభావము
వలన నధ్యాసము మిథ్యయనుట యుక్తమని యర్థము. నిర
వయవ నిర్గుణ స్వప్రకాశాత్మనందు గుణావయవ సాదృశ్య
మునకుఁ గాని యజ్ఞానమునకుఁ గాని యసంబంధమువలనఁ
బూర్వ ప్రమాహిత సంస్కారము గాని సాదృశ్యము గాని
యజ్ఞానము గాని సంభవింపదుగదా! మిథ్యాశబ్దమునకు నని
ర్వచనీయత్వము నపహ్నవము నని రెండర్థములు కలవు గాని
యిట నపహ్నవమే గ్రహింపఁబడుచున్నది. ఎట దేని యధ్యాస
మపహ్నవింపఁబడు ననిన నాత్మనం దనాత్మతద్ధర్మములకు

ననాత్మయం దాత్మతద్ధర్మములకు నధ్యాస మపహ్నవింపఁ
బడుచున్నది. అట్లగుచు నుండఁగా బంధము సత్యము కాఁబట్టి
జ్ఞానమువలన నివృత్తిరూపఫలాభావమువలనను బద్ధముక్తు లగు
జీవబ్రహ్మముల కైక్యాయోగమువలన విషయాసంభవమువల
నను శాస్త్ర మనారంభణీయ మని పూర్వపక్ష భాష్యతాత్ప
ర్యము.

ఇట్టి యుక్తిగ్రహణమువలన, బూర్వపక్షమునకు దౌర్బ
ల్యము సూచింపఁబడెను. అది యెట్లన్నఁ బ్రతిపాదింపఁబడు
చున్నది. అధ్యాసమునకు నాస్తిత్వ మయుక్త మగుటవలనో
యభావమువలననో కారణాభావమువలననో పూర్వవాది చెప్ప
వలయును? మొదటిపక్షము సరి యెట్లనఁగా నధ్యాస
మున కసంగస్వప్రకాశాత్మునం దయుక్తత్వ మలంకారము
గాని దోషము గాదు. (అజ్ఞః, కర్తా, మనుష్యోఽహమితి) నేనజ్ఞుఁ
డను కర్తను మనుష్యుఁడ నని ప్రత్యక్షానుభవమువలన నధ్యా
సమున కభావ మసిద్ధము. అపౌరుషేయ మగుటచే నిర్దోషము
నుపక్రమాది లింగములచే నిశ్చితతాత్పర్యమును కర్త్రాత్మ
బోధకము నగు తత్త్వమస్యాది వాక్యముచే దీనికి భ్రమత్వ
నిశ్చయమువలన నీ ప్రత్యక్షము కర్తృత్వాదికమునందుఁ
భ్రమ యని చెప్పరాదు. మనుష్యోఽహ మను ప్రత్యక్షవిరోధము
వలనను "అథాయమ శరీర" ఇత్యాదిశ్రుతిచే నాత్మాసిద్ధిం జేసి

దేహాత్మవాద ప్రసంగమువలన జ్యేష్ఠ ప్రత్యక్షవిరోధమును నా
గమజ్ఞానమునకే బాధ మనియు ననరాదు. కాఁబట్టి యిది రజత
మనునది వలె భ్రమత్వ శంకా కళంకిత మగు సామానాధి
కరణ్య ప్రత్యక్షమునకు నాగమముకంటెఁ ప్రాబల్యము లేదని
యెఱుఁగునది.

మఱియు జ్యేష్ఠత్వమనఁ బూర్వభావిత్వమా? యాగమ
జ్ఞానముఁ గూర్చి యుపజీవ్యత్వమా? యని వివేకింప వల
యును. పూర్వభావిత్వ మయ్యెనేని రజతభ్రమము మొదటిది
యయ్యుఁ దరువాతిది యగు శుక్తిజ్ఞానముచే బాధింపఁబడు
చున్నది కాఁబట్టి దానికిఁ ప్రాబల్యము లేదు. ఆగమజ్ఞానోత్పత్తి
యందుఁ బ్రత్యక్షాది మూలసృష్ట వ్యవహారసంగతి గ్రహద్వార
మునను శబ్దోపలబ్ధి ద్వారమునను ప్రత్యక్షాదులయొక్క
వ్యావహారిక ప్రామాణ్యముంగూర్చి యుపజీవ్య మైనను దాత్త్విక
ప్రామాణ్యముచే ననపేక్షిత మగుటవలనను ననపేక్షితాంశ
మున కాగమజన్యజ్ఞానముచే బాధము చెప్పినను నుపజీవ్యవిరో
ధము లేదు. అలౌకికమగుయాగమునకు శ్రుతిబలమువలనఁ గాలాం
తర భావిఫలహేతుత్వమువలె “తదావిద్వాన్ నామరూపా ద్వి
ముక్త” ఇత్యాది శ్రుతిబలమువలననే సత్య మగు బంధమునకు
జ్ఞానమువలన నివృత్తి సంభవించును గనుక నధ్యాసవర్ణనము
వ్యర్థమనున దెద్దియో యదియు జ్ఞానమాత్రమున నివర్తిల్లు దాని

కేచటను సత్యత్వము కాన్పింపమివలనను సత్యమగుదానికాత్మ
నకు వలెనే నివృత్త్యసంభవమువలన నయోగ్యతానిశ్చయము
గలుగుచుండఁగా సత్యబంధమునకు జ్ఞానమువలన నివృత్తి
శ్రుతిచే బోధకత్వాసంభవమువలనను యుక్తము కాదు. సేతు
దర్శనమువలన సత్యమగు పాపమునకు నాశదర్శనమువలన
నయోగ్యతానిశ్చయము లేదనిన నది శ్రద్ధానియమసాపేక్ష
జ్ఞాననాశ్య మగుటవలన సత్యమగు పాపము నశించినను బాధ
మునకు "నాన్యః పంథావిద్యతేయనాయ" యను శ్రుతివలనఁ
గేవల జ్ఞాననాశ్యత్వప్రతీతివలనను నట్లనరాదు.

మఱియు జ్ఞాననివర్త్యమగు బంధమునకు సత్య
త్వము నాస్తి? మాయావిద్య లొక్కటియే కావున 'మా
యాంతు ప్రకృతి' మిత్యాది శ్రుతివిరోధమువలన నజ్ఞానాజన్య
త్వము సత్యత్వ మనరాదు. జ్ఞానమువలన నివర్తిల్లు నను శ్రుతి
విరోధమువలన బ్రహ్మమునకువలె బాధాయోగ్యత్వమనియుం
జెప్పరాదు. వ్యవహారకాలమున బాధశూన్యత్వము సత్యత్వ
మనుపక్షమున సత్యత్వము వ్యావహారికమే యని యధ్యస్తత్వ
ము ప్రాప్తమైనది. అది శ్రుత్యర్థమున యోగ్యతాజ్ఞానార్థము
యాగమున కపూర్వద్వారత్వమువలె వర్ణ్యమే. అయ్యా!
యారంభణాధికరణమున నది వర్ణితము కాఁబట్టి పౌనరుక్త్యము
ప్రాప్తించు ననిన నట నుక్తమగు నర్థ్యాసమునకే యిటఁ బ్రవృ

త్త్యంగ విషయాది సిద్ధ్యర్థము స్మరింపఁబడుటవలన నాదోష
ము లేదు. లోకవ్యవహారశబ్దములచే నర్థాధ్యాసము జ్ఞానా
ధ్యాసము నను ద్వివిధ మగు నధ్యాసము చూపంబడినది.
కాఁబట్టి వర్ణించుచున్నాఁడు. జాడ్య చైతన్యాదిధర్మములకు
ధర్ము లగు నహంకారాత్మ లత్యంతభిన్నులైన నితరేతరభేద
గ్రహము లేమిచే నన్యోన్యతాదాత్మ్యమును నన్యోన్యధర్మ
ములను వ్యత్యాసముచే నధ్యసించి (ధర్మ్యధ్యాసము గలుగు
చుండఁగా ధర్మాధ్యాసము సిద్ధించుటవలన నిట "ధర్మముల"
ననునిది వ్యర్థ మనిన ధర్మ్యధ్యాసము స్ఫుటముకాకున్న
నింద్రియధర్మములగు నంధత్వాదులకును 'అంధోఽహ' మని
యధ్యాసము స్ఫుట మని జ్ఞాపనార్థమావశ్యకముగాన నట్లన
రాదు.) సత్యానృతములఁగూర్చి=(సత్యము=అనిదం చైతన్యము-
దాని కనాత్మయందు సంసర్గాధ్యాసము గాని స్వరూపాధ్యా
సము లేదు. అనృతము=యుష్మదర్థము. దాని కాత్మనందు
స్వరూపాధ్యాసము—వానిని మిథునీకరించి) "అహ మిదం
మమేద" మని లోకవ్యవహారము మిథ్యాజ్ఞాననిమిత్తము నైసర్గి
కమునై చూడంబడుచున్నది. ఇట నధ్యసించి మిథునీకరించి
లోకవ్యవహార మను పదము లేకార్థ మగుటవలనఁ బూర్వ
కాలవాచి యగు క్త్వాంతప్రయోగ మెట్లుపపన్న మనిన
నధ్యాసవ్యక్తిభేదమువలన నుపపన్న మని చెప్పుదుము. అటఁ

పూర్వపూర్వాధ్యాస ముత్తరోత్తరాధ్యాసమునకు సంస్కార
ద్వారమునఁ బూర్వకాలిక మగుటచే హేతుత్వద్యోతనార్థము
క్త్వాంత ప్రయోగము యుక్తము. నైసర్గికపదముచే నిదియే
స్పష్టపఱుపఁబడుచున్నది. ప్రత్యగాత్మనందు హేతుహేతుమ
ద్భావమున నధ్యాసప్రవాహ మనాది యని దీని యర్థము.
అయ్యా! ప్రవాహము వస్తువు కాకపోవుటవలన నధ్యాస
వ్యక్తులు సాదు లగుటవలన ననాదిత్వ మెట్లున్న నధ్యాసత్వా
వచ్ఛిన్న వ్యక్తులలో నెద్దియేనొకదానితో వినాగ ననాదికాల
మున కవర్తనము కార్యానాదిత్వమని యంగీకారమువలన నిది
దోషము కాదని చెప్పఁబడుచున్నది. ఇట్లనుటచే నైసర్గికపద
ముచే నిమిత్తమగు సంస్కారము చెప్పఁబడినది కాఁబట్టి కార
ణాభావమువలన నధ్యాసము లేదనుకల్పము నిరసింపఁబడినది.
లాఘవముచేఁ బూర్వానుభవజన్య సంస్కారమే యధ్యాస
హేతు వగుటవలనఁ బూర్వప్రమాజన్య సంస్కారమే హేతు
వని చెప్పరాదు. కనుకఁ బూర్వాధ్యాసజన్యసంస్కారము కల
దని సిద్ధము. మిథ్యాజ్ఞానపదముచే నధ్యాసమున కుపాదానము
చెప్పఁబడియెను. మిథ్యయగు నజ్ఞాన మధ్యాసమున కుపాదాన
మైనను సంస్ఫురదాత్మతత్త్వము నకావరక మగుటచేతను
నధ్యాసకర్తయగు నీశ్వరున కుపాధి యగుటచేతను సంస్కార
కర్మాది నిమిత్త రూపమునఁ బరిణమించున దగుటచేతను

నిమిత్తము సని తెలుప నిమిత్తపదము. అసంగస్వప్రకాశా త్మని యందు సంస్కారాది సామగ్ర్యభావమున నెట్ల ధ్యాసము సిద్ధించు నను దాని నిరాసార్థము మిథ్యాప దము. పక్షాంతరమున సజ్ఞానము జ్ఞానాభావము కాదని నిరసింప మిథ్యాపదము. మిథ్యాత్వము కలుగుచుండఁగా సాక్షా జ్జ్ఞాన నివర్త్యత్వ మజ్ఞానలక్షణ మని మిథ్యాజ్ఞాన శబ్దముచేఁ జెప్పంబడినది. (ఇపు డధ్యాసమును దృఢపఱుప నభిలపించు చున్నాఁడు). ఆధ్యాత్మిక కార్యాధ్యాసము లలో 'అహ' మనునది మొదటి యధ్యాసము. ఇది యజ్ఞా నోపాధికి చైతన్యమున నంతఃకరణాధ్యాసము - 'అయో దహతి' యన్నట్లు 'అహ ముపలభే' యని దృగ్దృశ్యాంశముల యుపలంభమువలన నధిష్ఠానారోప్యాంశ ద్వయానుపలంభము వలన నిది యధ్యాసము కాదనరాదు. ఇటను 'అహమిద' మను దానిచే నేను మనుష్యుఁడ నను తాదాత్మ్యాధ్యాసమును 'మమేద' మనుదానిచే నిది నాశరీర మని సంసర్గాధ్యాసమును జూపఁబడినది. సత్త్వైక్యము గలుగుచుండఁగా నన్యోన్యభేదము తాదాత్మ్యము. ఇట నేను మనుష్యుఁడ నని మైక్యాంశభాన మును 'మమేద' మనుచో భేదాంశరూపసంసర్గభావము నని భేదము. ఇట్లు సామగ్రియు ననుభవముం గలదు కాఁబట్టి బ్రహ్మాత్మైక్యమున విరోధాభావముచే విషయప్రయోజనముల

కలిమివలన శాస్త్ర మారంభణీయ మని సిద్ధాంతభాష్య
తాత్పర్యము. ఇట్లు సూత్రముచే నర్థమువలన సూచింపఁబడిన
విషయప్రయోజనములఁ బ్రతిపాదించి తద్ధేతు వగు నధ్యాస
మును లక్షణ సంభావనా ప్రమాణములచే సాధించు
చున్నారు. అధ్యాసమునకు లక్షణ మేమని 'పూర్వవాది'
యడుగు చున్నాఁడు. (ఈ శాస్త్రము నిర్ణయప్రధాన
మగుటచే వాదకథాత్వ ద్యోతనార్థ మడుగుచున్నాఁ డని
పరోక్తి — గురుశిష్యకథ — వాదము). స్మృతిరూప మగు
పరత్ర పూర్వదృష్టావభాస మధ్యాస మని (యధ్యాసలక్షణ
మును సిద్ధాంతి) చెప్పెను. ఇది సాద్యనాద్యధ్యాససామాన్య
లక్షణము. (ఇటఁ బరత్ర పరావభాస మనునదియే యధ్యాస
లక్షణము. తక్కిన రెండుపదములును తత్ప్రతిపాదనపరములు.)
అవభాసత ఇత్యవభాసయను వ్యుత్పత్తిచే నవభాసము నారజ
తాదిపదార్థము - దాని కయోగ్యమగు నధికరణము పరత్ర
పదార్థము. స్మర్యత ఇతిస్మృతి యను వ్యుత్పత్తిచే స్మృతి నా
స్మర్యమాణసత్యరజతాదికము - దానిరూపమును బోలిన రూపము
కలదిగనుక స్మృతిరూపము నాస్మర్యమాణసదృశ మని యర్థము.
ఇట్లనుటచే స్మర్యమాణమున కారోప్యమునకుంగల భేదమువలన
నన్యథా ఖ్యాతి లేదని చెప్పఁబడినది యగుచున్నది ; దృష్ట మన
దర్శనము - పూర్వదృష్టము = పూర్వదర్శనము దానివలన

సంస్కారద్వారమున నవభాసము = పూర్వదృష్టావభాసము-ఇట్లనుటచే స్మృత్యారోపములు సంస్కారజన్యము లగుట వలన సంస్కారజన్యజ్ఞానవిషయత్వము స్మర్యమాణారోప్యములకు సాదృశ్యము చెప్పంబడినది. దోషసంప్రయోగజన్యత్వము సహితము వివక్షింపఁబడినది గనుక సంస్కారమాత్రజన్యత్వము లేమిం జేసి సంస్కారజన్యత్వమువలన నారోప్యమునకు స్మృతిత్వాపత్తి లేదు. ఇట సంప్రయోగశబ్దముచే నధిష్ఠాన సామాన్యజ్ఞానము చెప్పఁబడుచున్నది. ఇట్టి దోష సంప్రయోగ సంస్కారబలమువలన శుక్త్యాదులం దుత్పన్నమగు రజతము గలదు గనుకఁ బరత్ర పరావభాసత్వలక్షణము కల దని స్మృతిరూపపూర్వపదములచేఁ బ్రతిపాదింపఁబడినది. అ ట్లెట్లన్నఁ బరత్ర పరానభాసమే లక్షణ మన్న శుక్తియందు రజతోత్పత్తికి సామగ్రి లేదు గాన సంసర్గమే లేదు. స్మర్యమాణసత్యరజతమే శుక్తియం దవభాసిల్లు ననిన నన్యథాఖ్యాతిప్రసంగ మను నాశంకను వారింప స్మృతిరూపపదము. సాదృశ్యము భేదఘటిత మగుటచే స్మర్యమాణసత్యరజతముకంటె శుక్తియం దారోపిత మైన రజతమునకు భేద ముక్తము. ఇట్లగుచు నుండఁగా నయోగ్యాధికరణమున = (శుక్త్యాదికమునఁ) బూర్వదర్శన సంస్కారమువలన స్మర్యమాణ (రజతాది) సదృశమగు రజతాద్యర్థాధ్యాస మని లక్షణము సిద్ధము.

దీనిని కొందఱు = అన్యథా ఖ్యాతివాదులు వేఱొకచో = శుక్త్యాదికమునందు వేఱొకదాని ధర్మమునకు = స్వావయవ ధర్మముగు దేశాంతరము నున్న రూప్యాదికమున కధ్యాస మని చెప్పుచున్నారు. ఆత్మ ఖ్యాతివాదులు బాహ్యశుక్త్యాదికమునందు బుద్ధిరూపాత్మధర్మ మగు రజతాది పదార్థమున కధ్యాస మని = ఆంతర మగు రజతమునకు బహిర్వ్యదవభాస మని (వెలుపల నున్నదానికి వలె నవభాస మని) చెప్పుదురు. కొందఱు = అఖ్యాతివాదులు దేనియందు దేనియధ్యాసము లోకసిద్ధమో యా వస్తువులు రెంటిగొక్కయు నాబుద్ధుల యొక్కయు భేదాగ్రహము కల్గుచుండఁగాఁ దన్మూలమగు భ్రమ మని చెప్పుచున్నారు. మఱికొందఱు = శూన్యవాదులు దేని దేని కధ్యాసమో దానికే = అధిష్ఠానమగు శుక్త్యాదికమునకే విరుద్ధ ధర్మత్వకల్పనమును = అత్యంతాసత్తగు రజతాదికముయొక్క కల్పనను జెప్పుచున్నారు. ఈ యన్ని పక్షములందును బరత్ర పరావభాసత్వలక్షణము లేక పోలేదు. అన్యథా ఖ్యాతిత్వాదివివాద మున్న నీయన్నిపక్షముల నధ్యాసము మీఁదటిలక్షణమును విడువదని యని యర్థము. శుక్తియందుఁ బ్రత్యక్ష మగు రజతమునకు దేశాంతరమునఁగాని బుద్ధియందుఁ గాని సత్త్వము సంభవింపమివలనను శూన్యత్వము గలుగుచు నుండఁగాఁ బ్రత్యక్షత్వాయోగము

వలనను శుక్తియం దున్నది యగుచు నుండఁగాఁ బాధాప్రాప్తి వలనను మిథ్యాత్వమే నిశ్చితము. (ఆరోప్యమిథ్యాత్వ మనుభవసిద్ధమగుటచే నట యుక్త్యపేక్ష లేదని చెప్పుచున్నాఁడు.) అట్లగుచు నుండఁగా శుక్తిరజతమువలె నవభాసిల్లుచున్నదనియు నొకచంద్రుఁడు సద్వితీయుఁడువలె నవభాసిల్లుచున్నాఁడనియు బాధానంతరకాలిక మగు ననుభవము లోకసిద్ధము. ఇట నిరుపాధిక మగు నాత్మునం దహంకారాధ్యాసమున మొదటిదియు నవిద్యాద్యుపాధిక మగు బ్రహ్మజీవాంతరభేదమున కధ్యాసమున రెండవదియు దృష్టాంతములు.

## ఇది లక్షణప్రకరణము

(ఎట నపరోక్షాధ్యాసాధిష్ఠానత్వమో యట నింద్రియసంయుక్తత్వము విషయత్వము నను వ్యాప్తి శుక్త్యాదికమునందు దృష్టము కాఁబట్టి శుక్త్యాదికమునం దధ్యాసము సంభవింప వచ్చును గాని యాత్మునందు వ్యాపకాభావమువలన నధ్యాసాధిష్ఠానత్వము సంభవింప దని యాక్షేపించుచున్నాఁడు.) ఎట్లవిషయమగు = ఇంద్రియాగ్రాహ్యమగు ప్రత్యగాత్మునందు విషయమగు నహంకారాదికమునకుఁ దద్ధర్మములకు నధ్యాసము సంభవించును? ఎల్లవాఁడును నెదుటనున్న విషయమున విషయాంతరము నధ్యసించుచున్నాఁడుగదా. యుష్మత్ప్రత్యయాపేత (ఇదంప్రత్యయానర్హ) మగు ప్రత్యగాత్మునకు "నచ

షుసా గృహ్యతే"యను శ్రుతి ననుసరించి యవిషయత్వమును నీవు చెప్పుచున్నావు; ఇపు డధ్యాసక్షోభమున విషయత్వము నంగీకరించితి వేని శ్రుతిసిద్ధాంతబాధ కలుగుననిన నస్మత్ప్రత్యయ విషయమగుట=(అహమనునధ్యాసమున భాసమానమగుట)వల నను నపరోక్షము గనుకఁ బ్రత్యగాత్మప్రసిద్ధివలనను బ్రత్యగాత్మ నియతముగాన విషయమే కాదు. మఱియు బాలుర (అవివేకుల) ప్రత్యక్షమే యైన యాకాశమునందుఁ దలమలినతాదుల నధ్య సించుచున్నారు కాఁబట్టి యెదుటనున్న విషయముననే విషయాం తరము నధ్యసింపవలయు నను నియమమును లేదని చెప్పఁబడు చున్నది. ఇట్లనుటచే నాత్మానాత్మలకు సాదృశ్యాభావమువలన నధ్యాసము లే దనునిది నిరసింపఁబడినది. ఇట్లు ప్రత్యగా త్మనందును నధ్యాస మవిరుద్ధము. ఇది యధ్యాససంభావనా ప్రకరణము.

అయ్యా! బ్రహ్మజ్ఞాననాశ్యముగా సూత్రిత మగు నవిద్యను విడిచి యధ్యాస మేల వర్ణింపఁబడిన దనిన నాక్షి ప్తము, సమాహితము, నుక్తలక్షణలక్షితము నగు నీయధ్యాస మునే పండితు లవిద్య యని తలంచుచున్నారు. తద్వివేకమున ( = అధ్యస్తనిషేధమున ) నధిష్ఠాన స్వరూపనిర్ధారణమును విద్య యని చెప్పుచున్నారు. ఐనను గారణ మగు నవిద్యను వదలి కార్యావిద్య యేల వర్ణింపఁబడిన దనిన నిట్లు కార్యాధ్యాస

మవిద్యాత్మక మగుచుండఁగా సుషుప్తియందు మూలావిద్య
యున్న ననర్థాభావమువలనఁ గార్యరూపముచే దాని కనర్థత్వ
జ్ఞాపనార్థము తద్వర్ణన మని చెప్పంబడె. మఱియు నిట్లధ్యాస
ముక్తన్యాయమున నవిద్యాత్మక మగుచుండఁగా నధ్యస్తకృత
ములగు గుణదోషములచే నధిష్ఠాన మణుమాత్రము స్పృశి
యింపఁబడదు. ఇట్లధ్యాసమునకు లక్షణసంభావనలఁ జెప్పి
ప్రమాణమును జెప్పుచున్నాఁడు. వర్ణితము సాక్షిప్రత్యక్ష
సిద్ధము నగు నాత్మానాత్మల యితరేతరాధ్యాసము హేతు
వుగా లౌకికముఁ గర్మశాస్త్రీయము మోక్షశాస్త్రీయము
నగు మువ్విధముల వ్యవహారము ప్రవర్తిల్లుచున్నది. అందు
విధినిషేధపరము లగు ఋగ్వేదాదులు కర్మశాస్త్రము
లును విధినిషేధశూన్యప్రత్యగ్బ్రహ్మపరము లగు వేదాం
తములు మోక్షశాస్త్రములు నని విభాగము. ఇట్లధ్యా
సము వ్యవహారహేతువుగాఁ బ్రత్యక్ష మైనను బ్రమా
ణాంతరము నడుగుచున్నాఁడు. అవిద్యావద్విషయము లగు
(నే నవిద్యావంతుఁడ నని యధ్యాసవంతుఁడగునాత్మ=ప్రమా
త) విషయ (ఆశ్రయ)ముగాఁ గల ప్రమాణములకుఁ దత్తత్ప్ర
మేయవ్యవహారహేతుభూత మగు ప్రమ యధ్యాసాత్మక
ప్రమాత్రాశ్రిత మగుటవలన నవిద్యావద్విషయత్వము ప్రత్య
క్షమే యైనను మఱి యేప్రకారమున నవిద్వద్విషయత్వ మని

యనుగుచున్నాఁడు. పక్షాంతరమున నాశ్రయదోషమువలన నప్రమాణ్యాపత్తి కాఁబట్టి యవిద్యావద్విషయములగు ప్రత్యక్షాదు లెట్లు ప్రమాణమని (పూర్వవాది) ప్రశ్నము. ప్రమాణప్రశ్నము గలుగుచు నుండఁగా వ్యవహారార్థాపత్తియుఁ దల్లింగకానుమానముఁ బ్రమాణ మని (సిద్ధాంతి చెప్పుచున్నాఁడు. దేవదత్తుని వ్యవహార మతని దేహాదులందు నేను నాది యను నధ్యాసమూలము, తదన్వయవ్యతిరేకానుసారి యగుటవలన; దేహేంద్రియాదులందు నేను నాది యను నభిమానము లేనివానికిఁ బ్రమాతృత్వానుపపత్తివలనఁ బ్రమాణప్రవృత్తి లేమిం జేసి మనుజాస్పదము లగు నింద్రియములను గ్రహించక నేను శ్రోతను ద్రష్టను మాత నను నటి మొదలగు వ్యవహారము సంభవింపదు. అధిష్ఠానమును వినాగ నింద్రియములకు వ్యాపారము సంభవింపదు. అనధ్యస్తాత్మభావము కల దేహముతో నెవఁడును వ్యాపరింపఁడు. ఇదియంతయు లేనిది యగుచు నుండఁగా నసంగుఁడగు నాత్మునకుఁ బ్రమాతృత్వము సంభవింపదు. ప్రమాతృత్వమును వినాగఁ బ్రమాణప్రవృత్తి లేదు. కనుకఁ బ్రమాతృత్వాదివ్యవహారార్థ మధ్యాసమంగీకర్తవ్యము కాఁబట్టి ప్రమాణసత్త్వమువలనఁ బ్రత్యక్షాది వ్యవహారములు శాస్త్రములును నవిద్వ ద్విషయములు నగును. (వేఱొకపక్షమునఁ బ్రమాణప్రశ్నమునకు నిట్లు సమా

ఖ్యానము చెప్పి యాక్షేపమును బరిహరించుచున్నాఁడు.)
అహ మను నధ్యాసము ప్రమాత్రంతర్గత మగుటవలన
దోషము కాదు కాఁబట్టి శాస్త్రములుఁ బ్రమాణములు నవి
ద్యావద్విషయములైనను బ్రమాణములు. ప్రమాత సిద్ధిం
పఁగాఁ దరువాత నుత్పన్నమగు కాచాదికము దోష మగు
చున్నది. కాని యవిద్య ప్రమాత్రంతర్గత మగుటవలన దేనిచేఁ
బ్రత్యక్షాదు లప్రమాణము లగునో యట్టిదోషము లేదని
భావము. అయ్యా! (విద్వాంసుల కధ్యాసము లేకున్నను
వ్యవహారము కాన్పించుటవలన వ్యవహార మధ్యాసకార్య
మనుట యుక్తము గాదనిసఁ జెప్పంబడుచున్నది.) వైదుష్య
ము నా బ్రహ్మాత్మసాక్షాత్కారమో యాత్మికమగు నాత్మా
నాత్మభేదజ్ఞానమో? పూర్వవాది చెప్పవలసియున్నది. మొదటి
పక్షమున బాధితాధ్యాసానువృత్తిచే విద్వాంసులకును వ్యవ
హారము సంభవింపవచ్చు నని సమన్వయాధికరణమునఁ
జెప్పంబడు. రెండవ పక్షమున వివేకులకును బశ్వాదులతో
నవిశేషముసలనఁ బరోక్షజ్ఞాన మపరోక్షభ్రాంతినివర్తకము
కానిం జేసి వ్యవహార మధ్యాసకార్యమనుట యుక్తము. ఎట్లు
పశ్వాదులు శబ్దాదులతో శ్రోత్రాదులకు సంబంధము కల్గుచుం
డఁగా శబ్దాదివిజ్ఞానము ప్రతికూలమైన నటనుండి నివర్తిల్లు
చున్నవియు ననుకూలమైనఁ బ్రవర్తిల్లుచున్నవియును మఱియు

నె ట్లభిముఖముగాం వచ్చు దండోద్యతకరుం డగు పురుషుం జూచి యితండు నన్నుం గొట్ట నిశ్చయించుచున్నాం డని పారిపోవ నారంభించుచున్నవో యెట్లు హరితతృణపూర్ణపాణి యగు పురుషుంజూచి యభిముఖముగాం బోవుచున్నవో యట్లే వ్యుత్పన్నచిత్తు లగు పురుషులు సయితె మాక్రోశించుచుం గ్రూరదృష్టులై ఖడ్గోద్యతకరులై యెదురువచ్చుచున్న బలవంతులగు పురుషులం జూచి వారివైపునుండి నివర్తిల్లుచున్నవారును దద్విపరీతుల కభిముఖు లగుచున్నవారును గాంబట్టి పురుషులకును ప్రమాణప్రమేయవ్యవహారము పశ్వాదులతో సమానము. పశ్వాదుల కవివేకపూర్వక మైన ప్రత్యక్షాది వ్యవహారము ప్రసిద్ధమే యైయున్నది. తత్సామాన్యదర్శనమువలన వ్యుత్పన్నచిత్తులగు పురుషులకును దత్కాలమగు = (అధ్యాసకాలికమైన) ప్రత్యక్షాది వ్యవహారము వానితో సమాన మని నిశ్చయింపంబడుచున్నది. పరికింపంగా బుద్ధిపూర్వకారి యగు పురుషుండు శాస్త్రీయవ్యవహారమునం దాత్మునకుం బరలోకసంబంధము నెఱుంగక యధికరింపంబడండు; కాని యనుపయోగము వలన నధికారమున విరోధమువలనను వేదాంతవేద్యము నశనాయాద్యతీతము నపేతబ్రహ్మక్షత్త్రాదిభేదము నగు నసంసార్యాత్మతత్త్వ మధికారమున నపేక్షింపంబడదు. అట్టి యాత్మతత్త్వజ్ఞానముకంటెం బూర్వము ప్రవర్తమానమగు శాస్త్ర మవిద్యావద్వి

షయము నతిక్రమింపదు. అది యెట్లన్నఁ బ్రతిపాదింపఁబడుచున్నది. 'బ్రాహ్మణోయజేత' మొదలగు శాస్త్ర మాత్మనందు వర్ణాశ్రమాది వయోవస్థా విశేషాధ్యాసము నాశ్రయించి ప్రవర్తిల్లుచున్నది. అధ్యాసము నాఁ నది కానిదానియం దది యను భ్రాంతి యని చెప్పితిమి. అది యెట్లన్న నాలక్షణమెట్లు స్పష్టమగుచున్నదో య ట్లుదాహరించుచున్నాను. తనదేహము కంటె వేఱుగాఁ బ్రత్యక్షులగు బాహ్యులైన పుత్త్రమిత్త్రాదులు సకలులుగాని వికలులుగాని యైన వారిధర్మములగు సాకల్య వైకల్యాదులను నేనే సకలుఁడను వికలుఁడ నని దేహవిశిష్టాత్మనం దధ్యసించుచున్నాఁడు; తద్ధర్మజ్ఞానమువలనఁ దత్తుల్యధర్మములను దనయం దారోపించుకొనుచున్నాఁ డని యర్థము. అట్లే దేహధర్మము లగు స్థౌల్యకార్శ్యాదుల నింద్రియధర్మములగు మూకత్వ కాణత్వాదులను మనోవిశిష్టాత్మనం దధ్యసించి నేను స్థూలుఁడ గౌరుఁడఁ గృశుఁడ నంధుఁడ మూకుఁడఁ గ్లీబుఁడఁ గాణుఁడ నని వ్యవహరించుచున్నాఁడు. ఇట్లే యంతఃకరణమును సాక్షియం దభేదమున నధ్యసించి తద్ధర్మములగు కామసంకల్పవిచికిత్సాధ్యవసాయాదుల నధ్యసించికొనుచున్నాఁడు. ఇట్లహం ప్రత్యయి నశేషస్వప్రచార=(మనోవృత్తి) సాక్షి యగు ప్రత్యగాత్మనం దధ్యసించి చైతన్య స్వరూపము సర్వసాక్షియు నగు నాప్రత్యగాత్మని నంతఃకరణాదులం

దధ్యసించుచున్నారు. (అట నజ్ఞానమునఁ గేవలాత్మసంసర్గా ధ్యాసమును మనసున నజ్ఞానోపహితునకును) మన ఉపహితు నకు దేహాదులందు నధ్యాస మని విశేషము. ఇట్లాత్మయందు బుద్ధ్యాద్యధ్యాసమువలనఁ గర్తృత్వ లాభమును బుద్ధ్యా దులయం దాత్మాధ్యాసమువలనఁ జైతన్యలాభమును గలు గును. ఇట్లు మిథ్యారూపమును గర్తృత్వ భోక్తృత్వ ప్రవ ర్తకము ననాదియు ననంతము నైసర్గికము నగు నధ్యాసము సర్వలోక ప్రత్యక్షము. అనర్థహేతు వగు నీయధ్యాసప్రహాణ ప్రయోజన మగు నాత్మైకత్వవిద్యా ప్రతిపత్తికొఱ కెల్ల వేదాం తములు నారంభింపఁబడుచున్నవి. ఎల్ల వేదాంతములకు నీయర్థము స్పష్టమగునో యట్టి శారీరక( = జీవ) మీమాంస యందు మేము ప్రదర్శింతుము. (కుత్సితమగు శరీరము=శరీర కము. దానియం దుండువాఁడు = శారీరకుఁడు = జీవుఁడు. తన్మీమాంస శారీరకమీమాంస) శ్రీః శ్రీః శ్రీః.

ఇది యధ్యాసగ్రంథము



# ఆంధ్రసూత్రభాష్యము

అధికరణసంగతి సూత్రములు

(సంగతి యనఁగాఁ బూర్వాధికరణమునకు నుత్తరాధికరణమునకుఁ గల సంబంధము.)

అధ్యాయము ౧. పాదము ౧.

## ౧. జిజ్ఞాసాధికరణము

ఇది మొదటిది యగుటచే నధికరణాంతరసంగతి నపేక్షింపదు.

## ౨. జన్మాద్యధికరణము

పూర్వాధికరణమున ముముక్షువు బ్రహ్మజ్ఞానము కొఱకు వేదాంతవిచారము చేయునది యని చెప్పుటచే నర్థము వలన బ్రహ్మప్రమాణము మొదలగువాని విచారము ప్రతిజ్ఞాతమైనను బ్రహ్మప్రమాణము బ్రహ్మయుక్తియు ననునది మొదలగు విశిష్టవిచారము విశేషముగా బ్రహ్మజ్ఞానమును వినాగ సంభవింపమిం జేసి బ్రహ్మస్వరూపజ్ఞానార్థ మవశ్యము లక్షణము చెప్పవలసియుండెను గాని యది సంభవింపదను

నాక్షేపమువలన నీయధికరణము బయలువెడలుటచేఁ బూర్వాధికరణమునకు దీనికి నాక్షేపసంగతి గలదు. స్పష్టబ్రహ్మలింగము లగు లక్షణద్యోతి వేదాంతములకు లక్ష్య మగు బ్రహ్మమునందు సమన్వయోక్తివలన శ్రుతిశాస్త్రాధ్యాయపాదసంగతులుం గలవు. ఇటఁ బూర్వపక్షమున బ్రహ్మస్వరూపాసిద్ధిచే మోక్షాభావమును సిద్ధాంతమున మోక్షసిద్ధియు ఫలములు.

### 3. శాస్త్రయోనిత్వాధికరణము

పూర్వాధికరణమున బ్రహ్మమునకు సకలజగత్కర్తృత్వము లక్షణ మని చెప్పంబడెఁ గానఁ బ్రధానాది నిరాసార్థ మర్థమువలన బ్రహ్మమునకు సర్వజ్ఞత్వముఁ బ్రతిజ్ఞాతమయ్యెను; దాని నిట సాధించుటచే నార్థికప్రతిజ్ఞతో (సాధ్యసాధనభావ) సంగతి గలదు. వేఱొకపక్షమున బ్రహ్మమునకు సకలజగత్కర్తృత్వము ప్రతిజ్ఞాతము కాఁగా వేదములు నిత్యము లగుటవలనఁ దత్కర్తృత్వము లేదను నాక్షేపముచే నీయధికరణ ముత్పన్నము గాన నాక్షేపసంగతియైనఁ గలదు. ఇట "అస్య మహతో భూతస్య" ఇత్యాది వాక్యము విషయము. అది వేదహేతుత్వమున బ్రహ్మమునకు సర్వజ్ఞత్వమును సాధించునా? సాధింపదా యని సంశయము. వేదము వ్యాకరణాదులువలెఁ బౌరుషేయ మగుటచేఁ బ్రమాణాంతర

సాపేక్షము గనుక సాధింపఁబాలదని పూర్వపక్షమున జగ
త్కారణమునకుఁ జేతనత్వాసిద్ధియు సిద్ధాంతమునఁ దత్సిద్ధియు
ఫలములు. స్పష్టబ్రహ్మలింగమగు నీవాక్యమునకు జగత్కర్త
యందు సమన్వయోక్తివలన శ్రుతిశాస్త్రాధ్యాయసంగతులుం
గలవు.

### ౪. సమన్వయాధికరణము

పూర్వాధికరణ ద్వితీయవర్ణకమున వేదాంతములు
బ్రహ్మమునందుఁ బ్రమాణము లని చెప్పంబడఁగా వేదములు
సఫలక్రియైకపరములుగాని నిష్ఫలమై మానాంతరయోగ్య
మగు సిద్ధవస్తుపరములు గావను నాక్షేపముచే నీ యధికరణ
ముత్థిత మగుటవలన నాక్షేపసంగతి గలదు. స్పష్టబ్రహ్మ
లింగము లగు "సదేవే" త్యాది వాక్యములకు బ్రహ్మము
నందు సమన్వయోక్తివలన శ్రుత్యాదిసంగతులుం గలవు.
ఇటుఁ బూర్వపక్షమున ముముక్షులకు వేదాంతములఁ బ్రవృ
త్త్యసిద్ధియు సిద్ధాంతమునఁ బ్రవృత్తిసిద్ధియు ఫలములు.

### ౫. ఈక్షత్యధికరణము

పూర్వాధికరణమున జెప్పినట్లు వేదాంతములకు సిద్ధ
వస్తువునందు సమన్వయము సిద్ధించినను బ్రహ్మము ప్రమా
ణాంతరాగమ్యము గనుక శక్తిగ్రహణయోగమువలనను గూట
స్థము గావునఁ గారణత్వము సంభవింపమివలన నట సమన్వ

యము సిద్ధింపదు; కాని సర్గాద్యకార్యము కార్య మగుట వలన జడప్రకృతిక మను ననుమానగమ్యమును త్రిగుణము నగు ప్రధానమున సమన్వయము సిద్ధించు నను నాక్షేపమున సీ యధికరణము చెప్పంబడెఁ గాన నాక్షేపసంగతి. ఇటఁ బూర్వపక్షమున కీపునకుఁ బ్రధానైక్యసంపత్తియు సిద్ధాంతమున బ్రహ్మైక్యజ్ఞానమును ఫలములు. "సదేవ" త్యాది స్పష్టబ్రహ్మలింగ వాక్యములకుఁ బ్రధాన పరాన పూర్వక ముగా బ్రహ్మమునందు సమన్వయోక్తివలన శ్రుత్యాది సంగతులుం గలవు.

### ౩. ఆనందమయాధికరణము

పూర్వాధికరణమున గౌణేక్షణమును ముఖ్యేక్షణమును తుల్యములు గావుం జేసి సంశయాభావమువలన గౌణ ప్రాయపాఠము నిశ్చాయకము గాదని చెప్పంబడియె. అప్పుడు మయట్టునకుఁ బ్రాచుర్యార్థమును వికారార్థమును ముఖ్యము లగుటవలన సంశయము గల్గఁగా వికారప్రాయ పాఠమువలన నానందవికార మగు జీవుఁ డానందమయుఁ డని ప్రత్యుదాహరణసంగతిచే నిది యుత్పన్నము. మఱియు సిద్ధాంతమునందుఁ బూర్వాధికరణమున నీక్షణమునకు సంశయాభావమువలనను యుక్తిచే బ్రాయపాఠము నిశ్చాయకముగాదని చెప్పంబడియె. ఇపుడు పుచ్ఛశబ్దమునకు నాధారావయవములందు లక్షణా

సామ్యమువలన విరోధపరి సంశయాభావమువలన నను యుక్తి చేయుంచి సంశయము గలుగఁగాఁ బ్రాప్తమునుపాసము నిశ్చా యకమని ప్రత్యుదాహరణముచే నిది యుత్పన్నము గనుకఁ బ్రత్యుదాహరణసంగతి. వేదాంతవాక్య సమన్వయోక్తివలన శ్రుత్యాదిసంగతులు కలవు. వృత్తికారమతమునఁ బూర్వప క్షమున వైరాస్తిచేఁ బ్రియాదిప్రాప్తిఫలము. సిద్ధాంతమున బ్రహ్మప్రాప్తిచేనదియే ఫలము. అద్వైతమతమునఁ బూర్వ పక్షమున సగుణోపాస్తియు సిద్ధాంతమున నిర్గుణబ్రహ్మజ్ఞాన మును ఫలములు.

౭. అంతరధికరణము

పూర్వమానందపదము మొదలగు ననేకప్రమాణ ములవలన నిర్గుణబ్రహ్మనిర్ణయము వలెనే యిట రూపవత్త్వా ద్యనేకప్రమాణములవలన నాదిత్యమండలములోని పురుషుఁడు జీవుఁడను దృష్టాంతముచే నిది యుత్పత్తివలన దృష్టాంత సంగతి. ఇటఁ బూర్వోత్తరపక్షముల జీవబ్రహ్మోపాస్తులు ఫలములు.

౮. ఆకాశాధికరణము

పూర్వము రూపవత్త్వాది దుర్బలలింగము లవ్యభిచారి బ్రహ్మలింగములగు పాప్మాస్పర్శత్వాదులచే వేఱుగానయింపఁ బడిన నిట నాకాశపదశ్రుతి లింగముకంటె బలీయసిగాన

నట్లు గాదని ప్రత్యుదాహరణసంగతి గలదు. స్పష్టబ్రహ్మ
లింగవాక్యముల కుపాస్య బ్రహ్మమునందు సమన్వయోక్తి
వలన నాపాదమును శ్రుత్యాదిసంగతులు గలవు. పూర్వపక్ష
మున నాకాశరూపమున నుద్గీథోపాస్తియు సిద్ధాంతమున
బ్రహ్మస్వరూపమున నుద్గీథోపాస్తియు నని ఫలభేదము.

౯. ప్రాణాధికరణము

ఇది యతిదేశమగుటచే వెనుకటిసంగత్యాదులే కల
వని గ్రహింపవలెను.

౧౦. జ్యోతిరధికరణము

పూర్వాధికరణమున నాకాశాదిశబ్దములకుఁ బ్రబల
బ్రహ్మలింగముల కలిమివలన బ్రహ్మపరత్వము చెప్పంబడిన
నిట స్వవాక్యమున బ్రహ్మలింగమే లేదు కాఁబట్టి జ్యోతిశ్శబ్దము
నకు బ్రహ్మపరత్వము లేదని ప్రత్యుదాహరణసంగతిచే నని
యుత్థానము. ఇట స్వవాక్యమున బ్రహ్మలింగము లేకున్నను
బూర్వవాక్యమున భూతాదిపాదముల కలిమి యను బ్రహ్మ
లింగము కలదుగానఁ బాదసంగతి గలదు. ఇటుఁ బూర్వపక్ష
మున జడజ్యోతిస్సు నుపాస్తియు సిద్ధాంతమున బ్రహ్మజ్యోతి
స్సు నుపాస్తియు ఫలములు.

౧౧. ఇంద్రప్రాణాధికరణము

పూర్వాధికరణమునఁ బ్రకృతమగు బ్రహ్మముం జెప్పి

యచ్ఛబ్దబలమువలన జ్యోతిశ్శ్రుతి బ్రహ్మపర మని చెప్పంబడియె. ఇట్ల నన్యోన్యవిరుద్ధము లగు ననేకలింగము లనిశ్చాయకము లగుటవలనఁ బ్రాణశ్రుతిభంగమునఁ గొంచమైనను సహాయము లేదని ప్రత్యుదాహరణసంగతిచే నిది యుత్పన్నము. పూర్వపక్షమునఁ బ్రాణాద్యుపాస్తియు సిద్ధాంతమునఁ బ్రత్యగ్బ్రహ్మజ్ఞానమును ఫలములు.

ఇది ప్రథమాధ్యాయ ప్రథమపాదము

---

పాదము. ౨

పూర్వపాదమున బ్రహ్మమునకు జగత్కారణత్వముఁ జెప్పుటచే వ్యాపిత్వాదిక మర్థసిద్ధమయ్యెను. దాని ననుసరించి తరువాతిపాదములు రెండును బ్రవర్తించుటచే హేతుహేతుమద్భావము పాదసంగతి.

౧. సర్వత్ర ప్రసిద్ధ్యధికరణము

పూర్వాధికరణమున బ్రహ్మలింగములచే నబ్రహ్మలింగముల బాధ ముక్తము. ఇట నుపక్రమణమున బ్రహ్మలింగము లేవు. ప్రకరణముమాత్ర మున్నది కాని యదియు శాంతివిధానార్థ మన్యథా సిద్ధము గనుక జీవలింగమును బాధింపంజాల దని ప్రత్యుదాహరణసంగతిచే నిది యుత్పన్నము. ఎట ఫలము చెప్పంబడదో యటఁ బూర్వోత్తరపక్షసిద్ధియే ఫల మని యెఱుఁగునది.

### ౨. అత్త్రధికరణము

పూర్వాధికరణమున బ్రహ్మమునకు భోక్తృత్వము లే దని చెప్పంబడె. అదికారణముగ నీ యధికరణ ముత్పన్న మగుటచే హేతుహేతుమద్భావము సంగతి. ఇటఁ బూర్వ పక్షమున జీవోపాస్తియు సిద్ధాంతమున నిర్విశేషబ్రహ్మజ్ఞాన మును ఫలములు.

### 3. గుహాధికరణము

పూర్వాధికరణమున బ్రహ్మక్షత్త్రపదములకు సన్నిహితమృత్యుపదమువలన ననిత్యవస్తుపరత్వమువలెనే యిట నును బత్పదమునకు సన్నిహితగుహాపదమువలన బుద్ధి జీవ పరత్వమని దృష్టాంతసంగతి గలదు. ఇట ఫలము భాష్యకారులు స్వయముగానే చెప్పిరి.

### ౪. అంతరాధికరణము

పూర్వాధికరణమునఁ బ్రథమశ్రుత మగు "పిబంతౌ" యను చేతనత్వానుసారముగా గుహాప్రవేశాదు లెట్లన్వయింపఁబడినవో యట్లే యిటను "దృశ్యతే" యను చాక్షుష త్వానుసారముగా నమృతత్వాదులు ధ్యానార్థము కల్పితము లుగా నేయుము లని దృష్టాంతసంగతిచే నిది యుత్పన్నము. పూర్వపక్షమునఁ బ్రతిబింబోపాస్తియు సిద్ధాంతమున బ్రహ్మోపాస్తియు ఫలములు.

### ౫. అంతర్యామ్యధికరణము

పూర్వాధికరణమున నీశ్వరున కక్షిస్థానమున నునికి సిద్ధించుటకొఱకుఁ బృథివ్యాదిస్థాననిర్దేశ ముదాహరింపఁబడినది. ఆ యుదాహరణవాక్యమున కీశ్వరపరత్వము నాక్షేపించి సమాహితము చేయంబడుఁగాన నాక్షేపసంగతి. పూర్వ ఫలముచేతనే దీనికి ఫలవత్త్వముగాని పూర్వపక్షమున యత్నిపముగా వాక్య మన్వయింపఁబడునో తదుపాస్తియు సిద్ధాంత మునఁ బ్రత్యగ్బ్రహ్మజ్ఞానము సవాంతరఫలములు.

### ౬. అదృశ్యత్వాదిగుణకాధికరణము

పూర్వమునందువలె నిట ద్రష్టృత్వాదిచేతనధర్మములు వినంబడకపోవుటవలనను నదృశ్యత్వాదులు బ్రహ్మప్రధాన సాధారణము లగుటవలనను నిటఁ బ్రధానము చెప్పంబడినది కావచ్చు నని ప్రత్యుదాహరణ సంగతిచే నిది యుప్పతిల్లెను. ఇటఁ బూర్వపక్షమునఁ బ్రధానాద్యుపాస్తియు సిద్ధాంతమున నిర్గుణబ్రహ్మజ్ఞానమును ఫలములు.

### ౭. వైశ్వానరాధికరణము

పూర్వ ముపక్రమమున నున్న యదృశ్యత్వాదిసాధారణధర్మమునకు వాక్యశేషమునను న్న సర్వజ్ఞత్వలింగముచే బ్రహ్మనిష్ఠత్వము చెప్పంబడె. అట్లే యిట నుపక్రమమున నున్న సాధారణ వైశ్వానరశబ్దమునకు వాక్యశేషమునందలి

హోమాధారత్వములింగముచే జాఠరపరత్వ మని దృష్టాంత సంగతి. పూర్వోత్తరపక్షములందు జాఠరబ్రహ్మముల ధ్యానము ఫలము.

ఇది ద్వితీయపాదము

---

## పాదము 3.

### ౧. ద్యుభ్వాద్యాయతనాధికరణము

పూర్వముపక్రమమున నున్న సాధారణవైశ్వానర శబ్దమునకు వాక్యశేషముననున్న ద్యుమూర్ధత్వాదులచే బ్రహ్మపరత్వము నిర్ణయింపఁబడె. అట్లే యిట నుపక్రమమున నున్న యాయతనత్వమునకు వాక్యశేషముననున్న సేతుశ్రుతిచే స్వభావమునఁ బరిచ్ఛిన్నమగు ప్రధానాది పరత్వమని దృష్టాంతరూపకమగు నధికరణసంగతి గలదు. పూర్వపక్షమునఁ బ్రధానాద్యుపాస్తియు సిద్ధాంతమున నిర్విశేషబ్రహ్మజ్ఞానమును ఫలములు.

### ౨. భూమాధికరణము

పూర్వమాత్మశబ్దప్రయోగమువలన ద్యుభ్వాద్యాయతనము బ్రహ్మమని చెప్పఁబడెఁగాని "తరతిశోకమాత్మవిత్"ని బ్రహ్మము కాని దానియందు నాత్మశబ్దము ప్రయోగింపఁబడుటవలన నది యుక్తముకాదని యాక్షేపసంగతిచే నిట

పూర్వపక్ష ముత్పన్నము. పూర్వోత్తరపక్షములకుఁ గ్రమ
ముగాఁ బ్రాణోపాస్తియు బ్రహ్మజ్ఞానమును ఫలములు.

### ౩. అక్షరాధికరణము

పూర్వాధికరణమున సత్యశబ్దము బ్రహ్మమునందు రూఢము గాన భూమము బ్రహ్మ మని చెప్పంబడె. అట్లే యక్షరశబ్దము వర్ణమున రూఢముగాన నక్షరము వర్ణమేయని దృష్టాంతసంగతిచే నిది బయలువెడలెను. పూర్వపక్షమున నోంకారోపాస్తియు సిద్ధాంతమున బ్రహ్మజ్ఞానమును ఫలము.

### ౪. ఈక్షతికర్మాధికరణము

వెనుకటి యధికరణమునఁ బూర్వపక్షమునందుఁ జెప్పంబడిన యోంకారమునందు బుద్ధిస్థమగు ధ్యాతవ్య మిట నిశ్చయింపఁబడుఁ గానఁ బ్రసంగసంగతి. వెనుకటి యధికరణమున వర్ణమున రూఢమగు నక్షరశబ్దమునకు లింగమువలన బ్రహ్మమునందు వృత్తి చెప్పంబడెఁగాన నిటను బ్రహ్మలోకప్రాప్తి లింగమువలనఁ బరశబ్దమునకు హిరణ్యగర్భునందు వృత్తిగా వచ్చునని దృష్టాంతసంగతియైనం గలదు. పూర్వపక్షమునఁ గార్యబ్రహ్మోపాస్తియు సిద్ధాంతమునఁ బరబ్రహ్మోపాస్తియు ఫలములు.

### ౫. దహరాధికరణము

పూర్వము పరపురుషశబ్దము బ్రహ్మమునందు ముఖ్య

ము కాబట్టి బ్రహ్మము ధ్యేయమని చెప్పంబడె. అట్లే యిట నాకాశశబ్దము భూతాకాశమున రూఢముగాన భూతాకాశము ధ్యేయమని దృష్టాంతసంగతి. పూర్వపక్షమున భూతాకాశాద్యుపాస్తియు సిద్ధాంతమున సగుణబ్రహ్మోపాస్తిచే నిర్గుణబ్రహ్మజ్ఞానమును ఫలములు.

## ౬. ఉత్తరాధికరణము

ఇది పూర్వాధికరణశేషముగాన వేఱు సంగతిఫలముల నపేక్షింపదు.

## ౭. అనుకృత్యధికరణము

పూర్వాధికరణమున నాత్మశ్రుత్యాదిబలమువలన నాకాశశబ్దమునకు రూఢిత్యాగము చేసి బ్రహ్మమునందు వృత్తి చెప్పంబడియె. అట్లే యిట నతినస్తమిా బలమువలన "నభాతి" యను వర్తమానార్థమును విడిచి యొద్ది భాసిల్లుచుండంగా సూర్యాదితేజఃపదార్థములు "నభాంతి" = భాసిల్లవో యాతేజఃపదార్థ ముపాస్యమని యిపుడు సూర్యాదులు భాసిల్లుచుండంగా భాసిల్లవని విరోధమువలన భవిష్యదర్థమున వృత్తియాశ్రయణీయమని దృష్టాంతసంగతి. పూర్వపక్షమున నాకికతేజోధ్యానమును సిద్ధాంతమున నిర్విశేషబ్రహ్మజ్ఞానమును ఫలములు.

౧౦. అపశూద్రాధికరణము

పూర్వాధికరణమున మనుష్యాధికారము నపవదించి దేవతల కధికార మెట్లు చెప్పంబడెనో యట్లె యిట ద్విజాధికారనియమాపవాదముచే శూద్రున కధికారము కావచ్చునని దృష్టాంతసంగతి. పూర్వము దేవాదులకు జ్ఞానాధికారసిద్ధ్యర్థము మంత్రాదులకు భూతార్థమగు విగ్రహాదులందు సమన్వయోక్తిచే వేదాంతములకు భూతార్థమగు బ్రహ్మము నందు సమన్వయము దృఢపఱుపఁబడినది. ఇట శ్రౌత మగు శూద్రశబ్దమునకు క్షత్రియునందు సమన్వయోక్తిచే నది దృఢపఱుపఁబడు నని ప్రాసంగిక మగు రెండధికరణములకు సమన్వయాధ్యాయమున నంతర్భావమని యెఱుఁగవలయును. పూర్వపక్షమున శూద్రునకును ద్విజునకువలె వేదాంతశ్రవణమునఁ బ్రవృత్తియు సిద్ధాంతమునఁ దదభావమును ఫలములు.

౧౧. కంపనాధికరణము

ఈయధికరణము ప్రాసంగికమైనవానితో సంగతి నపేక్షింపదు కాఁబట్టి వానిపూర్వాధికరణముతోఁ జెప్పంబడును. అట నంగుష్ఠవాక్యమునందు జీవానువాదము బ్రహ్మైక్యజ్ఞానార్థమని చెప్పంబడె. అట్లిటస్వరూపమునఁ గల్పితమగు ప్రాణమున నైక్యము సంభవింపమింజేసి ప్రాణానువాద మైక్యజ్ఞానార్థము కాఁజాలదు గనుక వాక్యము ప్రాణోపాస్తిపర మని

ప్రత్యుదాహరణసంగతి. పూర్వపక్షమున ప్రాణోపాస్తియు సిద్ధాంతమున బ్రహ్మజ్ఞానమును ఫలములు.

౧౨ జ్యోతిర్దర్శనాధికరణము

పూర్వము బ్రహ్మప్రకరణమున కనుగ్రాహక మగు సర్వజగచ్చేష్టాదియోగము కలదు కాఁబట్టి ప్రాణశ్రుతి బ్రహ్మమునం దన్వయింపఁబడెఁగాని యట్లిట "యఆత్మాఽపహతపాప్మా" యను ప్రకరణమున కనుగ్రాహకముం జూడమని ప్రత్యుదాహరణసంగతి. పూర్వపక్షమున సూర్యోపాస్తియు సిద్ధాంతమున బ్రహ్మజ్ఞానమువలన ముక్తియు ఫలములు.

౧౩. ఆకాశాధికరణము

పూర్వాధికరణమున నెట్లుపక్రమబలమువలన జ్యోతిశ్శ్రుతి బాధమో యట్లిట నాకాశోపక్రమమువలన బ్రహ్మశ్రుతి బాధ మని దృష్టాంతసంగతి. ఇట శ్రుతములగు గుణములచే నాకాశోపాస్తియు బ్రహ్మజ్ఞానమును బూర్వోత్తరపక్షఫలములు.

౧౪. సుషుప్త్యుత్క్రాంత్యధికరణము

పూర్వాధికరణమున నామరూపములకంటె భేదోక్తివలన నాకాశము బ్రహ్మమని చెప్పంబడెఁగాని యది యుక్తముగాదు. "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్త"యనుచోట నభిన్నుఁడగు జీవాత్మునందు భేదోక్తివలె నౌపచారిక మగు భేదోక్తి

సంభవించుటవలన నని యాక్షేపసంగతివలన నిది యుక్తిలేకము. ఇట్లు బూర్వపక్షమున కర్తృజీవస్తుతియు సిద్ధాంతమున జీవానువాదముచేఁ గల్పితభేదభిన్నుఁ డగు ప్రాజ్ఞునకుఁ బర మాత్మునకు స్వరూపైక్యజ్ఞానమును ఫలములు.

ఇది తృతీయపాదము

పాదము. ౪

ఈపాదమున మొదటి మూఁడధికరణములకు సీక్షత్యధి కరణముతో సంగతి గలదు. యీయధికరణమున వేదాంతము లకుఁ బ్రహ్మమునందు గతిసామాన్యమును బ్రధానమున కశబ్ద త్వమును బ్రతిజ్ఞాతము లయ్యె. అందు గతిసామాన్యము ప్రపం చింపఁబడియె. ప్రధానమున కశబ్దత్వమయుక్తమని యిట నాక్షే పించుకొని సిద్ధాంతించునుగాన నాక్షేపసంగతి. పూర్వ పక్షమున వేదాంతములకు బ్రహ్మమునందు సమన్వయాభావ మును సిద్ధాంతమున సమన్వయమును ఫలములు. ప్రధాన మున కశబ్దత్వనిరూపణముచే వేదాంతములకు బ్రహ్మము నందు సమన్వయము దృఢమగును గాన నీయధికరణములకు సమన్వయాధ్యాయసంగతి.

౧. ఆనుమానికాధికరణము

వెనుకటి మూఁడధికరణములందుఁ బ్రధానమున కశబ్ద త్వమును జెప్పుటవలన జగత్కారణత్వలక్షణముచే బ్రహ్మమే

బుద్ధిస్థమయ్యెను. బుద్ధిస్థమగు నాబ్రహ్మమునందే వేదాంతములకు సమన్వయమని పూర్వసూత్రసందర్భముచే సాధింపఁబడె; కాని శ్రుతులు పరస్పరవిరుద్ధము లగుటవలన బ్రహ్మమునందా లక్షణముగాని సమన్వయముగాని సంభవింపదను నాక్షేపసంగతి యీసందర్భములో దీనికిఁ గలదు.

## ౫. జగద్వాచిత్వాధికరణము

పూర్వమొకవాక్యముననే యున్న సచ్ఛబ్దాదిబలము వలన నసచ్ఛబ్దము బ్రహ్మపరముగా నన్వయింపఁబడెఁగాని యిట వాక్యభేదమువలన బాలాకివాక్యమునమున్న బ్రహ్మశబ్దముచేఁ బ్రాణాదిశబ్దములు బ్రహ్మపరముగా నన్వయింపవని ప్రత్యుదాహరణసంగతి. పూర్వపక్షమున వాక్యము ప్రాణాద్యుపాస్తిపరము గాన బ్రహ్మమునందు సమన్వయాసిద్ధియు సిద్ధాంతమునఁ దత్సిద్ధియు ఫలములు.

## ౬. వాక్యాన్వయాధికరణము

పూర్వమెట్లు "బ్రహ్మతే బ్రవాణి" యను నుపక్రమము వలన వాక్యమునకు బ్రహ్మపరత్వము చెప్పంబడెనో యట్లే యిట జీవోపక్రమమువలన నీవాక్యమునకు జీవపరత్వము చెప్పంబడవలెనని దృష్టాంతసంగతి. పూర్వపక్షమున వాక్యమునకు జీవోపాస్తి పరత్వమును సిద్ధాంతమునఁదత్త్వము బ్రహ్మమునందు సమన్వయసిద్ధియు ఫలములు.

## ౭. ప్రకృత్యధికరణము

దీనికి లక్షణసూత్రముతో సంగతి. అట బ్రహ్మమును బుద్ధియందు నిల్పుటకు సామాన్యముగా జగత్కారణత్వము లక్షణమని చెప్పంబడియె. దానిచే బుద్ధిస్థమగు బ్రహ్మము నందు సకలవేదాంత సమన్వయము నుపపాదించి యాకార ణత్వము కర్తృత్వమాత్రమా? ప్రకృతిత్వకర్తృత్వోభయ రూపమా? యను విశేషజిజ్ఞాస కలుగుచుండఁగా నీయధికర ణము నారంభించెను. సామాన్యజ్ఞానము విశేషచింతకుఁ గార ణముగాన దీనికి దానితో సంగతి గలదు. పరికింపఁగా నీయధి కరణమునకు దాని యానంతర్యము యుక్తముగాని నిశ్చిత తాత్పర్యము లగు వేదాంతములచేఁ గర్తృమాత్రేశ్వర మతనిరాసము సుకరమని సమన్వయాధ్యాయాంతమున లిఖింపఁబడియె జన్మాద్యధికరణమునకీ యధ్యాయసంగతి కలదు గాన దద్విచారకమగు దీనికిం గలదు. పూర్వోత్తర పక్షములందు ద్వైతాద్వైతసిద్ధులు క్రమముగా ఫలములు

పూర్వాధికరణమున సర్వవిజ్ఞానప్రతిజ్ఞ ముఖ్యమగుట వలన వాక్యమునకు జీవపరత్వము నిరసింపఁబడె. కాని కర్తృ పాదానములకు భేదముచేఁ బ్రతిజ్ఞ గౌణము గాన నది యయుక్తమని యాక్షేపసంగతిచే నిది యుత్పన్నము.

## ౮. సర్వవ్యాఖ్యానాధికరణము

ఇట్లు సర్వాదివాదములు శ్రౌతములా? కావా? యని సంశయము గలుగుచుండఁగాఁ బ్రధానమువలె నివియు నశ్రౌతములని యతిదేశింపఁబడెఁగాన వేఱుగా సంగత్యపేక్ష లేదు.

ఇది చతుర్థపాదము

---

# ఆంధ్ర సూత్ర భాష్యము

---

అధ్యాయము ౨. పాదము ౧.

## ౧. స్మృత్యధికరణము

ప్రథమా (సమన్వయా) ధ్యాయమున "జన్మాది" సూత్రము మొదలుగా బ్రహ్మము జగదుత్పత్త్యాది కారణమని ప్రతిపాదింపఁబడె. 'శాస్త్రదృష్ట్యాతు' మొదలగు సూత్రములచే నద్వితీయుఁడగు నాతఁడే సర్వాత్ముఁడని చెప్పఁబడియె. 'ఆనుమానిక'మిత్యాదులచేఁ గారణాంతరముల కశ్రౌతత్వముఁ బ్రదర్శింపఁబడె. ఇట్లు ప్రథమాధ్యాయార్థమగు విషయమునఁ బ్రాప్తమగు విరోధముం బరిహరించు విషయియగు నీ యధ్యాయమునకును దానికి విషయ విషయిభావ సంగతి గలదు. అజ్ఞాతవిషయమున విరోధ శంకాసమాధ్య యోగము వలన సమన్వయాధ్యాయానంతర్య మీయధ్యాయమునకు (అవిరోధాధ్యాయమునకు) యుక్తము. మఱియు శ్రౌతమగు సమన్వయమునం బ్రాప్తమగు విరోధ పరిహారార్థమగుటవలన నీపాదమునకు శ్రుత్యాది సంగతులుం గలవు. ఎల్ల యధికరణములు స్వమతస్థాపకము లగుటవలన నీ పాదసంగతి గలదు.

పూర్వమతి దేశాధికరణమునఁ బ్రధానమునకు వలె నణ్వాదుల కశబ్దవత్త్వము ప్రతిపాదింపఁబడియె. ఇటఁ బ్రధానమునకు వైదిక శబ్దవత్త్వము లేకున్నను బ్రమాణమగు స్మృతిరూప శబ్దవత్త్వముకలదని యాశంకించుకొని పరిహరించుచున్నాఁడు. (కాఁబట్టి యాక్షేపసంగతికలదు.) ఇటఁ బూర్వపక్షమున స్మృతి విరోధమువలన నుక్త సమన్వయాసిద్ధియు సిద్ధాంతమునఁ దత్సిద్ధియు ఫలములు.

౨. యోగప్రత్యుక్త్యధికరణము

ఇది యతిదేశాధికరణమగుటవలన సంగత్యాదులు పూర్వాధికరణమునకు వలె గ్రాహ్యములు.

3. నవిలక్షణత్వాధికరణము

ఇదివఱకు సమన్వయమునకు స్మృతివిరోధము కలదను నాక్షేపము పరిహరింపఁబడెను. ఇపుడు తర్కవిరోధము కలదను నాక్షేపము పరిహరింపఁబడును. పూర్వము వేదవిరుద్ధ స్మృతులకు మూలాభావమువలన నప్రమాణములు గనుక విరోధము లేదని చెప్పఁబడె; కాని తర్కము వ్యాప్తి మూలమగుటవలన లోకసిద్ధము గనుక దానితో విరోధము కలదని ప్రత్యుదాహరణసంగతిచే నిటఁ బూర్వపక్షము ప్రాప్తమయ్యెను. ఫలముక్త సమన్వయాసిద్ధితత్సిద్ధులు.

## ౪. శిష్టాపరిగ్రహాధికరణము

సాంఖ్యులు తర్కమునఁ గుశలమతులు కారు గాన వారి తర్కము బాధితమైనను వైశేషికాదులు కుశలులగుటంజేసి వారి తర్కమబాధితముగాన దానితో విరోధమువలన సమన్వయము సిద్ధింపదని ప్రత్యుదాహరణ సంగతిచే నాక్షేపము రాఁగా నతిదేశించెను. ఫలము పూర్వమువలె.

## ౫. భోక్త్రాపత్త్యధికరణము

అద్వితీయ బ్రహ్మమువలన జగత్సర్గముం జెప్పు సమన్వయము విషయము. అది ఘటపటములు మృత్తంతు జన్యములైనట్లే పరస్పరభిన్నము లద్వితీయ కారణ జన్యములు కావను తర్క సహిత ప్రత్యక్షాదులతో విరోధించునా? లేదా? యని సందేహము గల్గఁగాఁ దర్కము బ్రహ్మమునం దప్రమాణమైనను జగద్భేదమునందుఁ బ్రమాణమె కాఁబట్టి విరోధించునని ప్రత్యుదాహరణ సంగతిచే నిటుఁబూర్వపక్షముత్పన్నము. పూర్వపక్షమున విరోధమువలన నద్వైతాసిద్ధియు సిద్ధాంతమునఁ దత్సిద్ధియు ఫలములు.

## ౬. ఆరంభణాధికరణము

వెనుకటి యధికరణమునఁ బరిణామవాదము నాశ్రయించి సమాధానము చెప్పంబడిన పూర్వపక్షమునకే యిట వివర్తవాదము నాశ్రయించి ముఖ్యసమాధానము చెప్పం

బడును గాన నేక విషయత్వము సంగతి ఏక ఫలకత్వ సంగతి
నైనం గావచ్చును. ఫలము పూర్వమువలెనే.

### ౭. ఇతరవ్యపదేశాధికరణము

పూర్వ మేకవిజ్ఞాన ప్రతిజ్ఞా సిద్ధ్యర్థము కార్యమునకు గారణా నన్యత్వము సమర్థింపఁబడె. ఆన్యాయముచేతనే జీవునకును బ్రహ్మమునకు నభేదమువలన జీవముగత లగు దోషములు బ్రహ్మమునందుఁ బ్రసక్తించు నను నాక్షేపమువలన నిది యుత్పన్నము కాఁబట్టి యాక్షేపసంగతి.

### ౮. ఉపసంహారదర్శనాధికరణము

అసహాయమగు బ్రహ్మమువలన జగత్సర్గముం జెప్పు సమన్వయము విషయము; అది యెద్ది యసహాయమో యది కారణముగాదను లోకసిద్ధ న్యాయముతో విరోధించునా? విరోధింపదా? యని సందేహము గలుగగాఁ బూర్వమౌపాధిక భేదమువలన బ్రహ్మమునందు జీవదోషములు ప్రసక్తింపవని చెప్పంబడె. ఇపుడీశ్వర నానాత్వాభావమువలన నుపాధివలననైనను విభక్త మగు నధిష్ఠాత్రాదికము లేదు గాఁబట్టి విచిత్ర కార్యోత్పత్తిలేదని ప్రత్యుదాహరణ సంగతిచే నిటఁ బూర్వపక్ష ముత్పన్నము. ఫల మద్వైతాసిద్ధి తత్సిద్ధులే పూర్వోత్తరపక్షము లగ్రాహ్యములు.

౯. కృత్స్నప్రసక్త్యధికరణము

క్షీరదృష్టాంతమువలన బ్రహ్మము పరిణామియని భ్రమోత్పత్తిచే బ్రహ్మయు పరిణామి యని పూర్వపక్షియ రాఁగా వివర్తముశాస్త్రార్థయగాని పరిణామముగాదను నిర్ణయార్థ మీయధికరణ ముత్పన్నము గాఁబట్టి పూర్వాధికరణముతో దీనికిఁ గార్యత్వసంగతి.

౧౦. సర్వోపేతాధికరణము

మాయాశక్తి మంతమగు బ్రహ్మమువలన జగత్స ర్గముం జెప్పు సమన్వయము విషయము. అది శరీరము లేని వానికి మాయ లేదను న్యాయముతో విరోధించునా? విరో ధింపదా? యని సందేహము గలుగగాఁ బూర్వోక్తశక్తి మత్త్వవిషయమగు శంకను నిరసించి యిట సమర్థించు నం గావున విషయ విషయిభావము సంగతి. బట్టి

౧౧. ప్రయోజనవత్త్వాధికరణము

పరితృప్తమగు బ్రహ్మమువలన జగత్సర్గముం జెప్పు శ్రుతి సమన్వయము విషయము. అదియు భ్రాంతచేతనుఁ డెవ్వఁడును నిష్ఫలమగు కార్యమును జేయఁడను న్యాయముతో విరోధించునా? లేదా? యని సందేహముగలుగగాఁ బూర్వము దేహము లేనివానికిని శ్రుతిబలమువలన శక్తిమత్త్వముం జెప్పుటచేఁ జెప్పంబడిన కర్తృత్వము నిట నాక్షేపించి సిద్ధాంతిం

చుటవలన నాక్షేపసంగతి. సమన్వయాసిద్ధి తత్సిద్ధులే ఫలములు.

### ౧౨. వైషమ్యనైర్ఘృణ్యాధికరణము

నిరవద్యమగు బ్రహ్మమువలన జగత్సర్గముం జెప్పు సమన్వయము విషయము. అది యెవఁడు విషమకారియో యతఁడు దోషవంతుఁ డను న్యాయముతో విరోధించునా? విరోధింపదా? యని సందేహము గలుగఁగాఁ బూర్వము మాయామయియగు లీలచే నేస్రష్టృత్వము చెప్పఁబడెనో యది కర్మసాపేక్షుఁడగు నీశ్వరున కనీశ్వరత్వాపత్తివలనను నిరపేక్షుఁడగు వానికి రాగాది దోషప్రసక్తివలనను యుక్తముగాదను నాక్షేప సంగతివలన నీ యధికరణముత్పన్నము. ఫలము పూర్వపక్షమున సమన్వయాసిద్ధియు సిద్ధాంతమునఁ దత్సిద్ధియు.

### ౧౩. సర్వధర్మోపపత్త్యధికరణము

పూర్వము కర్మవశమువలన నీశ్వరునకు విషమసృష్టి హేతుత్వము చెప్పఁబడియె. అది తత్ప్రయోజకమగు కర్మము కలిమిం జేసి యుక్తము కావచ్చును. కాని యుపాదానత్వ ప్రయోజకమగు గుణవత్త్వము లేమివలన నుపాదానత్వము లేదని ప్రత్యుదాహరణ సంగతిచే నిదియారబ్ధము.

ఇది ద్వితీయాధ్యాయ ప్రథమపాదము

పాదము. ౨

## ౧. రచనానుపపత్త్యధికరణము

గతించిన గ్రంథముచే ముముక్షువులకు సమ్యగ్జ్ఞానోత్పత్తి కొఱకు వేదాంతవాక్య సమన్వయము ప్రతిపాదింపఁబడియె. మఱియు నట్లు ప్రతిపాదింపఁబడిన సమన్వయమునఁ బరపరికల్పితములగు దోషముల నిరసించుటచే స్వపక్షము స్థాపింపఁబడియె. ఇపుడు ముముక్షువు కద్వైతశాస్త్రమున నిర్విచికిత్స ప్రత్తినిమిత్తము పరమతదూషణ ప్రధానమగు పాద మారంభింపఁ బడుచున్నది. అందు సాంఖ్యమతము శిష్టపరిగృహీతము కాఁబట్టి యభ్యర్హితము గనుక మొదట నిరసింపఁబడుచున్నది. పూర్వము 'ఈక్షతేర్నాశబ్ద' మిత్యాదులచే వేదాంతములకుఁ బ్రధానపరమగు వ్యాఖ్యానము నిరసింపఁబడినది. ఇటఁ బ్రధానసాధకములు వేద నిరపేక్షములునగు యుక్తుల కాభాసత్వము చెప్పఁబడుచున్నది కాఁబట్టి పౌనరుక్త్యము లేదు. ఇట సాంఖ్యాది మతనిరాసముచే సమన్వయమునకుఁ దన్మత విరోధ నిరాసద్వారమున దృఢీకరణమువలన నీపాదము నకు శ్రుత్యాదిసంగతులు బోధ్యములు. సమన్వయ విరోధ నిరాసముచే స్వపక్ష స్థాపనపరమగు ప్రథమపాదముతో నీపాదమున కుపజీవ్యోపజీవక భావ సంగతి. స్వపక్ష స్థాపనముతో వినాగఁ బరమతనిరాసము

సంభవింపమి వలన స్వసిద్ధాంతజ్ఞాన హేతుద్వారమునఁ బూర్వపాదమున కుపజీవ్యత్వ మెఱుంగునది. ఎల్ల యధికరణములు పరమత నిరాస హేతువులగుటవలనఁ బాద సంగతి గలదు. సర్వ ధర్మోపపత్త్యధికరణమున బ్రహ్మమునందుఁ గారణ ధర్మములకెల్ల నుపపత్తి చెప్పంబడఁగా నాధర్మముల కన్నిఁటికిఁ బ్రధానముననే యుపపత్తి యేల కారాదని యాక్షేపమున కిట (రచనానుపపత్త్యధికరణమున) నిరాసము వలన నీ రెండధికరణములకు నాక్షేప లక్షణావాంతర సంగతి గలదు. పూర్వోత్తరపక్ష ఫల ముపాద పరిసమాప్తి పర్యంతమును బర మతయుక్తి విరోధా విరోధములచే సమన్వయా సిద్ధి తత్సిద్ధులు.

౨. మహద్దీర్ఘాధికరణము

ప్రపంచము ప్రధాననిష్ఠ మగు సశబ్దత్వాదిగుణాన్వయమువలనఁ బ్రధానోపాదానకము గాని యట్లే బ్రహ్మనిష చేత సత్వగుణాన్వయమువలన బ్రహ్మోపాదానకమును గాగను దృష్టాంతసంగతిచే నీని యారంభము. పరికింపఁగ స్వపక్షదోషమును నివారించు నీ యధికరణమునకు స్మృతి పాదముతోడనే సంబంధము కలదు కాని యిట లేదు. ఐనను మీఁదఁ జెప్పంబడిన యవాంతరసంగతి లోభమున నిట వ్రాయంబడె నని యెఱుంగునది. మఱియుఁ జేతన మగు

బ్రహ్మమువలన జగత్సర్గముం జెప్పు వేదాంత సమన్వయము విషయము. అది యెద్ది సమవాయికారణగుణమో యది కార్యద్రవ్యమునందుఁ బటమునందు శౌక్ల్యమువలె స్వసమానజాతీయ మగు గుణాంతరమున కారంభక మను న్యాయముతో విరోధించునా? లేదా? యని సందేహము గలుగఁగా న్యాయ మవ్యభిచారి యగుటవలన విరోధించునని ప్రాప్తింప వ్యభిచారి యగుటవలన విరోధింపదని సిద్ధాంత మిటఁ జేయంబడును. సవిలక్షణత్వాధికరణమునఁ జేతనమువలన నచేతన సర్గము సాధింపఁబడినను వైశేషికన్యాయము తదీయ ప్రక్రియ చేతనే వ్యభిచరించుచున్న దని చెప్పుటచే నీసూత్రము గతార్థము గాదు.

## 3. ఉభయథాధికరణము

కొందఱు దీనినే వైశేషికాధికరణ మని చెప్పుదురు. ప్రాసంగిక మగు నవ్యవహితపూర్వాధికరణముతో నిది సంగతి నపేక్షింపదు కాఁబట్టి వ్యవహితమగు సాంఖ్యాధికరణముతోఁ జెప్పఁబడుచున్నది. ప్రధానముచేత నాధిష్ఠితము కాకపోవుట వలన జగమున కుపాదానము కాఁజాలకున్నను చేతనాధిష్ఠితములగు పరమాణువులు జగమున కుపాదానము కావచ్చునని ప్రత్యుదాహరణసంగతిచే దీని యారంభము. ఇటఁ బరమాణువులు జగత్కారణమను వైశేషికసిద్ధాంతము విష

యము. అది మానమూలమా? భ్రాంతిమూలమా? యని సందేహము. మానమూలము కాఁబట్టి దానితో విరోధము వలన సమన్వయాసిద్ధి యని పూర్వపక్షమునను భ్రాంతి మూల మగుటవలన విరోధము లేమిం జేసి సమన్వయసిద్ధి యని సిద్ధాంతమునను ఫలములు.

### ౪. సముదాయాధికరణము

దీనిని బౌద్ధాధికరణ మనియేని చెప్పవచ్చును.

వైశేషికులు పరిమాణభేదముచే దేహాదు లాశుతర వినాశులనియు నాత్మ స్థిరుఁ డనియు నంగీకరించుటవలన నర్ధ వైనాశికులును సర్వము క్షణిక మని చెప్పు బౌద్ధులు పూర్ణ వైనాశికులును గాఁబట్టి యర్ధవైనాశికమత నిరాసానంతరమున బుద్ధిస్థ మగు పూర్ణవైనాశికమతము నిరసింపఁబడు చున్నది. కాఁబట్టి ప్రసంగలక్షణసంగతి గలదు.

### ౫. ఉపలబ్ధ్యధికరణము—యోగాచారాధికరణము

అఖండనిర్విశేషబ్రహ్మవిజ్ఞానము జగదుపాదానమని చెప్పు వేదాంతసమన్వయమునకు భిన్నము సాకారము క్షణికమునైన విజ్ఞానము కలదు గాని యంతకంటె వేఱొక యర్థము లేదను యోగాచారమతముతో విరోధము కలదా? లేదా? యని తన్మతమునకు మానమూలత్వ భ్రాంతిమూలత్వములచే సందేహము గలుగఁగా, మీఁదఁ

జెప్పంబడిన బాహ్యార్థవాదనిరాసనమును జీవనముగా (ఆధా
రముగా)ఁ జేసికొని విజ్ఞానమాత్రవాది యగు యోగాచారుఁ
డిటఁ బూర్వపక్షము చేయుచున్నాఁడు కాఁబట్టి యీ రెండధి
కరణములకు నుపజీవ్యోపజీవకభావసంగతి.

౬. ఏకస్మిన్నసంభవాధికరణము — జైనాధికరణము

ముక్తకచ్ఛుల మతము నిరసింపంబడఁగా బుద్ధిస్థమగు
ముక్తాంబరుల మతము నిరసింపంబడుచున్నది గానఁ బ్రసంగ
సంగతి. బ్రహ్మ మేకరూపమని చెప్పు వైదికసిద్ధాంతమునకు
ననేకాంతవాదముతో విరోధము కలదా? లేదా? యని తన్మత
మునకు మానమూలత్వ భ్రాంతిమూలత్వములచే సందేహము
గలుగుచుండఁగా మానమూలము గనుక విరోధము కల
దని పూర్వపక్షఫలము ననుసంధించుకొని వారి మత మిట
నువన్యసింపఁబడుచున్నది.

౭. పత్యురసామంజస్యాధికరణము — పాశుపతాధికరణము

లుంఛితకేశు లగు జైనుల మతనిరాకరణమునకుం
దరువాత బుద్ధిస్థ మగు జటాధారిశైవమత మిట నిరసింపఁ
బడుచున్నది గానఁ బ్రసంగసంగతి. జగ మద్వితీయబ్రహ్మ
ప్రకృతిక మని చెప్పు వేదాంతసమన్వయమున కీశ్వరుఁడు
కర్తయె కాని ప్రకృతి కాఁ డను శైవమతముతో విరోధము
కలదా? లేదా? యని సందేహము గల్గఁగా వారి మతము

మానమూల మగుటవలన విరోధము లేదని ప్రాప్తించుటచే వేదాంతోక్తాద్వయ బ్రహ్మసిద్ధిఫల మని తలంచి సత్త్వాసత్త్వములకొకచోట నసంభవమువలెఁ గర్తృత్వోపాదానత్వముల కొకచో నసంభవమువలన నీశ్వరుఁడు కర్తయే యని పూర్వపక్షముచేసి యిట సిద్ధాంతింపఁబడును.

౮. ఉత్పత్త్యసంభవాధికరణము—పాంచరాత్రాధికరణము

పూర్వ మీశ్వరుఁడు కర్తయే కాని యుపాదానము కాఁడను వేదవిరుద్ధమతము నిరసింపఁబడినది. ఇపు డీశ్వరుఁడు కర్తయు నుపాదానము నను వేద సమ్మతమతము వేదార్థ సంగత మగుటవలన దాని నంగీకరించి జీవోత్పత్త్యంశమునఁ బ్రమాణమూలము కావచ్చు నని ప్రత్యుదాహరణసంగతిచే నిది యారంభింపఁబడియె ఇట భాగవతపాంచరాత్రాగమము విషయము. అది జీవోత్పత్త్యాద్యంశమునఁ బ్రమాణమా? యప్రమాణమా? యని సందేహము గలుగఁగా బాధాభావమువలన మాన మని పూర్వపక్షముచేసి యిట నిరాకరింపఁబడును. పూర్వపక్షమునఁ బరాగమవిరోధమువలన జీవాభిన్న బ్రహ్మసమన్వయాసిద్ధియు సిద్ధాంతమున నాయంశమున నది యప్రమాణము గనుక నవిరోధమువలన సమన్వయసిద్ధియు ఫలములు.

ఇది ద్వితీయపాదము

## పాదము. 3

### ౧. వియదధికరణము

పూర్వపాదయున జీవున కనుత్పత్తిప్రసంగముచే నాకాశమునకు నుత్పత్తి లేదని శంకించుకొని యిట్లు బరిహరించుచున్నాఁడు. కాఁబట్టి ప్రాసంగికసంగతి. పూర్వము పరస్పర విరోధమువలనఁ బరపక్షము లుపేక్ష్యము లని చెప్పంబడియె. అట్లే శ్రుతులకు నన్యోన్య విరోధమువలన శ్రుతిపక్షము నుపేక్షార్హ మని శంక గల్గఁగాఁ దరువాతిపాదములు రెండిటికి నారంభమువలనఁ బూర్వపాదమునకు వీనికి దృష్టాంతసంగతి గలదు. రెండుపాదములును శ్రుతుల కన్యోన్యవిరోధనిరాసముచే సమన్వయమును దృఢపఱుచునవి యగుటవలన శ్రుత్యధ్యాయసంగతియుం గలదు. అధ్యాయముతుదవఱకును బూర్వపక్షమునఁ బరస్పరవిరోధమువలన శ్రుతులకప్రామాణ్యమును సిద్ధాంతమున నవిరోధమువలనఁ బ్రామాణ్యమును ఫలములు.

### ౨. మాతరిశ్వాధికరణము

ఇది యతిదేశాధికరణము గనుక వేఱుగా సంగత్యాదులు లేవు.

### 3. అసంభవాధికరణము

'అనాద్యనంతం మహతః పరం ధ్రువ' మిత్యాది శ్రుతు

లకును 'త్వంజాతో భవసి' మొదలగు శ్రుతులకును విరోధము కలదా ? లేదా ? యని యేకవాక్యత్వభావాభావములచే సందేహము గలుగఁగా విరోధము కలదని పూర్వపక్షము ప్రాప్తింప నుత్పత్తిశ్రుతిబలమువలన వాయ్వాదుల కమృతత్వ మెట్లాపేక్షికమో యట్లే బ్రహ్మనాదిత్వ మాపేక్షిక మని దృష్టాంతసంగతి గలదు.

## ౪. తేజోఽధికరణము

'తత్తేజోసృజత, వాయో రగ్నిః' ఈ శ్రుతులకు విరోధము కలదా ? లేదా ? యని సందేహము గలుగఁగా సామాన్యమువలన సామాన్యము పుట్టకున్నను సామాన్యములగు బ్రహ్మవాయువులకుఁ దేజోరూపవిశేషోపాదానత్వసంభవమువలనఁ దుల్యబలము లగుటచే విరోధము కల దని ప్రత్యుదాహరణసంగతిచే నిది యారంభింపఁబడెను. పాద సమాప్తివఱకు నేకవాక్యత్వాసంభవసంభవములు సంశయ బీజ మనియుఁ బూర్వపక్షమున శ్రుతులకు విరోధమువలన నప్రామాణ్యమును సిద్ధాంతమున నవిరోధమువలనఁ బ్రామాణ్యమును ఫలము లనియు మున్ను చెప్పంబడిన దానిని మఱువవలదు.

## ౫. అబధికరణము

ఇది యతిదేశము. ముండకమునఁ జెప్పంబడిన "ఏత

స్మాజ్జాయతే ప్రాణో మన స్సర్వేంద్రియాణిచ ఖంవాయుర్జ్యో
తిరాపః పృథివీ" త్యాదివాక్యమునకు "అగ్నే రాప" యను
శ్రుతితో విరోధము కలదా? లేదా? యని సంశయము
గల్గఁగాఁ దుల్యములగుటవలన విరోధము కలదను పూర్వపక్ష
మున నప్పు లగ్నిదాహ్యము లగుటచే విరోధమువలన వాని
కగ్నిజత్వము సంభవింపదు కాఁబట్టి పంచమి క్రమార్థ
యగుటవలన విరోధము లేదని యధికాశంక గల్గుచుండఁగా
నుక్తతేజోన్యాయము నతిదేశించెను.

ఒకానొక రిదియుఁ దరువాతి యధికరణమును దేశ
మునకుఁ గార్యత్వముఁ జెప్పినతరువాతఁ గ్రమముగా బుద్ధి
స్థము లగుటవలన బుద్ధిసన్నిధిలక్షణసంగతిచే నారంభింపఁ
బడిన వని వ్రాసిరి.

౬. పృథివ్యధికరణము

పూర్వాధికరణమునకును దీనికిని గార్యకారణభావ
సంగతి.

౭. తదభిధ్యానాధికరణము

మీఁదటిభూతముల నాశ్రయించి యాశ్రయాశ్రయి
భావసంగతిచే వానికి స్వాతంత్ర్యము కలదని యాశంకించికొని
యిట నిషేధించుచున్నాఁడు.

## ౮. విపర్యయాధికరణము

పరికింపఁగా శ్రుతివిరోధపరిహారము లేమింజేసి యీ యధికరణమున కిట సంగతి లేదు;

అయిన నుత్పత్తిక్రమము నిరూపింపఁబడఁగా బుద్ధిస్థమగు లయక్రమము నిరూపింపఁబడుచున్న దని పాదాంతర సంగతులు ప్రాసంగికములు గలవు.

ఇట నుత్పత్తిక్రమమునకు విపరీతక్రమనిర్ణయము వలన సిద్ధాంతమునందు భూతములకుఁ బ్రాతిలోమ్యమున లయ ధ్యానపూర్వకముగా బ్రహ్మమునందు మనస్సమాధానమును బూర్వపక్షమునఁ గారణనాశము గల్గుచుండఁగాఁ గార్యనాశము గలుగుటవలన సర్వలయాధార బ్రహ్మసిద్ధివలన ముక్తసమాధ్యసిద్ధియు ఫలములు.

## ౯. అంతరావిజ్ఞానాధికరణము

మీఁదఁ జెప్పంబడిన భూతోత్పత్తిలయక్రమము కర ణోత్పత్తిక్రమముతో విరోధించునా? విరోధింపదా? యని వానికి భౌతికత్వాభౌతికత్వములచే సందేహము గల్గఁగా భూతోత్పత్తిలయక్రమమున కే యద్వైతబ్రహ్మజ్ఞానము ఫలమో యదియే ఫలము గల యింద్రియోత్పత్తిక్రమము నేకఫలకత్వసంగతిచే నిట నిరూపించుచున్నాఁడు.

## ౧౦. చరాచరవ్యపాశ్రయాధికరణము

ఇట్లు తత్పదవాచ్య మగు కారణనిర్ణయముకొఱకు భూతశ్రుతివిరోధము పరిహరింపఁబడియె. ఇకఁ బాదపరిసమాప్తివఱకును త్వంపదార్థశుద్ధికై జీవశ్రుతివిరోధము పరిహరింపఁబడుచున్నది. ఇట జీవాజత్వాదిశ్రుతులకు జాతేష్టిశ్రాద్ధశ్రుతులతో విరోధము కలదా? లేదా? యని సందేహము కలుగఁగా విరోధము కలదని ప్రాప్తింప లౌకికజన్మాదివ్యపదేశసహాయమువలన జాతేష్ట్యాదిశాస్త్రముచే జీవాజత్వాది శ్రుతులు బాధింపఁబడుచున్న వని పూర్వపక్షము. అట్లాచుండగా గరణోత్పత్తిక్రమముచే భూతోత్పత్తిక్రమమునకు బాధ లేకున్నను జీవోత్పత్తిక్రమముచే బాధ సంభవించునని పూర్వాధికరణమునకును దీనికిని ప్రత్యుదాహరణసంగతిగలదు. పూర్వపక్షమున జీవబ్రహ్మైక్యాసిద్ధియు సిద్ధాంతమునఁ దత్సిద్ధియు ఫలములు.

## ౧౧ ఆత్మాధికరణము

అగ్నివలన విస్ఫులింగములువోలెఁ బరమాత్మవలన జీవులందఱు పుట్టుచున్నా రను జీవోత్పత్తి బోధక (యథాగ్నే రిత్యాది) శ్రుతులకును 'స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః' యనునది మొదలగు నసుత్పత్తి శ్రుతులకును బరస్పరవిరోధమువలన సంశయము గల్గఁగా దేహాంతరభోగ్యమగు స్వర్గాది

హేతువిధ్యాద్యసంభవమువలన దేహజన్మనాశములచే జీవ
జన్మనాశములు సంభవింప కున్నను గల్పాద్యంతములందు
నభమునకువలె జీవునకును జన్మనాశములు సంభవించుట
వలన నవి కావచ్చునని ప్రత్యుదాహరణసంగతి పూర్వాధికరణ
మునకును దీనికిం గలదు. పూర్వోత్తరపక్షఫలము వెనుకటిదే
యని గ్రహింపవలెను.

## ౧౨. జ్ఞాధికరణము

అత్రైవమస్య జ్యోతిరిత్యాద్యాత్మస్వప్రకాశత్వశ్రుతు
లకును 'పశ్యంశ్చక్షుశ్శృణ్వన్శ్రోత్ర మిత్యాద్యనిత్యజ్ఞాన
వత్త్వశ్రుతులకును విరోధము కలదా? లేదా? యని సందే
హము గలపుడు విరోధము కలదని పూర్వపక్షము ప్రాప్తించిన
దగుచు నుండఁగా వెనుకటి యధికరణమునఁ జెప్పంబడిన
జీవానుత్పత్తిని హేతువుగా స్వీకరించి యిట స్వప్రకాశత్వ
మును సాధించుటవలన హేతుసాధ్యభావము సంగతి.

## ౧౩. ఉత్క్రాంతిగత్యాగత్యధికరణము

ఆత్మస్వరూపమగు స్వప్రకాశత్వముకంటెఁ గొంచెము
బహిష్ఠమగు పరిమాణము నంతర్బహిర్భావసంగతిచే నిట
విచారించుచున్నాఁడు.

## ౧౪. కర్త్రధికరణము

పూర్వాధికరణమున నణుత్వమాత్మయం దధ్యస్తమని

చెప్పుటచే స్వాభావికమగు మహత్త్వము స్థాపింపఁబడియె. ఇపు డింతకంటెను బహిష్ఠమగు కర్తృత్వ మంతర్బహిర్భావసంగతి చేతనే మూఁడధికరణముల విచారింపఁబడును. చిద్రూపుఁడును మహాపరిమాణముకలవాఁడునగు నాత్మ్ఁడు కర్తయా? కాఁడా? యని యసంగశ్రుతులకును విధ్యాదిశ్రుతులకును విప్రతిపత్తిచే సంశయము కలుగఁగా మీఁదటిసంగతిచేతనే యాత్మ సందుఁ గర్తృత్వ మధ్యస్తమనియు స్వాభావమువలన నసంగత్వమనియు నసంగకర్తృత్వశ్రుతుల కవిరోధమువలనఁ గర్తృత్వ విచారాత్మకాధికరణత్రయమునకుఁ బాదసంగతి గలదు. శ్రుతుల కన్యోన్యవిరోధావిరోధములే పూర్వోత్తరపక్షఫలములు. పక్షాంతరమున బంధాభావమువలన శాస్త్రవైయర్థ్యము పూర్వపక్షమునను కర్తృత్వాదిబంధసత్త్వమువలన శాస్త్రమున కర్థవత్త్వము సిద్ధాంతము నను ఫలములు.

## ౧౭. అంశాధికరణము

జీవుఁడు నిత్యుఁడు, స్వప్రకాశుఁడు, మహాపరిమాణము కలవాఁడు నని శోధితత్వం పదార్థమున కిట బ్రహ్మైక్యమును సాధించుటచే భేదాభేదశ్రుతులకు విరోధాభావము వలనఁ బాదాదిసంగతి కలదు. పూర్వాధికరణమున జీవేశ్వరుల కుపకార్యోపకారకభావము చెప్పఁబడె. భేదాభేద శ్రుతులు సమబలము లగుటవలన విరోధము గల్గఁగా సంబం

ధానిశ్చయమువలన సంబంధాపేక్ష మగు పూర్వోక్తోప
కార్యోపకారకభావము సిద్ధింప దని యాక్షేపసంగతిచే నిది
యుత్పన్నము.

ఇది తృతీయపాదము

---

## పాదము. ౪

### ౧. ప్రాణాధికరణము

వెనుకటి పాదముచే మహాభూతజీవవిషయము లగు
శ్రుతులకు విరోధముం బరిహరించి లింగశరీరవిషయము లగు
శ్రుతులకు విరోధముం బరిహరింపం దలంచి పాదాంతరము
నారంభించుచుం బూర్వాధికరణమునం గర్తృత్వోపాధార
ణముచే బుద్ధిస్థములును గర్తకుపకరణములు నగు నింద్రియ
ముల కుత్పత్తిని బుద్ధిసన్నిధసంగతిచే నిట నిరూపించు
చున్నాఁడు. భూతభోక్తృవిచారానంతరము భౌతికప్రాణవిచా
రము గనుకం బాదములు రెండిటికి హేతు హేతుమద్భా
వము సంగతి. ఈపాదముననుఁ బూర్వపక్షమున శ్రుతులకుం
బరస్పరవిరోధముచే నప్రామాణ్యమును సిద్ధాంతమున వాని
కవిరోధమువలనం బ్రామాణ్యమును ఫలములు. పరికింపంగాం
బ్రాణముల కుత్పత్తి లేదేని యేకవిజ్ఞానప్రతిజ్ఞానుపపత్తివలన
వియదధికరణన్యాయముననే వాని కుత్పత్తి సిద్ధించును.

ఐనను ప్రలయమునఁ బ్రాణసద్భావముం జెప్పు శ్రుతికి గతికథనార్థ మీ యధికరణ మారంభింపఁబడినది. కాఁబట్టి పౌనరుక్త్యము లేదు.

౨. సప్తగత్యధికరణము

వెనుకటి యధికరణమున నింద్రియముల కుత్పత్తి సాధింపఁబడె. ఇటఁ దదాశ్రితసంఖ్యానిర్ణయ మాశ్రయాశ్రయిభావసంగతిచే నిరూపింపఁబడును.

3. ప్రాణాణుత్వాధికరణము

ఇంద్రియము లపరిచ్ఛిన్నాహంకారజన్యము లగుటచే విభువు లగుటవలన వాని కుత్క్రాంతి సంభవింప దని యాక్షేపమువలన నిది యుత్పన్నము కాఁబట్టి యాక్షేపసంగతి.

౪. శ్రేష్ఠాధికరణము

ప్రాణముల కుత్పత్త్యాదుల నిరూపించి ముఖ్యప్రాణోత్పత్తివిషయమై సందేహము గల్గగా నిట నాద్యాధికరణ న్యాయము నతిదేశించుచున్నాఁడు. కనుక సంగత్యాద్యపేక్ష లేదు.

౫. వాయువిక్రియాధికరణము

ణము కలవాఁడు నని

మును సాధించుటచే భేదాభేదశ్రుతులకు విరోధాభావము వలనఁ బాధాదిసంగతి కలదు. పూర్వాధికరణమున జీవేశ్వరుల కుపకార్యోపకారకభావము చెప్పఁబడె. భేదాభేద శ్రుతులు సమబలము లగుటవలన విరోధము గల్గఁగా సంబం

### ౬. శ్రేష్ఠాణుత్వాధికరణము

ఇట్లు ప్రాణమున కుత్పత్తిని స్వరూపమును జెప్పి 'సమోనేన సర్వేణ' యను ప్రాణవిభుత్వబోధక శ్రుతికిని బ్రాణాణుత్వ నిర్వాహకోత్క్రాంతి శ్రుతికి నన్యోన్యవిరోధము కలదా? లేదా? యని సందేహము కలుగుచుండఁగాఁ గాధ్యాత్మిక ప్రాణమున కణుత్వము నాధిదైవిక ప్రాణమునకు విభుత్వము నని విషయభేదమువలన విరోధము లేదని 'అణవశ్చ' యను నధికరణన్యాయాతిదేశమువలన నిట సిద్ధాంతింపఁబడును గాన సంగత్యపేక్ష లేదు.

### ౭. జ్యోతిరాద్యధిష్ఠానాధికరణము

వెనుకటి యధికరణమున నాధ్యాత్మిక ప్రాణమున కణుత్వము నాధిదైవిక ప్రాణమునకు వ్యాపిత్వమును జెప్పఁబడియె. దాని ప్రసంగముచే నాధ్యాత్మిక ప్రాణములకు నాధిదైవికాధీన చేష్టావత్త్వము కలదా? లేదా? యని యిట విచారింపఁబడును. కాఁబట్టి ప్రసంగసంగతి.

### ౮. ఇంద్రియాధికరణము

ఇంద్రియము లుండినఁగదా తదధిష్ఠాతృదేవతాచింత కలుగును; ప్రాణచేష్టకంటె వ్యతిరేకముగా నవియే లేవని యాక్షేపసంగతిచే నిది యుత్పన్నము.

### ౯. సంజ్ఞామూర్తిక్లృప్త్యధికరణము

ఉత్పత్తి కార్యవ్యాపార మఱియు నుత్పాదనము కర్తృవ్యాపారమనియుఁ బ్రసిద్ధము. అందు జగదుత్పత్తి శ్రుతివిరోధము 'నవియదశ్రుతే రి' త్యాది గ్రంథసందర్భముచే నిరసింపఁబడెను. ఇపు డుపాదానకారణశ్రుతివిరోధము పరిహరింపఁబడుచున్నది. అందును సూక్ష్మభూతోత్పత్తి పరమేశ్వరకర్తృక మని శ్రుతులందు నిర్వివాదముగాఁ బ్రతిపాదింపఁబడినది. స్థూలభూతోత్పాదనమున శ్రుతివిప్రతిపత్తి కలదు. కాఁబట్టి తన్నిరాసార్థమై యీయధికరణ మారంభింపఁబడె. పూర్వాధికరణమున నామరూపభేదమువలనఁ బ్రాణమింద్రియభిన్న మని చెప్పఁబడియె. తత్ప్రసంగమున నామరూపక్లృప్తి కింకర్తృక మని యిట విచారింపఁబడుచున్నది గానఁ బ్రసంగమే యవాంతరసంగతి.

ఇది చతుర్థపాదము

ద్వితీయాధ్యాయము ముగిసెను

---

# ఆంధ్ర సూత్ర భాష్యము

అధ్యాయము 3. పాదము ౧.

---

## ౧. తదంతరప్రతిపత్త్యధికరణము

పూర్వాధ్యాయముచే వేదాంతవిహిత మగు బ్రహ్మ దర్శనమునందు స్మృతిన్యాయవిరోధము పరిహరింపఁబడె. వేదార్థ మవిరుద్ధమగుచుండఁగాఁ దజ్ఞానసాధనచింతావసరము గల్గునని యీ రెండధ్యాయములకు హేతుహేతుమద్భావ సంగతి. లింగోపాధి సిద్ధించుచుండఁగాఁ దదుపహిత జీవగత సంసారచింత గల్గును గాఁబట్టి పూర్వపాదమునకు నీపాదము నకు నదియే సంగతి, పూర్వాధికరణమున వ్యవహారార్థము పంచీకరణముక్తము. ఆ వ్యవహార మిట నిరూపింపఁబడును గాన నీ రెండధికరణములకు ఫలఫలిభావసంగతి. ఇటఁ బూర్వపక్షమున నిరాశ్రయప్రాణగత్యభావమువలన వైరా గ్యాభావమును సిద్ధాంతమున భూతాశ్రయ ప్రాణగతివలన వైరాగ్యమును ఫలములు.

## ౨. కృతాత్యయాధికరణము

పూర్వాధికరణమునఁ బూర్వాకర్మాశ్రితము లగు నప్పు లకుఁ బంచమాహుతియందుఁ బురుషరూపమునఁ బరిణామ

శ్రవణ మను హేతువు నాశ్రయించి యబాదిభూతపరి వేష్టితుఁ డగు జీవునకు రంహణము చెప్పంబడియె. ఇట స్వర్గమునుండి యవరోహించు జీవులకుఁ గర్మము లేమింజేసి దత్సమవేతము లగు నప్పులకు నభావమువలన మీఁదటి యధికరణమునఁ జెప్పంబడినది యయుక్త మని యాక్షేపింపఁ బడును గాఁబట్టి యాక్షేపసంగతి. ఇటఁ బూర్వపక్షమునఁ జంద్రలోకభోగమునకుఁ దరువాతఁ గర్మాభావమువలన నాగతి నియమాభావముచేఁ గర్మఫలమున వైరాగ్యాదార్ఢ్య మును సిద్ధాంతమునఁ గర్మవత్త్వముచే నాగతినియమమువలన కర్మఫలమున వైరాగ్యదార్ఢ్యమును ఫలములు.

### 3. అనిష్టాదికార్యధికరణము

ప్రథమాధికరణసిద్ధనియమము (ఇష్టాదికారులే చంద్ర లోకమునకుఁ బోవుదు రను నియమము) నిట నాక్షేపించుట వలన నాక్షేపసంగతి గలదు. పూర్వపక్షమున నిష్టాదిపుణ్య కర్మమును జేసినవారే చంద్రలోకమునకుం బోవుదు రను నియమాభావమువలన నట్టి పుణ్యకర్మమునకు వైయర్థ్య మును బాపకర్మమునుండి వైరాగ్యాదార్ఢ్యమును ఫలములు. సిద్ధాంతమునఁ బాపులకుఁ జంద్రలోకదర్శన మైనను లే దని చెప్పుటచే నిష్టాదిపుణ్యకర్మములకు సార్థక్యమును బాపము నుండి వైరాగ్యదార్ఢ్యమును ఫలములు.

## ౮. సాభావ్యాపత్త్యధికరణము

పూర్వాధికరణమున ‘జాయస్వ మ్రియస్వేత్యేత తృతీయం స్థాన’ మనుచోట స్థానశబ్దమునకు మార్గద్వయోపక్రమసామర్థ్యమువలన మార్గలక్షకత్వము యుక్తమె కాని యిట ‘మేఘో భవతీ’ త్యాదిశ్రుతికి ముఖ్యార్థపరిత్యాగమున హేతు వెద్దియు లేదని ప్రత్యుదాహరణసంగతి. పూర్వపక్షమున శ్రుతికి ముఖ్యత్వమును సిద్ధాంతమున గౌణత్వమును ఫలములు.

## ౯. నాతిచిరాధికరణము

పూర్వాధికరణమునఁ జెప్పంబడిన సాదృశ్యము నుపజీవ్యముగాఁ జేసికొని లోకమున గంతలకుఁ జిరాచిరగతిదర్శనమువలన నిటఁ బూర్వపూర్వసాదృశ్యమున జీవుఁడు చిరకాల ముండి బయలుదేఱునా? యల్పకాలముండి బయలుదేఱునా? యని సంశయించి నియమబోధకశాస్త్రాభావమువలన నెట్లైనం గావచ్చునని పూర్వపక్షముచేసికొని సిద్ధాంతించుచున్నాఁడు. కాఁబట్టి యుపజీవ్యోపజీవకభావసంగతి. పూర్వపక్షమున నియమాభావమువలన నొకప్పుడు విలంబమున యోన్యాపత్తి ఫలము. సిద్ధాంతమున జీవులకు వ్రీహియవాదిభావమునుండి విలంబమున నిర్గమన మను విశేషమువలన నాకాశాదిభావమునుండి శీఘ్రముగా నిర్గమన మగును గనుక

నవిలంబమున యోన్యాపత్తి యగు నను ననుసంధానమువలన వైరాగ్యదార్ఢ్యము ఫలము.

### ౬. అన్యాధిష్ఠితాధికరణము

వెనుకటి యధికరణమునఁ జెప్పఁబడిన యుక్తివలన దుగ్ధప్రవృత్తరశబ్దమునకుఁ జిరకాలావస్థానలక్షకత్వము సంభవించిన నిట క్షీరమునకు దధిభావము చేతనువలె నబాది భూతసంపరిష్వక్తజీవులకు నబాదిద్వారమున వ్రీహియవాది భావముచే ముఖ్యజన్మము సంభవించుటవలన జన్మశ్రుతి ముఖ్యమే కావచ్చు నని ప్రత్యుదాహరణసంగతిచేఁ బూర్వ పక్షము ప్రాప్తింపఁగా సిద్ధాంతము చెప్పఁబడును. ఇటఁ బూర్వపక్షమున స్థావరజన్మనివృత్తికొఱ కధికారులకు యత్న గౌరవము ఫలము. సిద్ధాంతమున వ్రీహియవాది సంశ్లేష మాత్రనివృత్తికొఱకు యత్నలాఘవము ఫలము.

ఇది ప్రథమపాదము

---

## పాదము. ౨

### ౧. సంధ్యాధికరణము

వెనుకటిపాదమునఁ జెప్పంబడిన వైరాగ్యసాధ్యమును వాక్యార్థజ్ఞానసాధనము నగు తత్త్వంపదార్థవివేక మీపాద మున నిరూపింపఁబడును గాఁబట్టి రెండుపాదములకును హేతు

సాధ్యభావసంగతి. ఈపాదము సాధనవిచారాత్మకము గావు నసే యీయధ్యాయమున సంగతి గలదు. పూర్వము గత్యాగతినిరూపణముచే జాగ్రదవస్థ నిరూపింపఁబడిన దని తలఁచి దాని యనంతరభావిని యగుటవలనను స్వయంజ్యోతిష్ట్వసిద్ధియందు స్పష్టసాధన మగుటవలనను స్వప్నావస్థావిచారము చేయఁబడుచున్నది. ఇటఁ బూర్వపక్షమున జాగ్రదవస్థనుండి వలె స్వప్నావస్థనుండి జీవునకు వివేకాసిద్ధి ఫలము. సిద్ధాంతమునందుఁ బ్రాతీతికదృశ్యసాక్షిత్వముచే వివేకమువలన స్వయంజ్యోతిష్ట్వసిద్ధి ఫలము.

## ౭. తదభావాధికరణము

వెనుకటి యధికరణమున నాత్మునకు స్వయంజ్యోతిష్ట్వార్థము బాహ్యాకరణోపరమరూప మగు స్వప్నావస్థను నిరూపించి యిట నతనికి బ్రహ్మాత్మ్యముకొఱకు కంతఃకరణోపరమరూప మగు సుషుప్త్యవస్థను నిరూపించుచున్నాఁడు. స్వప్నాభావము ప్రతియోగిస్వప్నాధీననిరూపణ మగుటవలన హేతుహేతుమద్భావము సంగతి. వెనుకటివలె సుషుప్తి స్వప్నానంతరభావిని యగుటవలన నానంతర్యసంగతి యైనం గావచ్చును. ఇటఁ బూర్వపక్షమున స్థానవికల్పమువలన జీవునకు బ్రహ్మాత్మైక్యానిర్ణయము ఫలము. సిద్ధాంతమున నాడీద్వారమునఁ బురీతత్తును బొంది బ్రహ్మమునందే లయ

నించుచున్నాఁడని సముచ్చయమువలన బ్రహ్మాత్మైక్య నిర్ణయము ఫలము.

### ౩. కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము

సుషుప్తియం దుపాధ్యుపశమమువలనను గర్మాను స్మృతిదర్శనమువలనను నెవఁడు సత్సంపన్నుఁడో వాఁడే లేచుచున్నాఁడా ? వేఱొకఁడా ? యని సంశయము గల్గుచుండఁగా బ్రహ్మమునుండి జీవుని కుత్థానశ్రుతివలన బ్రహ్మమే సుషుప్తిస్థాన మని వెనుకటి యధికరణమున జెప్పంబడె. కాని సుషుప్తునికంటె నన్యునకు నుత్థానము సంభవించుచుండఁగా సుషుప్తమునకు నాడ్యాదిస్థానసంభవత్వమువలన బ్రహ్మమునకే సుప్తిస్థానత్వము యుక్తము కాదని యాక్షేప సంగతిచే నిది యుత్పన్నము. ఇటుఁ బూర్వపక్షమున సుప్తమాత్రునకే యపునరావృత్తిరూపముక్తి సిద్ధివలన జ్ఞానమునకు వైయర్థ్యము ఫలము. సిద్ధాంతమున నజ్ఞాత మగు బ్రహ్మమునం దున్నవాని కజ్ఞానబలముచే మరల నతనికే యుత్థానావశ్యంభావమువలన నజ్ఞాననాశముకొఱకు జ్ఞానాపేక్ష ఫలము.

### ౪. ముగ్ధాధికరణము

ఆత్మ నవస్థాత్రయమునుండి వివేకించి యిట మూర్ఛనుండి వివేకించుచున్నాఁడు. మూర్ఛ జాగ్రదాద్యులలో దేన

నైన నంతర్భవించునా ? వేఱవస్థయా ? యని యవస్థా చతుష్టయము సిద్ధ మగుటవలనను మూర్ఛితునకుఁ దద్ద్వ లక్షణ్యమువలనను సంశయము గల్గఁగా "సోహ" మను ప్రత్యభి జ్ఞానముచే సుప్తునకు సుప్తాభేదమువలె విశేషజ్ఞానాభావ విశేషలింగముచే సుప్తియే మూర్ఛ యను ప్రత్యభిజ్ఞానము వలన మూర్ఛ సుప్త్యంతర్గతమే యని దృష్టాంతసంగతిచేఁ బూర్వపక్షము ప్రాప్తమయ్యెను. పూర్వపక్షమునఁ బ్రసిద్ధా వస్థలకంటె మూర్ఛయందు వేఱుగా నాత్మునకు విశేషావస్థను ప్రసక్త్యాసిద్ధిఫలము. సిద్ధాంతమున వేఱుగాఁ బ్రయత్న ప్రాప్యము ఫలము.

### ౫. ఉభయలింగాధికరణము

ఇట్లుద్దేశ్య మగుటచే మొదట జిజ్ఞాస్య మగు త్వం పదార్థమును సర్వావస్థావినిర్ముక్తముగాను స్వప్రకాశము గాను నిర్విశేషముగాను నిశ్చయించి తజ్జిజ్ఞాసావసరమానంతర మున నవసరసంగతిచే జిజ్ఞాస్యము విధేయము నగు తత్పదా ర్థమును బాదసమాప్తివఱకు శోధించుచున్నాఁడు. మఱియు నెట్లు ముగ్ధత్వము విరుద్ధసుషుప్తి మరణోభయరూపమో యట్లే శ్రుతి ప్రామాణ్యమువలన నుభయరూప మగు బ్రహ్మము ధ్యేయ మని దృష్టాంతముచేఁ బూర్వపక్షముచేసి నిర్విశేషము నేకరూపమునే యగు బ్రహ్మము జ్ఞేయ మని సిద్ధాంతించును.

## ౬ ప్రకృతైతావత్త్వాధికరణము

పూర్వాధికరణమున నిషేధశ్రుతులచే నిర్విశేష ముగ బ్రహ్మము సిద్ధించు నని చెప్పంబడెఁ గాని యాశ్రుతులచే బ్రహ్మము నైతము నిషేధింపఁబడుటవలన నది యుక్తము గాదని యాక్షేపసంగతిచే నీ యధికరణ మారంభింపఁబడు చున్నది. పూర్వపక్షమున బ్రహ్మాసిద్ధియు సిద్ధాంతమునఁ దత్సిద్ధియు ఫలములు.

## ౭ పరాధికరణము

(సేత్వధికరణ మనియుఁ గొందఱు చెప్పుదురు.)

పూర్వాధికరణమున 'నేతినేతి' మొదలగు శ్రుతులచే బ్రహ్మముకంటె నితరమగు వస్తువు నిషేధింపఁబడుచున్న దని యెద్ది చెప్పంబడినదో యది సేత్వాదిశ్రుతులచే వస్త్వంతరాస్తిత్వభానమువలన యుక్తము గాదని యాక్షేపసంగతిచే దీని యారంభము. పూర్వపక్షమున సున్మానాదిశ్రుతులు ముఖ్యములగుటవలన బ్రహ్మము సద్వయ మగుట ఫలము. సిద్ధాంతమున సుక్తాద్వితీయతత్పదలక్ష్యసిద్ధిఫలము.

## ౮ ఫలాధికరణము

పూర్వాధికరణోక్త మగు నిర్విశేషత్వము నుపజీవ్యముగాఁ జేసికొని ఫలదాతృత్వము సహిత మీశ్వరునకు లే దని పూర్వపక్షప్రాప్తివలన నుపజీవ్యోపజీవక భావసంగతి.

బ్రహ్మముకంటె నితర మగు వస్తువు నిషేధింపఁబడఁగాఁ బ్రహ్మము నిర్విశేష మగుటచే ఫలదాతృత్వము లే దని యాక్షేపము గల్గ వ్యావహారిక మగు ఫలదాతృత్వ మవిరుద్ధ మని యిటఁ జెప్పుచున్నాఁడు గాఁబట్టి యాక్షేపసంగతి యేని కలదు. పూర్వము తత్పదలక్ష్యార్థము చెప్పఁబడియె. ఇపుడు తత్పదవాచ్యము చెప్పఁబడుచున్న దని పాదసంగతి. ఇటఁ బూర్వపక్షమున ఫలదాత యగు నీశ్వరుఁ డను తత్పద వాచ్యాసిద్ధివలన లక్ష్యాసిద్ధి ఫలము. సిద్ధాంతమునఁ దత్సిద్ధి ఫలము.

ఇది ద్వితీయపాదము

---

## పాదము. 3

### ౧ సర్వవేదాంత ప్రత్యయాధికరణము

ఇట్లు బ్రహ్మస్వరూపమును నిరూపించి తజ్జ్ఞానసాధన మగు నుపాసనాస్వరూపముం జెప్పుచున్నాఁడు. వెనుకటి పాదముచేఁ దత్పదార్థవివేకము చేయుంబడియె ఇట దాని ఫలమగు వాక్యార్థజ్ఞానము 'ఆనందాదయః ప్రధానస్య' యను సూత్రముచే నపునరుక్తాపేక్షిత పద తద్వాక్యార్థోపసంహార మువలన నిశ్చయింపఁబడును గాన రెండుపాదములకు ఫలఫలి భావసంగతి. సగుణవాక్యార్థచింతయు నా విద్య గలవారికిఁ

జిత్తైకాగ్ర్యద్వారమున నిర్గుణజ్ఞానసాధన మగుటవలనఁ జేయం బడుచున్న దని యెఱుంగవలయును. ప్రాణవిద్య—దహర విద్య- మొదలగునవి ప్రతిశాఖము భేదిల్లునా? భేదిల్లవా? యని రూపాది భేదమువలనను జోదనాద్యవిశేషమువలనను సందేహము గల్గఁగా నిటఁ బూర్వపక్షసిద్ధాంతములు చేయఁ బడుచున్నవి. పూర్వపక్షమున విద్యాభేదమువలన గుణానుప సంహారమును సిద్ధాంతమున విద్యల కభేదమువలన గుణోప సంహారమును ఫలములు.

౨. ఉపసంహారాధికరణము

వెనుకటి యధికరణమునఁ జేయఁబడిన యుపాసనైక్య విచారమునకుఁ బ్రయోజన మిటఁ జెప్పంబడుచున్నది. కాఁబట్టి పాదాదిసంగతులు దానికివలె దీనికిని గలవు. వేర్వేఱుశాఖ లందు సమానవిద్యలో శ్రుతములగు గుణములు శ్రుత్యను సారముగా వ్యవస్థితములా? వేఱొకశాఖలో వినంబడినవి మఱియొకశాఖలో నుపసంహర్తవ్యములా? యని సందేహము గల్గఁగా విద్యైక్యమున్న నెట నేగుణములు వినంబడినవో వానిచేతనే విద్యోపకారసిద్ధివలన వ్యవస్థితము లని పూర్వ పక్షము. దీనికి విద్యైక్యచింతానైష్ఫల్యము ఫలము. సిద్ధాంత మునఁ దత్సాఫల్యము ఫలము.

### ౩. అన్యథాధికరణము

ఇటఁ బూర్వాధికరణసిద్ధాంతన్యాయముచే నుద్గీథ విద్య యను సంజ్ఞైక్యమున విద్యైక్య మని పూర్వపక్షమున నన్యోన్యగుణోపసంహారము ఫలము. సిద్ధాంతము నసంజ్ఞైక్య మున్నను విద్యైక్యాపవాదమువలన గుణానుపసంహారము ఫలము. ఇక్కెటఁ బూర్వాధికరణసిద్ధాంతన్యాయముచేఁ బూర్వ పక్షము ప్రాప్త మగునో యట నాపదాదికి సంగతి యని తెలియవలెను.

### ౪. వ్యాప్త్యధికరణము

పూర్వాధికరణమున నుద్గాతృ కర్మాత్మకోద్గీథావయ వత్వము ధ్యేయ మగునోంకారమునకు విశేషణ మని నిశ్చ యించి ధ్యేయభేదమువలన విద్యాభేదము సిద్ధాంతింపఁబడియెం. అనిశ్చయము యుక్తము గాదని యిట నాక్షేపసంగతిచేఁ బూర్వపక్షము చేయఁబడుచున్నది. పూర్వపక్షమునఁ దత్సి ద్ధాంతాసిద్ధియు సిద్ధాంతమునఁ దత్సిద్ధియు ఫలములు.

### ౫. సర్వాభేదాధికరణము

ఓంకారమున కుద్గీథ విశేషణత్వమువలన సర్వవేద వ్యాప్తి వ్యావృత్తివలెనే ప్రకృతగుణమాత్రగ్రాహక మయి నట్టి 'ఏవం' శబ్దమువలన శాఖాంతరగుణవ్యావృత్తి యగు నని దృష్టాంతసంగతిచేఁ బూర్వపక్షము ప్రాప్తమయ్యెను. గుణోప

సంహారాయసనంహారములే పూర్వోత్తరపక్షఫలములు.

## ౬. ఆనందాద్యధికరణము

ప్రాణము సవిశేష మగుటవలన శాఖాంతరమునందలి వసిష్ఠత్వాదిగుణోపసంహారము తగును గాని బ్రహ్మము నిర్విశేష మగుటవలన స్వశాఖాగతము లగు పదములచేతనే జ్ఞానము సంభవించును గాఁబట్టి యన్యశాఖాగతము లగు నానందాదిపదముల కుపసంహార మయుక్త మని ప్రత్యుదాహరణసంగతిచేఁ బూర్వపక్షము ప్రాప్తింపఁగా సిద్ధాంత మిటుఁ జేయంబడును. పూర్వపక్షమున సత్యాదిగుణానుపసంహారమువలన వాక్యార్థానవధారణమును సిద్ధాంతమున గుణోపసంహారమువలన వాక్యార్థావధారణమును ఫలములు.

## ౭. ఆధ్యానాధికరణము

పూర్వాధికరణమున బ్రహ్మస్వభావములు నుపసంహార్యములు నగు నానందాదులకు బ్రహ్మజ్ఞానఫలోపాయత్వము చెప్పంబడియె. ఇట నబ్రహ్మస్వభావములు ననుపసంహార్యములు నగు నర్థాదిపరత్వమునకుఁ దదుపాయత్వము చెప్పంబడును గాఁబట్టి యేకఫలకత్వసంగతి. పూర్వపక్షమున వాక్యభేదమువలన విద్యాభేదమును సిద్ధాంతమున వాక్యైక్యమువలన విద్యైక్యమును ఫలము.

## ౭. ఆత్మగృహీత్యధికరణము

పూర్వాధికరణమున వాక్యభేదభయమువలన నర్థాది వాక్యముల కర్థాదిపరత్వము లేదని చెప్పంబడె. ఆట్లే యిటను 'ప్రజాపతే ర్లోకో వేదా' యను వెనుకటి ప్రజాపతివాక్యము కంటె భేదప్రసంగమువలన 'ఆత్మా వా ఇద మి' త్యాది వాక్యమునకు బ్రహ్మపరత్వము లేదని దృష్టాంతసంగతిచేఁ బూర్వపక్ష ముత్పన్నము. ఇట్టిఁ బూర్వపక్షమున వాక్యము సూత్రాత్మోపాస్తిపర మగుటవలనఁ బర బ్రహ్మధర్మము లగు నానందాదుల కైతరేకమున ననుపసంహారము ఫలము. సిద్ధాంతమున వాక్యము బ్రహ్మపర మగుటవలన నుపసంహారము ఫలము. (ఈయధికరణసూత్రములకు వేఱువ్యాఖ్యానము గలదు. అందలి సంగత్యాదుల నిట గ్రంథవిస్తరభయమున వ్రాయనైతిని.)

## ౮. కార్యాఖ్యానాధికరణము

పూర్వాధికరణమున సందిగ్ధ ముపక్రమమునకు వాక్యశేషమువలన బ్రహ్మత్వనిర్ణయమువలెనే యిటను 'ఆచామంతి' యను పదమునకు విధిత్వసందేహము గల్గి యుండఁగాను 'ఆచామే' త్తను వాక్యశేషమువలన విధిత్వనిర్ణయ మని దృష్టాంతసంగతిచేఁ బూర్వపక్షముఁ జేసి సిద్ధాంతించుచున్నాఁడు. పూర్వపక్షమునఁ బ్రాణవిద్యాంగముగా

విహిత మగు నపూర్వాచమనమును వేఱొకచో నుపసం
హారము ఫలము. సిద్ధాంతమున నది యవిధేయ మగుటవలన
నంగముగా ననుపసంహారము ఫలము.

౧౦. సమానాధికరణము

పూర్వాధికరణమున నపూర్వము లగుటవలన నాచ
మనవాసస్త్వధ్యానములలో నేది విధేయ మని సందేహము
గల్గఁగా వాసస్త్వధ్యానము విధేయ మని చెప్పఁబడియె. ఇట
నేకశాఖలో దూరదేశమందున్న రెండువాక్యములలో నొక
దానికి విధిత్వమును వేఱొకదాని కనువాదత్వము నను
నిశ్చయము లేకపోవుటవలన రెంటికిని విద్యావిధిత్వ మని
ప్రత్యుదాహరణసంగతిచేఁ బూర్వపక్షము చేసి సిద్ధాంతిం
చెను. గుణోపసంహారానుపసంహారములు పూర్వోత్తరపక్ష
ఫలములు.

౧౧. సంబంధాధికరణము—దీనిని సత్యవిద్యాధి
కరణ మనియుఁ జెప్పుదురు

పూర్వాధికరణమున విద్యైక్యమువలన గుణోపసంహా
రము చెప్పఁబడినది. అట్లే యేకవిద్యయందు నుపసంహారము
వేఱొకచోటనుం గావలె నని దృష్టాంతసంగతిచేఁ బూర్వపక్ష
మిటఁ జేయఁబడుచున్నది. పూర్వపక్షమునఁ బ్రతిష్ఠానము
నామద్వయానుష్ఠానమును సిద్ధాంతమున శ్రుత్యనుసారముగా

నేకనామానవస్థానమును ఫలములు.

## ౧౨. సంభృత్యధికరణము

ఎట్లు పూర్వాధికరణమున స్థానభేదమువలన నామము లకు వ్యవస్థయో యట్లే స్థానభేదమువలననే సంభృత్యాదు లును శాండిల్యాదివిద్యయందుపసంహరింపబడవని యిట నతి దేశింపఁబడును గాఁబట్టి వేఱుగా సంగత్యాదులాకాంక్షిత ములు గావు.

## ౧౩. పురుషవిద్యాధికరణము

పూర్వాధికరణమున విద్యైక్యసాధన మగు నసాధా రణగుణప్రత్యభిజ్ఞానాభావమువలన సంభృత్యాదులకు శాండి ల్యాదివిద్యలందుపసంహారము లేదని యెద్ది చెప్పంబడినదో యది యుక్తమే కాని యిట నపథృథముగాఁ గల్పింపఁబడిన మరణరూపాసాధారణగుణము రెండు చోట్ల నుండుటచే విద్యైక్యప్రత్యభిజ్ఞానమువలన గుణోపసంహారము యుక్త మని ప్రత్యుదాహరణసంగతిచేఁ బూర్వపక్షము రాఁగా సిద్ధాంతించుచున్నాఁడు. గుణోపసంహారానుపసంహారములే పూర్వోత్తరపక్షఫలములు

## ౧౪. వేధాద్యధికరణము

పూర్వాధికరణమునఁ బురుషయజ్ఞమాత్మవిద్యాసన్ని ధానమున 'సనికివలనఁ దచ్ఛేషమని చెప్పంబడియె. అట్లే

సాన్నిధ్యమువలన మంత్రములుం బ్రవర్గ్యాదికర్మములు నాయా యుపనిషదుక్తవిద్యలం దుపసంహరింపఁబడవలెనని దృష్టాంత సంగతిచేఁ బూర్వపక్షము ప్రాప్తింపఁగా నిట సిద్ధాంతింపఁ బడును. పూర్వోత్తరపక్షఫలములు పూర్వపువే.

౧౫. హాన్యధికరణము

పూర్వాధికరణమున నెల్లు విద్యాసన్నిధానమున వినం బడినను మంత్రాదుల కసామర్థ్యమువలన విద్యలయం దనుప సంహారము చెప్పంబడెనో యట్లే కౌషీతకి రహస్యమున హానసన్నిధిని వినంబడిన యుపాయనమునకు నుపాదానమును వినాగనే హానసంభవమువలన హానమున కుపాదానాకర్షణ సామర్థ్యము లేదు కాబట్టి యుపసంహారము లేదని దృష్టాంత సంగతిచేఁ బూర్వపక్షము ప్రాప్తింపఁగా సిద్ధాంతము చెప్పఁ బడును. పూర్వపక్షమున విద్యాప్రకర్షాసిద్ధియు సిద్ధాంతి మున దత్సిద్ధియు ఫలములు

౧౬. సాంపరాయాధికరణము

పూర్వాధికరణమున విద్య కర్మహానిహేతు వని నిశ్చ యించి కేవల హానశ్రవణమునను నుపాయనోపసంహారము చెప్పంబడె. ఇట విద్యకుఁ గర్మహానిహేతుత్వ మాక్షేపింపఁ బడుచున్నది గాఁబట్టి యాక్షేపసంగతి. విద్యకుఁ గర్మహే తుత్వాసిద్ధియుఁ దత్సిద్ధియుఁ బూర్వోత్తరపక్షఫలములు.

### ౧౭. గత్యర్థవత్త్వాధికరణము

సగుణవిద్యలయందొకానొకచోట నర్చిరాదిమార్గము వినంబడుచున్నది. నిర్గుణవిద్యయందు వినంబడదు. హానసన్నిధియందు శ్రుతమగుటవలన నపేక్షిత మగుటవలనను సంశయముగల్గఁగా నెట్లొకచోట హానసన్నిధియందు శ్రూయమాణమగు నుపాయన మంతట నుపసంహరింపఁబడుచున్నదో యట్లే హానసన్నిధియందొకానొకచోట శ్రూయమాణమగు దేవయానమార్గము నంతట నుపసంహరింపఁబడవలె నని దృష్టాంతసంగతిచేఁ బూర్వపక్షము ప్రాప్తమయ్యెను. పూర్వపక్షమున నిర్గుణవిదునకు స్తుత్యర్థము మార్గాపేక్ష ఫలము. సిద్ధాంతమున ననపేక్ష ఫలము.

### ౧౮. అనియమాధికరణము

సగుణవిద్యలలో దహరాదివిద్యలయందు దేవయానమార్గము వినంబడుచున్నది. మధువిద్య మొదలగువానియందు వినంబడదు. సగుణవిద్యలు కొన్నిటియందు వినంబడినమార్గము తక్కినచోట్ల నుపసంహర్తవ్యమా? కాదా? యని సంశయము గల్గఁగాఁ బ్రకరణబలమువలన నేప్రకరణమున వినంబడినమార్గ మటనే కాని వేఱొకచోట నుపసంహర్తవ్యము కాదని నియమము కలదని పూర్వాధికరణదృష్టాంతముచేఁ బూర్వపక్షము ప్రాప్తింపఁగా నిట నియమాపవాదమువలన

